ప్రబంధ వాఙ్మయ
పరిణామము

# కావ్య రీతులు

---

'విమర్శకావతంస'
విన్నకోట మాధవరావు



యం. శేషాచలం అండ్ కంపెని,
మచిలీపట్టణము సికింద్రాబాదు . మద్రాసు-1
మూల్యము రు 3-50

# తొలిపలుకు

ఆంధ్ర సారస్వతములో నొక ప్రత్యేకస్థాన మాక్రమించినది ప్రబంధ ప్రక్రియ ప్రభుసమ్మితములగు వేదముల కన్నను, మిత్రసమ్మితములగు పురాణముల కన్నను, కాంతాసమ్మితములగుట చేమో కావ్యములె ఎక్కుడుగ సారస్వతేయులచే గాక సామాన్యుల గూడ నాకర్షించి యాదరణీయ మైనవి సంస్కృత సారస్వతమున కావ్యములను ప్రబంధములనిచెప్పు ఆచారము కలదు రెండు శబ్దములును ఏకార్థ ప్రతి పాదకములే మాలతీ మాధవీయాది దృశ్య కావ్యముల గూడ ప్రబంధములనియే చెప్పెడువారు ఆంధ్ర సారస్వతమున నటుల గాదు ప్రబంధ లక్షణములని కొన్నిటిని ఆంధ్రలాక్షణికులు నిర్ణయించిరి ఆ లక్షణములకు కట్టుబడియే కవులు ప్రబంధముల రచించు చుండిరి ఈ ప్రబంధ రచన విరివిగ విజయనగర సామ్రాజ్యాధిపుల కాలమున జరిగి శ్రీకృష్ణ దేవరాయల అండదండల పరిపూర్ణవికాసము గాంచినది 'విజయనగర సామ్రాజ్యము సారస్వత వికాసము' అను శీర్షికతో ఆయిదారు వత్సరములకు పూర్వమే కొంత రచన సాగించితిని ఆసందర్భమును పురస్కరించుకొని ఆ యాకాలముల వెలువడిన వివిధ గ్రంథములను అందు కొన్ని గ్రంథములమీద వెలువడిన విమర్శనలను వాద ప్రతి వాదములను చదువుట తటస్థించినది అంత నామనసున కొన్ని నూతన భావములు రేకెత్తినవి ప్రబంధయుగమనునది యెప్పటినుండి యెప్పటి వఱకు? ఆ యుగమున వెలువడి ప్రబంధములని కొందఱిచే వాకొనబడు కావ్యములన్నియు ప్రబంధ నామార్హములగునా? ప్రబంధ మహావృక్షమునకు అంకుర మేనాడు వేయబడినది? దానిని ఏ కాలమున ఏయేకవు లెంతవరకు ప్రోదిజేసిరి? ఆ మహావృక్షము శాఖోప శాఖలుగ నెటుల వృద్ధిజెందినది? మొదలగు ప్రశ్నలుత్పన్న మయినవి ఆ ప్రశ్నలకు సమాధానమే ప్రబంధ వాఙ్మయ పరిణామ వివరణయగు ఈ కావ్యరీతులు

ప్రబంధరచన కాద్యుడు నన్నెచోడు డనువారు కలరు ప్రబంధములు వర్ణనా ప్రధానమైనవి అట్టి వర్ణనలకు వస్తు కవితకు నన్నెచోడుని కుమార సంభవ కావ్యము ఆటపట్టు, కొలదిగనో గొప్పగనో పురాణములందు సహితము వర్ణనలు లేకపోలేదు భారతాదులందు వర్ణనావైదగ్ధ్యము లేక పోలేదు అంత మాత్రమున ఆ గ్రంథము లన్నియు ప్రబంధ శ్రేణిలో జేరవు ప్రబంధ రచనకు ఆద్యుడన దగినవాడు కవిసార్వభౌముడు శ్రీనాథుడు అయినను వస్తుకవితకు వర్ణనావైభవమునకు ప్రాధాన్యమిచ్చి శబ్దాలంకారిక రీతిని గ్రంథ రచన రసవత్తరముగ నిర్వహించి తరువాత కవులకు మార్గదర్శకుడైన

సోమనాథుని కాలము నుండియు ప్రబంధరచన ఒక విశిష్ట మార్గమున విస్పష్ట రేఖలతో రూపొందిన దనవచ్చు నాచనసోముడు విజయనగర రాజ్యస్థాపకులగు హరిహర బుక్కరాయ సోదరుల కాస్థానకవి ఆరాజ్యస్థాపనతో ప్రారంభమై రాజ్యాభివృద్ధితో పాటు రాజాదరణమున దినదిన ప్రవర్థమానమైనది ప్రబంధ వాఙ్మయము ఆ కారణమున విజయనగర సామ్రాజ్యాధిపుల కాలమునకు జెందిన రచనలే యిందు పరిశీలింప బడినవి అంతమాత్రమున ఆయా గ్రంథముల నన్నిటిని సమగ్రముగ విమర్శించితినను తలంపు లేదు ఒక్కొక్క కావ్య విమర్శన మొక్కొక్క బృహద్గ్రంథ మగును ఏయుగమున వెలసిన కావ్యము లెంతవరకు ప్రబంధ లక్షణములకు నిలుచును? ఏయేకవి ఏయే ప్రక్రియలచే ప్రబంధ వాఙ్మయమునకు సువర్ణాలంకారముల నెంతవరకు సమకూర్చెను? ఆయా గ్రంథముల ప్రత్యేక వైశిష్ట్యమేమి? ఏయేగ్రంథ మేమేమి ప్రయోజన ముల సాధించుటకు నుద్దేశింపబడినది? కావ్యప్రయోజనములగు ఆనందోపదేశము లెంతవరకు సాధింపబడినవి? ఏకవి ఏకవిని యెంతవరకు అనుకరించెను అనుస రించెను? అందుచే నూతనశోభ నెంతవరకు వెలయించెను? అను విషయముల విపులపరచ యత్నించితిని

ఈ గ్రంథరచనయందు పలువురకు ఋణపడియున్నాను ఏయే గ్రంథ ములలో ఏయేపత్రికలలో ఎవరెవరు వ్రాసినవి చదివితినో యిదమిద్ధమని నేను చెప్పలేను ఆయా రచనల నుండి కొన్ని విషయములు నా రచనలయందు దొరలియే యుండును వారి భావములతో నన్నియెడల నే నేకీభవించి యుండక పోవుటయు సహజము అయినను వారందరకు నేను కృతజ్ఞుడను ఈయెడ నా ప్రాణమిత్రులు శ్రేయోభిలాషులునగు ఆచార్య పింగళి లక్ష్మీకాంత కవి కీ శే మహాకవి కాటూరి వెంకటేశ్వరరావు గార్ల సహవాస సౌహార్ద ములే నన్నిపాటి సాహిత్యోపాసుని జేసెననుట నిస్సంశయమగు యథార్థమని చెప్పక తప్పదు

ఈ గ్రంథరచనకు ప్రోత్సహించిన మిత్రులకు నా రచనల నభిమానిం చిన వారికి కృతజ్ఞుడను దీనిని ప్రచురించిన మిత్రులు మద్దూరి శేషాచలం పంతులు గారికి సారస్వత ప్రియులగు వారి కుమారులు చి నరసింహారావు సుబ్బారావు సోదరులకు కృతజ్ఞుడను

మచిలీపట్టణము
20-4-68

విద్వజ్జన విధేయుడు
విన్నకోట మాధవరావు

# విషయ సూచిక


| | | పేజి |
|---|---|---|
| తొలిపలుకు | | iii |
| 1 | పరిణామము | 1 |
| 2 | ఉత్తరహరివంశము | 14 |
| 3 | శృంగారశాకుంతలము | 27 |
| 4 | స్వారోచిషమనుసంభవము | 50 |
| 5 | పారిజాతాపహరణ | 112 |
| 6 | ఆముక్త మాల్యద | 122 |
| 7 | కాళహస్తిమాహాత్మ్యము | 132 |
| 8 | రాయలనాటి ఇతరకవులు | 141 |
| 9 | ప్రభావతీ ప్రద్యుమ్నము | 147 |
| 10. | వసుచరిత్ర | 167 |
| 11. | పాండురంగ మాహాత్మ్యము | 179 |




# 1

# పరిణామము

సృష్టికి పూర్వము శూన్యమో, దృగ్గోచరముగాని పరమార్థమేమైన నుండెనో చెప్పలేము ఆ నిరామయస్థితిలో నాదబ్రహ్మ ముత్పన్నమయినది అది 'ఓం' కార స్వరూపము ఆ ప్రణవమే వాక్కుగ రూపొందినది దానినుండి ఛందము లుద్భవించినవి నారాయణాంశ సంభూతుడగు వ్యాసమనీషి ఛందోరూపములగు వేదములను విభజించినాడు పిమ్మట వేదాంగములు, దర్శనములు వెలసినవి కాలాంతరమున మన్వాది స్మృతులు పుట్టినవి చతుష్షష్టికళలు జనించినవి వేద ములందలి బ్రాహ్మణములు కర్మ ప్రతిపాదకములు ఆరణ్యక ములు జ్ఞానప్రతిపాదకములు కర్మజ్ఞానములగు నీ రెండుమార్గ ములను పూర్వోత్తర మీమాంసలు ప్రపంచించినవి బ్రాహ్మణ ములలో నర్థవాదము లనబడు నితిహాసములు గలవు వేదములు ప్రభుసమ్మితములు శబ్దప్రధానములు ప్రభువుఆజ్ఞలవలె వేదవిధు లను పాలింపవలయునేకాని 'ఏల' యను హేతువాదమునకుతావు లేదు ఆ విధులకు తెలివిడియే అర్థవాదములు

వేదప్రతిపాదితమగు పరమార్థమును దర్శనములు భిన్న మార్గముల సాధించుటలో వేదప్రామాణ్యముతోపాటు అనుమా

నాది ప్రమాణముల కాసాకార మొదవినది. ప్రత్యక్షప్రమాణ వాదులు నాస్తికులు ప్రబలిరి. వేదప్రతిపాదితము, ప్రభుసమ్మితమునైన ధర్మస్వరూపమును స్మృతులు నిరూపించినవి. నానా విధమైన ధర్మముల కేకవాక్యత కుదుర్చవలసి వచ్చినది. నిర్గుణమగు తత్త్వమును మధ్యమమందాధికారులకొరకు సగుణబ్రహ్మముగా నిరూపింపవలసి వచ్చినది. వ్యాసమహర్షియే నిర్గుణబ్రహ్మ నిరూపకములగు బ్రహ్మసూత్రములను సగుణబ్రహ్మ ప్రతిపాదకములగు నష్టాదశపురాణములుగ రచించెను. భారతమున వేదమంత్రములు లేవు. కాని మంత్రార్థము తన్మాహాత్మ్యములుగలవు. బ్రాహ్మణములలోని క్రతుకల్పన దీనియందు లేకున్నను కొన్ని యెడల తద్విధానము నిర్వచింపబడినది. బ్రాహ్మణములలోని అర్థవాదములు ఉపాఖ్యానముల రూపమున భారతమున రూపొందినవి. ధర్మ సూక్ష్మ విచార విషయకమైన ఉపాఖ్యానములు చాల భాగము బ్రాహ్మణముల నుండి గైకొనబడినవే. ఉపనిషత్తుల నుండి గ్రహించిన జ్ఞాన ప్రతిపాదకములగు ఘట్టములు భారతమున పెక్కులున్నవి. ఏది వేదాంత శిరోరత్నమో, ఏది ఖండాంతర పండితులచేతను, జ్ఞాన యోగులచేతను శ్లాఘింపబడుచున్నదో అట్టి సర్వోపనిషత్సారమైన భగవద్గీతను భారతమే మనకు ప్రసాదించినది. అష్టాదశ పురాణములు నామరూపాత్మకుడగు నీశ్వరుని గూర్చి ప్రపంచింప భారతము ముఖ్యముగా మానవధర్మమును నిరూపించెను. మర్త్యలోకమునకు దేవలోకమునకు బాంధవ్యము గూర్చినది. వేదాంతర్గతమగు ధర్మవిధులు ఇతిహాసములుగ, సందర్భోచితములైన ఉపాఖ్యానములుగ బోధింపబడినవి. వేదములందు ప్రభుసమ్మితముగా విధింపబడిన జ్ఞానకర్మకాండలగు పురాణేతిహాసములు కథాచ్ఛలమున నుపాఖ్యానరూపమున మిత్రసమ్మితముగ, సర్వులకు మదికెక్కునటుల తెలియజెప్పినవి. ముఖ్యముగా ధర్మ విషయమున శ్రుతిస్మృతుల కేకవాక్యత కుదురని ఘట్టములందు భారతేతిహాసము పరమప్రమాణముగ పేరుగన్నది. శాస్త్ర

చర్చచే, హేతువాదములచే గహనమై, సామాన్యబుద్ధి కందని ఈశ్వరస్వరూపమును, ధర్మస్వరూపమును భారతాదులు సమన్వయించి బాటలు తీర్చినవి. సకల వర్ణములకు, ఆశ్రమములకు ఆచరణీయములగు ధర్మములను మిత్రుడు హితము నుపదేశించినట్లు భారతాదులు మానవలోకమున కుపదేశించినవి. వేదములందు జెప్పబడిన విధినిషేధముల పరమార్థమును అనునయపూర్వకముగ బ్రీతితో మన మేలుగోరి తెలియజెప్పు స్నేహితుని వంటి వీ పురాణేతిహాసములు. మానవు డనుభవించు శుభాశుభములకు కారణమైన కర్మస్వరూపమగు దైవమును ప్రతిపాదించి ఐహికజీవనాంధకారమున వెలుగుకంబములు నిల్పినవి. ధర్మమనునది యెవరో శాసించునది కాదనియు, లోకయాత్రను సౌఖ్యమయము చేయునదెల్ల ధర్మమనియు, ఇహాపరములను, సుఖదుఃఖములను మానవుడే తనకుదా నిర్మించుకొనుననియు, దీనికొకరు శాస్తలు, శిక్షకులు లేరనియు, దైవము కర్మఫల ప్రదాతయే కాని స్వతంత్రుడు కాడనియు పురాణేతిహాసములు ప్రపంచించినవి. మానవుడొనర్చు కర్మయే బంధహేతువు. కర్మమయ ప్రపంచమున నడుగిడిన ఈశ్వరుడు కర్మబద్ధ డగును. కావున జనకుడు, ధర్మవ్యాధుడు మున్నగువారివలె, ఎవరి యాశ్రమధర్మమును వారు నిర్వర్తించుచు స్వధర్మవిహితమైన కర్మనాచరించుట లెస్స యనియు, అట్లొనర్చినచో లోకము కల్యాణమయ మగుననియు భారతాదులు పెక్కుభంగుల తెలియజెప్పినవి. కావున పురాణేతిహాసము లర్థప్రధానములై, ధర్మోపదేశకములై యలరారుచున్నవి. కథాకథనమును, ధర్మోపదేశమును వీనియందు పరికింపవలెను. తదనంతరకాలమున బుట్టిన కావ్యములవలె రసమును సాధించుట వీని పని కాదు. అట్లని యివి కేవలము నీరసములనరాదు. రససాధనకు ముఖ్యమైన కథయు, నందలి యాలంబనములు నుండనే యున్నవి. కావున పురాణేతిహాసములు పనిపెట్టుకొని రసమును సాధింపవుగాని యవి రసదూరము లనరాదు.

కొందఱకు ప్రభుశాసనమే చాలును. దండభీతిచే, భక్తిచే వారు శాసనము ననువర్తింతురు. మఱికొందఱకు పాపపుణ్య స్వరూపమును విప్పిచెప్పవలయును. విశ్వాసపూర్వకముగా, స్నేహపూర్వకముగా, హితాహితములను దృష్టాంతములతో దెలియజెప్పవలయును. మఱికొందఱకు రాజునాజ్ఞకంటె, మిత్రుని హితోపదేశముకంటె ప్రియురాలి మాటపై మక్కువ యధికము. వారికి ప్రత్యక్షబోధ గిట్టదు. కాంతలు ప్రత్యక్షముగ హితబోధ చేయరు. వారి మాటలు వేఱు; మనసులు వేఱు. కాని మన సిచ్చిన రసికులు కాంతల మాటల వెనుకనున్న మనసు నిట్టె గ్రహింతురు. అట్టివారికొఱకు కాంతాసమ్మితము లగు కావ్య ములు పుట్టినవి. కావ్యములు పరోక్షమార్గముననే ధర్మమును హృద్గతమొనర్చును. వ్యాఖ్యాతలు మాత్రమే ఆ కావ్యములను తత్త్వదృష్టితో వివేచించి, ధర్మసారమును వెలికిదీయ జూతురు. రాజమందిరముల, రాజుల ఆస్థానముల నుండి విషయలోలురగు రాజన్యుల నాశ్రయించిన కవులుగూడ, ఆ రాజుల మనోరంజనము నకై కవితానైపుణ్యమును వినియోగింపవలసి వచ్చినను, పరోక్ష ముగ ధర్మప్రతిపాదనము మానినవారు కారు. భారతీయ ప్రకృతి బయట నెట్టి విషయలంపటమున జిక్కికొన్నను, వారి లోపల దాగియుండు ధర్మనిరతియు, వైరాగ్యబోధ మును పూర్తిగ లోపింపజాలవు. భారతవాణి అంతరమునుండి మేఘగర్జనమువలె 'న ఖలు న ఖలు' అని ధర్మఘోష చేయు చునేయుండును. భారత వర్షమున ఆర్యధర్మము ఏనాడును నిశ్శేషముగ లోపింపలేదు. ఇది కర్మభూమి. భారతసభ్యత యందు ఇహపరముల సమన్వయము జేసికొనగలిగిన చైతన్య శక్తి కలదు. అర్థకామములు సంఘముపై బడి కొల్లగొట్టకుండ ధర్మమోక్షములు హెచ్చరిక గలిగియే యుండును. ఈ భారత ధర్మము కాళిదాసు ముఖత భోగత్యాగములను సమన్వ యించినది.

'శై సవేఽభ్య స్తవిద్యానాం యౌవనే విషయైషిణాం
వార్ధకే మునివృత్తీనాం యోగేనాంతే తనుత్యజామ్'

అని కవికులగురువు ఆర్యసభ్యతయొక్క సమరస ధర్మమును సూచించినాడు భారత కావ్య జగత్తునం దొక వైశిష్ట్యము కలదు ఆధ్యాత్మిక జ్ఞానసంపద భారతజాతి జీవనమును లోపలను బయటను గూడ తదితరములనుండియు నావరించి ప్రకృతిగతమై పాదుకొనిపోయినది భారతకవి రసభావ వరవశుడగుటతోడనే వాస్తవజగత్తు నతిక్రమించి ఆనందరసమగ్నుడగును. అప్పుడు ఊర్ధ్వలోకము లన్నియు వివృతద్వారములై కవికి అమృతాభిషేచనము జేయును ఇయ్యవి అప్రయత్నముగా చేకూరును ఉపాసనబలముచే సిద్ధించిన ఆత్మప్రతిభ ఆర్యఋషుల కృపాకటాక్షముచే జేకూరిన నిస్తులభాగ్యము భారతసంస్కృతి, ప్రాచీనసారస్వతము చందనతరువులు, వాటిని తఱచినకొలది క్రొత్త క్రొత్త పరిమళములు బహిర్గతములగును

కాలమునుబట్టి సంఘమును, సంఘమునుబట్టి భాషయు మార్పులు జెందునని శాస్త్రజ్ఞులందురు వేదములసంస్కృతభాషకు, కావ్యభాషయగు సంస్కృతమునకు భేదముకలదు వేదకాలపు సంస్కృతము ప్రాకృతుల నోటబడి వికృతినందినది అట్టిప్రాకృతభాషనుండియే మాగధి, కాశ్మీరి, మహారాష్ట్రీ ఆంధ్ర, శౌరసేనాదులగు దేశభాష లుత్పన్నమయిన వందురు ఇట్టి వన్నియు నపభ్రంశ భాషలు పండితులు ప్రాకృతమును సంస్కరించికావ్యభాషయగు సంస్కృతభాషను రూపొందించిరి కనుక భాష మీదను, గ్రంథరచనమీదను కాలమునకు, సంఘమునకు ప్రబల ప్రభావము కలదను విషయము నంగీకరింపవలయును

ఇక ఆంధ్రవాఙ్మయాభివృద్ధి యెటుల జరిగినదో కొంత విచారింతము తెలుగుభాష తొలుదొల్త నేరూపమున నున్నదియు నేరును జెప్పలేరు. అది పెక్కు మార్పులు జెందినది తెలుగు

తెనుగు, ఆంధ్రము అను శబ్దములు ఏకార్థసూచకము లేల అయినవో, ఎప్పుడయినవో నిష్కర్షగ జెప్పలేము. శ్రీనాథుడు దీనిని కర్ణాటభాష యని పేర్కొనినాడు. ఈ భాషయందు లిపి కూడ మొదటినుండియు ఒకేరూపమున లేదు. సంస్కృతప్రాకృత భాషలందును లేదు.

తెలుగు భాషయందు కావ్యసృష్టి యేనాడు ప్రారంభ మయినదో చెప్పలేము. నన్నయభట్టారకునకు పూర్వము ఆంధ్ర వాఙ్మయరూప మెటులున్నదో నిర్ణయించుటకు తగినన్ని యాధారములు లేవు. అయినను ఛందోబద్ధమగు రచన నన్నయకు పూర్వమే కలదనియు, దేశీయచ్ఛందమున పద్యరచన సాగినదనియు తెలియుచున్నది. అది గేయరచనగా నుండెను. తుమ్మెదపదములు, గొబ్బిపదములు, ప్రభాతపదములు, ఆనందపదములు మొదలగు పదములు, ఏలలు, జోలలు, చంద్రవంకలు మొదలగు పాటలు, ఈ తరగతికి జెందిన ఇతరములు కలవు. యుద్ధమల్లుని బెజవాడ శాసనము జూచిన మధ్యాక్కరల రూపమున పద్యరచన సాగినటుల ధ్రువపడుచున్నది. కాని గ్రంథరూపమున ఇప్పటికి మనకు లభ్యమైన ఆదిగ్రంథము నన్నయభట్టారకునిచే ఆంధ్రీకృతమైన భారతము. అంతమాత్రమున నన్నయకు పూర్వము తెలుగుకవిత్వము లేదని కాని, కవులు లేరని గాని, భావించనక్కర లేదు. నారాయణభట్టు, పావులూరిమల్లన మున్నగు కవులు నన్నయకాలమున నుండిరి. ఆ కాలమున వ్యవహారములో నున్న భాషాస్వరూపమును నన్నయ సంస్కరించి మార్గకవితకు దారి యేర్పరచెనని చెప్పవలెను.

భారతము పురాణప్రాయమగు నితిహాసము. వేదములు గాని, ఉపనిషత్తులుగాని ఆంధ్రభాషయందు వెలయకున్నను మహాభారతరచన సాగుటకు కారణము లేకపోలేదు. అది కాలమహిమ. ఆనాటి సంఘోద్ధరణకు అది కావలసిన యవసరము కలిగినది. భారతాంధ్రీకరణోద్దేశ్యములను గూర్చి పలువురు పలువిధముల

జెప్పుచున్నారు. అందు ముఖ్యమగునవి రెండు మూడు మాత్రమే భారతకృతిపతియైన రాజరాజు చంద్రవంశజుడు. తన పూర్వుల చరిత్ర వినవలెనను కుతూహల మాతనికి గలిగినది. భారతము పంచమవేదము. కావున వేదధర్మోద్ధరణ మొనర్చు కోరిక రాజరాజునకు గలిగినది. పొరుగుననున్న కన్నడమున అప్పటికే భారతము వెలిసినది. రాజరాజు దానిని వినియుండును. ఆంధ్రమున గూడ భారతము వినవలెనని యాతడు కుతూహలపడెను. ఆంధ్ర వాఙ్మయ చరిత్రకారు లీకారణముల నంగీకరించిరి. చాళుక్యులు వైదిక మతాభిమానులు. అంతకుమున్ను ఈ దేశమున ప్రబలిన బౌద్ధజైనముల ప్రభావము చాళుక్యుల కాలమున వెనుకబట్టి క్రమముగా వేదమతప్రతిష్ఠయు, ఆస్తికతయు మఱల నెలకొనజొచ్చెను. బౌద్ధజైనచార్వాకాదుల బోధలచే చెడిన వర్ణాశ్రమ ధర్మములను యజ్ఞయాగాది క్రతువులను రాజరాజు పునరుద్ధరింప బూనెను. కావుననే యతనినిగూర్చి నందంపూడిశాసనములో 'నిజపవిత్ర చరిత్ర తోయైః పక్షాళయతికవికాలకళంకపంకమ్'' అనుదాని కనుగుణముగ భారతమున ''కవికాలజదోషతుషార సంహతిన్ తన యుదయప్రభావమున దవ్వుగ జోపి'' అని వర్ణింపబడినది. ఇటులనే రాజరాజు కావ్యగీతి ప్రియుడనియు తెలియజెప్పు సంబోధనలు భారతమందు గానవచ్చుచున్నవి. రాజరాజు వేదమతమునకు మూలకందమైన వర్ణాశ్రమ ధర్మవ్యవస్థకు కంకణము గట్టుకొనిన శ్రోత్రియుడగు ప్రభువరేణ్యుడు అతడు—

ఉ. ఆశ్రిత పోషణంబున ననంతవిలాసమునన్ మనీషి వి
ద్యాశ్రమ తత్త్వవిత్తమున దానగుణాభిరతిన్ సమస్త వ
ర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిమల్ మహినొప్పు సర్వ లో
కాశ్రయుడాది రాజ నిభు డక్కలంక చరిత్రసంపదన్

కావుననే వేదమతాభిమానియగు రాజరాజు పంచమవేదమయిన మహాభారత పరమార్థమును తెలుగువారికి దెల్లముజేయు

మని నన్నయభట్టారకుని గోరినాడు. వైదిక వాఙ్మయ సార మంతయు నిందు జొప్పడియుండుటయేకాక వేదాంతవిషయమునను ఉపాసనా విషయమునను భిన్నమార్గముల నవలంబించిన సమస్త మతములవారికి నాదరపాత్రమగు ధర్మ సమన్వయమును గలదు సమస్తవిద్యలకు, శాస్త్రములకు ధర్మములకు కర్మ ప్రపంచజ్ఞాన మునకుఖనియగు భారతమును నన్నయభట్టారకుడిట్లుకొనియాడెను

సీ. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియు
బరమ పౌరాణికుల్ బహు పురాణ సముచ్చ
యంబని మహి గొనియాడుచుండ

ఆ. వివిధ వేదతత్త్వవేది వేదవ్యాసు
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండజేసె భారతంబు.

కం. వేదములకు నఖిలస్మృతి
నాదములకు బహుపురాణ వర్ణంబులకున్,
వాదైన చోటులను దా
మూదల ధర్మార్థకామమోక్ష స్థితికిన్

ఆంధ్రభారతరచన మార్గకవిత ననుసరించుటచే గాబోలు, సామాన్యజనుల మానసము నది చూరగొనదాయెను. ఇంకను బౌద్ధజైనమతప్రభావము పూర్తిగ నశింపలేదు. ఆ మతప్రచారకులు మంత్రతంత్ర ప్రభావమున సామాన్యజనులను భ్రమపెట్టి లోబరచుకొనుచుండిరి. బసవేశ్వరుని వీరశైవమత ప్రచారముతో నది తుడిచిపెట్టుకొనిపోయినది. వర్ణభేదముల సాకుచూచు

కొని ప్రచారమగుచున్న బౌద్ధజైనమతములను ప్రతిఘటించుటకు బసవేశ్వరుడు తన శైవమతమును జాతి వర్ణ విచక్షణ లేకుండ అందఱకు బోధించెను అందఱు వీరశైవులయిరి మహేశ్వరు లయిరి మంత్రతంత్ర విధులగూడ బసవేశ్వరుడు తన మత వైశిష్ట్యమును స్థిరపరచెను ఈ బసవేశ్వరుని చరిత్ర నందఱకు దెలియు జానపదభాషలో దేశికవితయగు ద్విపదలో రచించి శైవ మతప్రచారమునకు బలముగూర్చినవాడు పాల్కురికి సోమనాథుడు తేలికగ నర్థమగు భాషలో సులువుగ పాడుకొనుటకు వీలుగ శైవ ధర్మములు బోధింపబడినవి ఈతడు హిందూమతాంర్గతమైన శైవమతోద్ధరణ కెంతయు కృషి జేసి కృతార్థుడాయెను భక్తి ప్రధానమైన ఈ వీరశైవము సర్వజన సులభమై ఆంధ్రకర్ణాటక ముల నిట్టె వ్యాపించెను బౌద్ధమత చిహ్నములగు స్తూపాదు లున్న స్థలముల నెల్ల వీరశైవులు శివాలయములను నిర్మాణము జేయించి ఆ మతము జనబాహుళ్యము నాకర్షించునటుల జేసిరి పంచారామములందల్లి శివాలయముల నిందులకు సాక్ష్యముగా తజ్ఞులు పేర్కొందురు ఇటులనే శ్రీరామానుజులచే ప్రతిపాదిత మైన వైష్ణవము కూడ జనసామాన్యము నాకర్షించినది ఆ మహా మహుడును కులవర్ణలింగభేదములు జూడక సర్వులను నచక్రాం కితుల జేసి వైష్ణవుల జేసెను ఈ మతసిద్ధాంతమున గూడ భక్తి ప్రపత్తులే ముఖ్యము పల్నాటిసీమలో బ్రహ్మనాయని వీరవైష్ణ వము తలయెత్తి వర్ణాశ్రమాచారములను తుడిచిపెట్టి సకలవర్ణము లకు సహపంక్తిభోజన సదుపాయములను సమకూర్చెను ఆ ప్రభావమువలననే రంగనాథరామాయణము వైష్ణవమతప్రాధాన్య మును దెలిపి పామరజనుల నాకర్షించుతలంపున ద్విపదరూపము ననే వెలువడినది జైనబౌద్ధాది నిరీశ్వరమతముల నిట్లు తుద ముట్టించిన ఈ వీరశైవ వీరవైష్ణవములు తాముగూడ పరస్పరము కలహించుకొనజొచ్చినవని ఈ రెండును ఆస్తికమతములేయైనను రెండును భక్తిప్రధానములేయైనను శివపారమ్య విష్ణుపారమ్యము

లను గూర్చిన వివాదములు తప్పవాయెను వీనికిని రాజాశ్రయము లభించుటచే పరస్పర విజిగీష అధికమై జనసామాన్య చిత్తములను చీకాకుపఱుపజొచ్చెను ఒకరినొకరు పాషండులని నిందించుకొను హేతువున, ఈ యుభయ మతములలో నేది శ్రేష్ఠమో, ఏది యుపాదేయమో తెలియక ప్రజలు కళవళపడ జొచ్చిరి వేదములను వర్ణాశ్రమ ధర్మములను అభిమానించువారీ యిరు మతముల వారిని గూడ కర్మభ్రష్టులనియు, ధర్మహీనులనియు నిందించుచుండిరి వైదిక ధర్మాభిమానులు సంస్కృతమును మార్గకవితలను ఆదరించుచుండ వీరశైవ వీరవైష్ణవులు దేశభాషలను దేశికవితలను అభిమానించుచుండిరి వారికి గీర్వాణము బలసినదని వీరును, వీరు తెనుగుమీరిరని వారును అవహేళనము సల్పుకొనుచుండిరి ఇది యెటులున్నను కర్మప్రధానమగు వైదికమతమునందుకంటె భక్తిప్రధానమగు మతములందు సౌలభ్యమధికముకావునను మార్గకవితకంటె దేశికవితలు జుట్టుపదనుగా నుండి జానపదుల కధికముగా రుచించుట సహజము కావున జనసామాన్యమున వైదిక ధర్మదూరమగు ప్రమాద మేర్పడ జొచ్చెను ఆ యుభయుల వైషమ్యముల సందున జైన బౌద్ధమతములు దలయెత్తుటకై వేచియుండెను ఆంధ్రజాతి యిట్టి ధర్మసంకటమున బడియున్న తరుణమున ఏకధర్మమును, ఏకదైవమును దర్శించి భక్తి జ్ఞాన కర్మలకు సమన్వయము గూర్చిన మహానీయుడు తిక్కన తిక్కన యుగపురుషుడు. శివకేశవుల భేదమును పరిహరించి హరిహరనాథ రూపమగు నీశ్వరతత్త్వమున నా కవి బ్రహ్మ అద్వైతము సాధించెను ఈ నామరూపకల్పనచే భక్తులకు సౌలభ్యము గూర్చుటయేకాక దానిని వేదసమ్మతి మొనర్చిన దగ్దృష్టయాతడు ఒకవంక హరిహరమగు నామరూపములను భక్తితో సమర్పించుటయే కాక ఒకవంక యజ్ఞయాగాది వైదిక కర్మానుష్ఠానము నెఱపుచు రెండవ వంక రాచకార్యముల నిర్వహించుచు వివిధ ధర్మములకు అద్వైతముసాధించిన పూర్ణపురుషు

డాతడు గీర్వాణభాషా గాంభీర్యమునకు జాను తెనుగు మాధుర్యమును జతచేసి వృత్తభేదములను రసభావానుగుణముగా వాడికొనుచు మార్గ దేశికవితల రెంటిని తనకవిత్వపు మూసలో కరగించిపోసిన ఉభయ కవిమిత్రుడాయన శత్రువుల కోడి రాజ్యమును గోల్పోయిన తన ప్రభువును పునః రాజ్యప్రతిష్ఠితుని గావించిన రాజనీతికోవిదుడు వేయేల 13 వ శతాబ్దినాటి సాహిత్యమునకు, మతమునకు ధర్మమునకు రాచకార్యములకు వెలుగుబాటలు వేసినవాడు తిక్కన శ్రీకృష్ణద్వైపాయనుడు 'లోకహితనిష్ఠుం బూని ధర్మాద్వైతస్థితి భారతాఖ్య మగు లేఖ్యంబైన యామ్నాయమును గావింపగా కవిబ్రహ్మ యగు తిక్కన భారతామృతము కర్ణపుటంబుల నారగ్రోలి యాంధ్రావళి మోదమందుటకుగా' భారతరచన సాగించెను అనగా వ్యాసుని మొదలు భారతకవులవఱకు అందఱు లోకసంగ్రహణార్థమే గ్రంథరచన సాగించిరని తలచవలెను ఇటులనే పురాణములన్నియు తెలుగులోనికి అనువదింపబడినవి అన్నియు ఒకేకాలమున ననువదింపబడలేదు అన్నియు ఒకేరీతిని లేవు ఆయా పురాణములందలి గాథలకు వైరుధ్యముకూడ కొన్నియెడలగలదు అయినను ఉద్దేశ మొక్కటియే ఫలమొక్కటియే అన్నియు ధర్మోపదేశమొనర్చి దిద్దుట కేర్పడినవే

తిక్కయజ్వ పురాణమగు భారతమును రసవత్తర కావ్యముగ జేసెనందురు ఇది సత్యదూరము కాదు నన్నెచోడుని కుమారసంభవకావ్యముననే ప్రబంధలక్షణములు కలవు ప్రబంధములకు ముఖ్యలక్షణములుగ జెప్పబడిన సూర్యోదయాది వర్ణనలు నన్నయరచిత భారతభాగమునను గలవు తిక్కన ప్రతిపర్వమును ఒక కావ్యముగ నొనర్చె ననవచ్చును కల్పనలు, వర్ణనలు రసవత్తరములై, ఔచిత్యము మెఱయ, కథకు వన్నెబెట్టుచుండును అందుచే కాంతాసమ్మితములగు కావ్యములరచనకు తిక్కన ప్రాతిపదిక వేసె ననవచ్చును కాంతాసమ్మితములగు కావ్యముల శ్రీం

గారరసము ప్రధానరసముగ స్వీకరింపబడినది శృంగారవీరకరుణా ద్భుతహాస్య భయానక భీభత్సరౌద్ర శాంతములనెడు నవరసము లలో శృంగారము ప్రథమమేగాక ప్రధానము గూడ నగుటచే నాలంకారికులు దీని నాదిరసమని ప్రశంసించిరి ఒకప్పుడు శిరీషకుసుమముకంటె కోమలమై ఇంకొకప్పుడు వజ్రముకంటె కఠోరమై స్థిరసౌదామనినిబోలి విరాజిల్లు నాయికానాయకుల యీ ప్రేమవిలాసము ఎల్ల దేశములలోను, ఎల్ల కాలములలోను కవులకు వర్ణనీయమైనది భారతీయ కవుల ప్రణయలహరి కాలక్రమమున విశుద్ధత జెందుచు ప్రవహించి సంసారసాగరమున నెట్లు శాంత రసమున లీనమగునో అసదృశముగ జూపిరి యౌవనప్రభావమున నావిర్భవించిన మోహము సంయతిచే శాంతిని, ధర్మధారణచే ధ్రువత్వమును, సంసారముచే మాంగల్యమును బొందినగాని, అయ్యది చంచలమును, ప్రతికూలమునగు జగత్తునుండి తప్పించు కొని కృతార్థత జెందనేరదని నిరూపించిరి శృంగార రసము సమస్తరసములకు నాయకమణి అది ధర్మబద్ధము కావలయును రసాధికారమందు ఉద్వేగమును, చంచలత్వమును, బహుముఖత్వ మును నిరోధింపవలయును హిందూధర్మ మీమాంసలన్నియు దాస్యసఖ్యవాత్సల్య మధురభావములను శాంతరసముపై నెల కొల్పజూచును శాంతరసము సకల రసములకు నాశ్రయము రసభోగి చిత్తపటములను ముందుగ శాంతరసశుభ్రవర్ణమంకితము కావలయును తదనంతరము శృంగారాది రసమూర్తులు పరిపూర్ణ వికాసము నందును కావున శాంతసమాహితుడు కానివానికి రసాస్వాదనగాని సాధనగాని సంభవముకాదు శాంతరతి యందలి ధర్మమే నాయికా నాయకులయందుండవలసిన ప్రధాన లక్షణము

అట్టి శృంగారరసమునే ప్రబంధములనబడు కావ్యములకు ప్రధానరసముగ నాలంకారికులు నుడివిరి కావ్యములు ధర్మ ప్రతిపాదనకొఱకేగాని అధర్మ ప్రతిపాదనకు గాదు ఈ ధర్మము

ననుసరించియే యాంధ్రభాషయందు పెక్కురు ప్రబంధ రచన సాగించిరి. ఆ యా కాలముల వెలసిన ఆ యా ప్రబంధముల రచనారీతులలో భేదము లుండవచ్చును. భాషలో మార్పులు గలుగవచ్చును. అది కాలమునుబట్టి, కవి ప్రతిభనుబట్టి యుండును. అయినను ప్రధానమగు ధర్మప్రతిపాదనమే కావ్య ఫలమనునది మఱువరాదు. అది లేని కావ్యము సత్కావ్యము కానేరదు. ఈ దృష్టితో ప్రబంధపరిణామము పరిశీలించుచు, ఆయా ప్రబంధముల రచనారీతులను, ఆయా కవుల భావుకత్వ మును పరిశీలించుట యుత్తమ మార్గము.

# 2

# ఉత్తరహరివంశము

[నాచిరాజు సోమనాథుడు]

ఆంధ్ర సారస్వతాభివృద్ధికి, సంఘాభివృద్ధికి రాజకీయౌన్నత్యమునకు ఆంధ్రుల చరిత్రలో స్వర్ణయుగ మనదగినది శ్రీకృష్ణదేవరాయల పాలనము ఆ యుగమును గుఱించికాని ఆ మహామహుడు చేసిన భాషాసేవను గుఱించికాని, తత్కాలమున నాంధ్ర వాఙ్మయమున, ప్రత్యేక ప్రాచుర్యాదులు సంపాదించిన ప్రబంధ రచనావిధానమును, కావ్యరీతులను గ్రహించుటకు మునుముందు వాని కన్నిటికి ప్రాతిపదిక యనదగిన, ఆ విజయనగర రాజ్యస్థాపన, దాని చరిత్ర ఆయా కాలముల ఆయా ప్రభువుల భాషాభిమానము, సారస్వత సేవ, కొంతవఱకైన నెఱుగవలయును అప్పుడుకాని రాయల కాలమున ఆంధ్రభాషాలత పూచి పరిమళించి సుమనోజ్ఞ కావ్యఫలప్రద మగుటకు సరియగు కారణములు పూర్తిగ నవగతము కావు

తుంగభద్రా నదీతీరమున వెలసిన విజయనగర సామ్రాజ్యము మహమ్మదీయ దండయాత్రలను ప్రతిఘటించుటకేకాక, హైందవ సంప్రదాయమును, సంస్కృతిని, మతమును, కళలను

రక్షించుట కెంతయు దోహదకారి యాయెను విద్యారణ్య యతీంద్రులవారి యాదేశాశీర్వాదములనంది విజయనగర రాజ్యము స్థాపించిన హరిహర బుక్కరాయసోదరులు సంగవంశీయులు వారు కర్ణాటకులు అయినను కన్నడభాష నేకాక, ఆంధ్రమును, సంస్కృతమునుగూడ వారభిమానించిరి వారు వేదధర్మము నను ష్ఠించిరి హిందూమతోద్ధరణ వారి కాలమున వారి మంత్రియు, భాష్యకర్తయు నగు సాయణాచార్యులవారికి, యుపదేశములననుస రించియు, విద్యారణ్య మాధవాచార్య యతీంద్రుల యాదేశము నను జరిగినది ఈ సాయణాచార్యులు విద్యారణ్యులవారి సోద రులు. ఈ మహామహుల శిష్యులగు సంగవంశీయుల పాలనమున ఆంధ్రసారస్వతసేవ యెట్టుల జరిగినదియు పరామర్శింప యత్నిం తము హరిహరబుక్కరాయల పాలనమున వారి యాస్థానకవియై వారి యాదరణమందిన కవి నాచనసోమనాథుడు నాచనసోముని నాచిరాజు సోమన యనుటయు కలదు పిల్లలమఱ్ఱి పినవీరన తన శృంగార శాకుంతల అవతారికయందు ' నాచిరాముని సోము వాచామహత్త్వంబు సౌరభంబులు వెదజల్ల నేర్తు'' ననియు, గౌరవి గోపిరాజను కవి ...నెట్టన నాచిరాజు సోముని నమరే శ్వరుం''... అనియు ప్రస్తుతించిరి నాచిరాజును నాచన యనియు పోతరాజును పోతన యనియు పిలచు ఆచారము మన తెలుగునాట కలదు గొమ్మనకొడుకును 'గొమ్మనశిక్కన' యనినటుల నాచిరాజుకొడుకు సోమన్న నాచనసోము డయ్యె ననియు నూహింపవచ్చును

ఆంధ్రమున ప్రఖ్యాతమగు ఉత్తరహరివంశము' నాచన సోమనకృతము గ్రంథావతారికనుండి యీకవివంశాదులెక్కువగ దెలియరావు కాని బుక్కరాయలచే పినాకినీ నదితీరమువందలి పెంచకలదిన్న యను గ్రామమును సోమనకు, మఱి అయిదుగురు బ్రాహ్మణులకు నగ్రహారముగ నిచ్చినట్లు శాసనాధారములు గలవు ఈ పెంచకలదిన్నెకు బుక్కరాయపుర మను నామాంత

రము కలదు ఈ శాసనమువలనను నీకవి భారద్వాజగోత్రుడనియు అపస్తంబ సూత్రుడనియు అష్టాదశ పురాణములు తత్త్వార్థము నెఱిగినవాడనియు తెలియుచున్నది అష్టభాషలలో కవిత్వము జెప్పగలిగిన దిట్ట యని చెప్పబడినది 'సకలభాషా భూషణ' 'సాహిత్యరసపోషణ సంవిధానచక్రవర్తి', నవీనగుణ సనాథ' బిరుదాంకు డీతడు ఈ మహాకవిని చిన్నయసూరి 'మూడవకన్ను దాల్చిన సర్వజ్ఞు' డనినుతించెను నాచనసోముడు నెల్లూరుప్రాంతీయుడని కొందఱును అటుగాక హరిహరబుక్క-రాయ సోదరుల కాశ్రితుడై వారివెంట ఓరుగల్లునుండి వచ్చెనని మఱికొందఱును చెప్పుదురు ఏ ప్రాంతమువాడైన మన కేమి? మనకు కావలసినది అతని కావ్యముకాని జన్మస్థలమును గుఱించిన వాదప్రతివాదములు కావు కవి యేప్రాంతపువాడైనను ఏ శాఖ వాడైనను సత్కవియగునేని కవితారసజ్ఞులకు బూజార్హుడే రామ రాజ భూషణుడు కవయిత్రి మొల్ల చేమకూర వెంకటకవి మొదలగువారందఱు నేటికిని పూజార్హులుగ నున్నారుకదా అది యేమిపాపమో కాని కులమతభేదముల నంతగ బాటించని యీ రోజులలో సంఘసంస్కర్తల మనియు విశాలదృక్పథము గలవార మనియు చెప్పుకొను కొందఱు పెద్దలుసహితము ఈ కులమత శాఖాభేదపిశాచము నావహింపబడి యుక్తాయుక్త వివేచనా హీనులై కవులనుగూర్చియు కావ్యముల గూర్చియు వాదప్రతి వాదముల జేయుచుందురు తమకులము వారయినంతమాత్రమున భూషించుటయు అర్హులయినను తదితరకులములవారిని శాఖల వారిని ద్వేషించుటయు జూచిన ఆంధ్రసారస్వతమునకు దీరని యపచారము జరుగుచున్నదని తోచును

ఆంధ్రవాఙ్మయమున ప్రబంధరచన ఒక విశిష్టమైన ప్రక్రియ ప్రాచీన వాఙ్మయములో పురాణవాఙ్మయము ప్రబంధవాఙ్మయము రెండును భిన్నములుగ జెప్పబడుచున్నను, సూక్ష్మముగ జూచిన రెంటికిని భేద మంతగా కానబడదు

పురాణవాఙ్మయమునకు నన్నయభట్టారకు డాద్యుడు. కుమార సంభవకర్తయగు నన్నెచోడుడు ప్రబంధరచనా విధానమునకు ప్రథము డనవచ్చును. పురాణ మనబడు తిక్కనరచితభారతమున నంతటను, అందుముఖ్యముగ విరాటపర్వమందు ప్రబంధలక్షణము లెక్కుడుగ నున్నవియేకదా! పురాణములందు ప్రబంధలక్షణ ములు, ప్రబంధములందు పురాణలక్షణములు కనబడుచునే యున్నవి. ఈ విషయము వివరింపబడును. మన భాషలో ప్రబంధప్రక్రియ పదునాఱవశతాబ్దిలో నేర్పడినదని చెప్పుచున్నను, అంతకుబూర్వమే ప్రబంధప్రక్రియ మన సారస్వతమున నున్న దనుట కనేక నిదర్శనములు కలవు. ప్రబంధ మను పదమును సంస్కృతమున కవులు కావ్యసామాన్యవాచిగ వాడిరి. ఆలంకారి కులు మహాభారత రామాయణములను, మాలతీ మాధవీయాది దృశ్యకావ్యములను ప్రబంధములనియే చెప్పిరి. సంస్కృతాలం కారికుల ననుసరించిన ప్రాచీన మహాకవులందఱు ప్రబంధశబ్దము నా భావముతోనే వాడిరి. ప్రబంధము అష్టాదశవర్ణనాత్మక ముగ నుండవలయును, ధీరోదాత్తాదులలో నొకడు నాయకుడుగ నుండవలయును మొదలగు నిబంధనలతో, మనుచరిత్ర రచన నాటినుండియు నొక పరిమితార్థములో నొక విశిష్టరూపములో ఆంధ్రసారస్వతమున రూఢమైనది. శ్రవ్యమగు మన ప్రబంధము నకు, దృశ్యమగు నాటకమునకు నీ లక్షణములు సామాన్యములే. ప్రబంధమున కుండవలసిన లక్షణములు కొన్ని నిర్ణీతములయినవి. ప్రబంధ మేకనాయకాశ్రయము; వస్త్వైక్యము ప్రధానము; అష్టాదశవర్ణనలు, అలంకారయుత శైలియు నుండవలయును. శృంగారరసము ప్రధానము; ఆ ప్రధానరసమునకు అంగము లుగా నితరరసము లుండవచ్చును. ప్రఖ్యాతము, నుత్పాద్యము మిశ్రమము నని కావ్యవస్తువు మూడు విధములు. ఇందు ఉత్పా ద్యమును 'కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము' లని కొంద ఱీసడించినను, మన ప్రబంధవాఙ్మయమునం దట్టి కల్పితవృత్తము

గల కళాపూర్ణోదయాదులు వాసికెక్కినవి అలంకారములతో వర్ణనావైచిత్రి మెఱయ రసమయ కావ్యమును కవి నిజప్రతిభచే సృజింపవలయును అటుల సృజింపబడిన కావ్యము ప్రబంధ మనబడును ఆంధ్రాలంకారికుల మతము ప్రకార మిట్లు సర్వ లక్షణసంపన్న మయినదే సుప్రబంధము అట్టి లక్షణ పరిపూర్ణ తచే స్వారోచిష మనుసంభవకావ్యము ప్రబంధరాజ మయిన దందురు ఆ కారణముననే అల్లసాని పెద్దన ఆంధ్రకవితా పితామహ బిరుదాంకితు డయినా డందురు మనుచరిత్రము ప్రబంధ శైలికి, వర్ణనౌచిత్యమునకు కథాకథనమునకు ప్రథమోదాహరణ మనికదా యందురు అది ఆంధ్ర పంచమహాకావ్యములలో ప్రథమస్థాన మాక్రమించినది ఈ విషయము లన్నియు వివరముగ జర్చించుటకు ముందు ఆ యుగ ప్రారంభదశయందు విజయనగర సామ్రాజ్య స్థాపన కాలమున వెలువడి, ప్రబంధరచనా విధానమున కంకురార్పణ యనదగిన నాచనసోముని యుత్తరహరివంశమును పరిశీలించి, ఆ మహనీయుడు చేసిన సారస్వతి సేవ ఆంధ్ర సారస్వతేయులలో నాతని స్థానము నవగాహన జేసికొనుట యెంతయు నవసరము

నాచనసోమునీ యుత్తరహరివంశ మొక యుత్తమ గ్రంథము పూర్వ హరివంశము కూడ నాతడు రచించె నందురు. కాని యా గ్రంథ మిప్పటికిగానరాదు ఉత్తరహరివంశప్రాశస్త్యమును గూర్చి అభిప్రాయభేదములు గలవు ఒక తెగకు జెందిన భాషాకోవిదులు విమర్శకులు నాచనసోముని శైలి క్లిష్టమనియు సంస్కృతదీర్ఘసమాసభూయిష్ఠమనియు, మారుమూల శబ్దములతో అన్వయ కాఠిన్యము నంది యస్వాభావికముగ నుండుననియు నందురు వీరు దీనిని ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశముతో బోల్చి, యాతని రచన రసవత్తర మందురు మఱికొందఱు వేఱుగ భావింతురు ఆంధ్రసారస్వతమున కవితాపటిమయందు, కల్పనా శక్తియందు వారు సోమున కగ్రతాంబూల మొసగుదురు శైలి

గంగాప్రవాహమువలె ననర్గళ మనియు కవితాశక్తి యపూర్వ మనియు, రీతి యనన్యసామాన్య మనియు, తరువాత కవులకు మార్గదర్శక మనియు నందురు కందుకూరి వీరేశలింగం పంతులు గారి యభిప్రాయము జూడుడు "సోమనాథుని కవిత్వము మిక్కిలి ప్రౌఢముగాను సర్వవిధముల నెఱ్ఱాప్రెగ్గడకంటె మేలయి నదిగను నున్నది ఒక్క యెఱ్ఱాప్రెగ్గడ కవిత్వమే కాదు, భారతము రచించిన కవిత్రయములో ననేకుల కవిత్వమును కొన్ని విషయములలో సోముని కవనమునకు సరిరాదు" ఇట్లు చెప్పిన పంతులుగారే యింకొకచోట "అందందు ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశ ములోనిపద్యము నొకదానిని, సోముని హరివంశమునందలిపద్యము నొకదానిని దీసి పోల్చుటవలన నుభయకవుల తారతమ్యము తేట పడనేరదు కవిత్వతత్త్వమును మొత్తముమీద విచారింప వలయును అప్పుడు సహితము అభిప్రాయభేద ముండక మానదు. ఒకరికి రుచించినది యింకొకరికి రుచింపదు 'లోకో భిన్నరుచిః' యన్నది క్రొత్తది కాదుకదా" అని సెలవిచ్చిరి ఇది లెస్సైన మాట. అచ్చటచ్చట అన్వయ కాఠిన్య మున్నను, సోముని రచన శబ్దాద్యలంకారములచే హృద్యముగను, రసవంతముగను నుండి, యర్థగాంభీర్యముతో నలరారుచుండును సంస్కృతము ననువదించుటయం దాత్మవిశ్వాసము గలిగి స్వతంత్రమార్గమున నడచిన ధీశాలి యీతడు మూలమునకు గట్టుపడక కొన్ని యెడల విపులపఱచుటయు, కొన్ని యెడల కుంచించుటయు నతనికి పరిపాటి. సోముని తెలుగు హరివంశమునకు మూలమైన సంస్కృత హరి వంశము కానరాదు లభ్యమైన సంస్కృతగ్రంథమునకు, నీతని తెలుగుసేతకు భేదములు గలవని పరిశోధకుల యభిప్రాయము. అందలి కథలు పెక్కు లిందు లేవు ఉన్నకథలుకూడ వెనుక ముందుగ నున్నవి అందుచే మూలమునుండి కొన్ని కథలను మాత్రమే కైకొని నిజప్రతిభచే వానిని రమణీయ మొనర్చి తరు వాతి ప్రబంధరచనకు మార్గదర్శకముగా వర్ణనావైచిత్రి మెఱయ

నవీనగుణసనాథుడై యీహరివంశము నిచ్చ మెచ్చునటుల రచించి యుండునని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి యభిప్రాయము.

సోమనాథుడు తన గ్రంథగద్యమున "బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబైన మహాభారతకథానంతరంబున నాచనసోమనాథ ప్రణీతంబైన" అని తిక్కనతరువాత తన పేరే పేర్కొనదగిన దన్నట్లుగా తన యభిమతమును దెల్పుకొనినాడు దీనిని ఆధారముగ జేసికొని కొందఱు తిక్కనపద్యముల నీతని పద్యములలో కలిపి చదివినను ఈతని పద్యములను తిక్కన పద్యములతో కలిపి చదివినను గుర్తించుట కష్టమని చెప్పుచు నిద్దఱకు సమానత్వ మాపాదింతురు ఇది పొసగని మాట విద్వల్లోకము తిక్కన తరువాత ఎఱ్ఱాప్రెగ్గడనే పేర్కొనినది కవిత్రయమనగా నన్నయ, తిక్కన ఎఱ్ఱనలనియే ప్రఖ్యాత మాయెను వారు మువ్వురు సమానసమ్మాననార్హు లగుట చేతనే యటుల పేర్కొలసినది వారు మూర్తిత్రయమువంటివారు

ఎఱ్ఱనకవితకు గల ప్రసాదగుణము సోముని కవితకు లేదు ఎఱ్ఱనకవితలో సూక్తివైచిత్రి మెండు అరణ్యపర్వశేషపూరణముచే ఎఱ్ఱన తనివిచెందక భారతమునకు హరివంశము శేషము కావున తద్రచనచే తిక్కన భారతమునుగూడ బూరింపనెంచె నేమో నన్నయ విడిచిపెట్టిన భారతశేషమును బూర్తిచేయుట కాతని శైలి ననుకరించిన ఎఱ్ఱన సోమయాజి విడిచిపెట్టిన భారతశేషమగు హరివంశమును బూర్తిజేయుటకు బూర్తిగ దిక్కనశైలి ననుకరించె నని చెప్పనొప్పును హరివంశము భారతశేష మనియే యెఱ్ఱాప్రెగ్గడ వచించినాడు సోముడును అటుల జెప్పినవాడేకదా ఎఱ్ఱన తన హరివంశరచనయందు ఉత్తరహరివంశకర్తయగు సోముని అనుకరించె నను అపప్రథ కలదు కాని యది విశ్వసనీయము కాదు. ఆ యా కవులు జీవించిన కాలమును, కావ్యరచన సాగించిన కాలమును సమగ్ర

ముగా యోచించిన ఈ అపవాదునకు తావులేదు సోముడు రచించినది యుత్తరహరివంశముమాత్రమే అందును కొన్ని భాగములు మాత్రమే నరకాసురవధ ఉషాపరిణయములోను గాగల కథలు మూలము నతిక్రమించి విపులీకరింపబడినవి ఎఱ్ఱన రచన మూలమునకు దగ్గఱగ నుండును సోమునిది చాలవఱకు స్వతంత్రమార్గము సోముని అనిరుద్ధ పాత్రపోషణ మంత సమంజసముగ గన్పడదు ఎఱ్ఱన యౌచిత్యమును పాటించి మూలమును విడువక రసపోషణ గావించినాడు సోముని గ్రంథమున ప్రత్యేక ప్రశంసకు దగిన హంసడింభకోపాఖ్యానమును ఎఱ్ఱన తెలిగింపలేదు సోముడు వదలిన గాథల గొన్నిటిని ఎఱ్ఱన స్వీకరించినాడు ఉత్తరహరివంశముకంటె ఎఱ్ఱన గ్రంథము మూడునాలిగింతలు పెద్దది శైలిలో నిరువురకు బోలికయే లేదు ఎఱ్ఱన తిక్కనవలె అలతి తెలుగుపలుకులతో దనరచనను రసవత్తరకావ్యముగ వెలయించినాడు. సోముడు పదాడంబర, వర్ణనాతిశయ శబ్దాలంకారభూయిష్ఠమగు రీతికవితకు మార్గదర్శకుడు, ఆంధ్రీకరణమున నిరువురకు బోలికయే లేదు సోముడే కవిత్రయమార్గముకంటె భిన్నమగు రీతిమార్గమును ప్రోక్షించి నవీనగుణసనాథత్వమును సాధింపనెంచెను అయినను ప్రబంధ పరమేశ్వరుడను బిరుదము ఎఱ్ఱనకే దక్కినది దానికి గారణము లేకపోలేదు నృసింహపురాణము పురాణమయ్యు ఎఱ్ఱన చేతిలో ప్రబంధముగ రూపొందినది ప్రబంధమునకు జెప్పబడిన లక్షణములు నృసింహపురాణమునందు పెక్కులు గలవు ఈ స్వతంత్రమార్గమునకు నన్నెచోడుని కుమారసంభవము ఆచార్యకమనునది మనము మఱువరాదు

కథాంశమును వీడక విషయసంగ్రహ మొనర్చి మూల గ్రంథమును నిరర్గళధారతో సహజమగు వర్ణనలతో దిక్కనను లక్ష్యమం దుంచుకొని చెప్పినవాడు ఎఱ్ఱన హరివంశమందు వర్ణనావైభవము మెఱయు ఘట్టములు గలవు ముఖ్యముగా



గోకులవర్ణన చదువదగినది మూలములోని రసవత్తర భాగముల బెంచి నీరసకథాంశముల వీడి భావముల కనువగు పోకడల సంతరించుకొని, రసానుకూలమగు నాలంకారిక శైలిని పదాడంబరముచే రసికలోకము నాకర్షించురీతి నవలంబించినవాడు సోమన అభిరుచులబట్టి చూచినను సోమన శంభుదాసులకు బోలికయే లేదు వర్ణనా వైభవము, శైలీపాటవము సోముని సొమ్ము కూర్పు బింకమున, ఔచితినిర్వాహణమున, కల్పనా చాతుర్యమున ఎఱ్ఱన మిన్న రెండును రసికుల నలరించునవే. ఒకరిది ప్రబంధశైలి రెండవవారిది పురాణమార్గము నన్నయ తిక్కనలు పురాణములను కథాప్రధానముగ, వర్ణనాదులపట్ల భావ సంయమముతో దెలిగించిరి ఎఱ్ఱన వారి మార్గమునే అనుసరించిన సాత్త్వికుడు పురాణాంధ్రీకరణమున వర్ణనాబహుళమును రీతి ప్రధానము నగు మార్గము ద్రొక్కినవాడు సోమన - రసభావ వశంవదుడై సోమన ఆ మహాప్రవాహమున గాలు నిలువ ద్రొక్కుకొనలేని రజోగుణప్రధానుడు ఈ యావేశ మాతని ననౌచితి పాలు సేయుటయు గద్దు కాళిదాసాదుల సంయమము నౌన్నత్యిని పుడికిపుచ్చుకొనినవా డెఱ్ఱన బాణభట్టాది సంస్కృతకవుల తెగలోనివాడు సోమన్న ఈతని పోకడ ఉదాత్తము ఎఱ్ఱన రచన ప్రసన్న గంభీరము సోమన రచన మిట్టె మెఱపించును ఎఱ్ఱన రచన ఆలోచనామృతమై శిరఃకంప మొనర్ప జేయును. ఎఱ్ఱనశైలి పురాణములకు దోబుట్టువు సోమనశైలి శ్రీనాథాది పబంధకవులకు మేలుబంతి

కవిత్వమును భావానుగమ్య మనియు, బుద్ధిగమ్య మనియు ద్వివిధములుగ జెప్పవచ్చును భావనచే వస్తువు సాక్షాత్కారమగుటయు దానిని ఇతరులకుసాక్షాత్కరింప జేయుటయు జరుగును పదముల యర్థచమత్కారముచే మనసును విప్పార్చునది బుద్ధిగమ్య మననగును సోమన కవిత్వ మీ రెండవపద్ధతికి జెందినది "అర్థచిత్రాన్నరససిద్ధిః" అనిగదా ఆలంకారికుల మతము

సోముడు ప్రౌఢశృంగారవర్ణనలో మేటి ఊర్వశీ నరకాసుర సంవాదము దీనికి పరమోదాహరణము యువజన శృంగారము వర్ణించుపట్టున సోముని నడకలు ప్రౌఢమార్గముననే గమించును సోముని శృంగారమునకు కామము బీజము దాంపత్యమును బవిత్రముగా నొనరించు మధురప్రకృతిని స్నేహము దాస్యము అను ప్రణయభావములను సోముడభిమానించినటుల గన్పడదు ఈతడు స్వతంత్రుడైన కవి శబ్దాలంకారముల విషయమున నీత డెన్నియో క్రొత్తత్రోవలు త్రొక్కెను ఈతని కవిత్వమునకు వక్రోక్తి జీవనము భావతీవ్రతచే నీతని భాషాప్రవాహము వెల్లి వెరియుచుండును నిదానించుట యనునది యీతని భావ ప్రపంచమున గానరాదు ఆ యావేగముతోనే తన చూపున కందినంత వట్టు ప్రత్యక్షముగా జూడగలడు ఇది యపూర్వమైన శక్తి కాని యీ యావేగమే కొన్నియెడల ననౌచిత్యమునకు దారి దీసినది. అయినను భావావేశము వర్ణనావైశిష్ట్యము గల ఈతని కవిత్వమందది యంతగా పాటింపదగినది లేదు పండితులు, విమర్శకులు నగు వేటూరి ప్రభాకరశాస్త్రిగారి యభిప్రాయము సోముని కవితాశక్తిని విశదీకరించునని యిందు పొందుపఱచు చున్నాను 'నన్నయభట్టారకు ధారాశుద్ధియు, తిక్కనభావ గాంభీర్యమును గలయికజెంది మన సోమనాథుని కవిత నాశ్ర యించిన దనవచ్చును కొన్నిచోట్ల శయ్యా సౌభాగ్యము అతి మాత్రమై యర్థంపుసొంపును గొంతవఱకు కొఱత పఱచినదనియు ననదగియున్నది ఈ కవీశ్వరుని రచనము పెక్కుపట్టుల దిక్కన సోమయాజి రచనమును బుడికి పుచ్చుకొనినటుల గానవచ్చును. మఱియు దిక్కనవోలె నీతడును మాటలు తేటగా నున్నను లోతుగ నాలోచించినగాని యర్థముగానియట్లుగా ననేక పద్యముల రచించినాడు తెలుగువాఙ్మయమున నితరకవు లెవరును సాధారణముగ బ్రయోగించి ఎఱుగని యుపమానములను, అర్థాంతరన్యాసములను దృష్టాంతములను నీతడు ప్రయోగించెను ఈ కవి చేసిన

యుద్ధవర్ణనలు తత్కాలపుయుద్ధముల జూచి చేసినవా యని పించును ప్రాచీనాంధ్రకవులలో దురవబోధము లనబడు వానిలో సోమనాథుని కృతి ప్రధానమైనది అప్రతీత పద ప్రయోగాభిమానముచేతను శయ్యానైగనిగ్య సంపాదన ప్రీతి చేతను అనుప్రాసవిన్యాసాభిరతిచేతను నీతడు తన కృతిని బెక్కు పట్టుల దురవబోధము గావించెను అందును వచన రచనలో మఱియు గఱుసుదనము జూపించెను ఆంధ్రకవులలో చిత్రకవిత్వము వెలయించినవారిలో నీతడే ప్రథముడు కానోపు అచ్చతెలుగు పద్యములు, నిరోష్ఠ్యపద్యములు, అనుప్రాసపద్యములు నీతని కృతిలో గానవడును ద్విత్రిచతుర్ప్రాసపద్యములగూడ నీతడు జెప్పినాడు

పాండిత్య ప్రకర్షకై అపూర్వ పదప్రయోగ మొనర్చి, యీతడు తన కృతికి భాషాక్లిష్టత నాపాదించె ననవచ్చును దిశాపట్టణము, జామకము బదలములు మొదలగు కన్నడ పద ప్రయోగములు సోముని భాషకు క్లిష్టత చేకూర్చినవి కన్నడ పదముల మిగుల నేర్పుతో దెలుగు పదములే యనుకొనునటుల నీ కవి ప్రయోగించుటచే, నీ కిటుకు తెలియని వారికి సోముని భాష కొన్ని యెడల కొఱుకుడు పడదు భావప్రాధాన్యమును మించిన వస్తుప్రాధాన్యముగూడ కొన్ని యెడల ద్యోతకమగును వస్తు రచనా విధానమున సర్వతోముఖప్రతిభ ప్రదర్శించి నవీన గుణ సనాథుడయినాడు సోమనాథుడు కొన్ని యెడల నీతని పద్య రచనకు శబ్దాలంకార అంత్యప్రాసాది నియమములతో సాటిగా దీటుగా కవిత్వము చెప్పినవాడు పోతనామాత్యుడు

నాచనసోమన :

మ ఆరి జాచుక్ హరిజాచు జాచుకములం దందంద మందారశే
సరమాలా మకరందబిందు సలిలస్యందంబు లందంబులై
తొరగంబయ్యెదకొంగొకింత దొలగన్ దోర్మూలరాసారమున్
దరహాసామృతపూరమున్ గురియుచుం దన్వంగి హేలాగతిన్

మ గనయంబున్ గొనయంబు సెన్నడుముతో గర్ణావతంసంబుతో
జనుదోయిం గనుదోయి సాయకముతో గర్ణావతంసంబుతో
జెనకం జేయుచు సేయుచుండె సతి లక్ష్మీభూత దైతేయ త
ర్జన గర్జారవజర్జరాంగరుధిరాపారంబు దోరంబుగన్

కం అరవిందనయన శరముల
సరవిం దన యనుప చూపు జాపముగుడు సై
పరివేషము గల చంద్రుని
పరివేషము దాల్చె మొగము జగము నుతింపన్

పోతనామాత్యుడు

మ పరు జూచున్ వరు జూచు నొంప నలరింపన్ రోషరాగోదయా
విరతిభ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారముల్
జరగన్ గన్నుల కెంపుసొంపు బరగం జండాస్త్ర సందోహమున్
సరసాలోకసమోహమున్ సెలవుచున్ చంద్రాస్య హేలాగతిన్.

ఆ వె హర్షదాయియై మహారోషదాయియై
పరగు ముద్దరాలి బాణవృష్టి
హరికి నరికి జూడ నందంద శృంగార
వీరరసము లోలి విస్తరిల్లు

భావగాంభీర్యము శబ్దగతరసము రచనాచమత్కృతియు కలిగి యర్థస్ఫురణము గల ఈ పద్యము జూడుడు

చ చనిచని కాంచె నంత ఋషిసంహతి సారసకేసరాంతరా
సనసరసాళి సంగతట చందనశాఖి చలత్తరంగ గాం
చన సరసీజలార్ద్రయతి సంచితసైకతలింగ సంగ సం
జనగిరిగాఢ గంధగజ సంగత శృంగరథాంగ నత్తటిన్

ఈ పద్యము ననుకరించిరేమో యనునటుల పిల్లలమఱ్ఱి పినవీరన్నయు, అలసాని పెద్దనయు వ్రాసిన పద్యముల జూడుడు

ఉ పావని గాంచె గట్టెదుర భర్మశిరోగృహ తుంగశృంగ సం
భావిత పద్మరాగఖగభిత్తి సమాజ విరాజమాన శీ
లా విపరీత సాంధ్య నిశలం దిశలందు నలంకరించు భ
ద్రావతి యౌవనాశ్వ నరరాజ విరాజదిరామరావతిన్ (జై॥ భా)

చ॥ అట జని కాంచె భూమిసురు డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠదభంగతరంగ మృదంగనిస్స్వన
స్ఫుటనట నానురూప పరిఫుల్ల కలాపకలాపి జాలముం
గటకచరత్కరేణుకర కంపిత సాలము శీతశైలమున్

శబ్దమాపాతతః శ్రవణసుఖమును గూర్చును అర్థము తెలియకున్నను మనము ఆనంద మనుభవింపగలము. శ్రవణసుఖమాత్రముననే భావము ద్యోతితమగును. అట్టి శబ్దాలంకార భావగాంభీర్యములకు సోమన యందె వేసిన చేయి. తరువాతి కవుల కాతని వ్రాత లనుకరణీయములైనవి. నేటికిని సోమునభిమానించి యనుకరించువారు కలరు. సోమనాథుడు తనయపూర్వ ప్రతిభావిశేషముచే గవితాపటిమచే, పాండిత్య ప్రకర్షచే వినూత్నశైలీచమత్కారముచే దరువాతి కవులకు మార్గదర్శకుడై మన్న నలజార గానెను. అంతమాత్రమున నొక కవిని మఱొక కవితో బోల్చునపుడు ఒకరికవిత్వము మఱియొకరి కవిత్వమును మించిన దనిగాని, లేదనిగాని విమర్శించు టెంతవఱకు సమంజసమో విజ్ఞులెఱుగుదురు. మంచి యెట నున్నను స్వీకరించుటయే సజ్జనసమ్మతము.

సోముడు హరివంశమునేకాక 'వసంతవిలాస మను ప్రబంధము నొకదానినిగూడ రచించెనని చెప్పుదురు. లక్షణగ్రంథముల నుదాహృతములగు నీ పద్యములయందు సోమనాథుని ముద్ర కన్పించుచునే యున్నది.

శా ప్రాలేయప్రతివీరసేన బఱచెన్ బైపై వసంతం బిలన్
గాలోన్మీలితకోరకోదర శరాగ ప్రౌఢకోపాగ్నియై
హేలాపానవిహారసార మహిళాహ్యాంకారదోస్సారమై
హేలాపల్లవహేతిఖండిత మహాహేమంతసామంతమై

ఒక రామాతిలకంబు రత్నరుచితో నొప్పారు మందారకో
రకముం గర్ణవతంస తన్నిలుపుచున్ రాగ్యాలతాసక్తచూ
చుక చేలాంచలయై మలంగి విడు మంచున్ గేలుసాచెన్, సుహా
యుక హార్యం బెగగొన్న మన్మథుని ప్రత్యాలీఢ పాదంబులన్

# 3

# శృంగార శాకుంతలము

[పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు]

పదునొకండవ శతాబ్దిలో భారతరచనతో నారంభమయిన పురాణేతిహాసముల తెలుగుసేత పదునైదవశతాబ్ది యంతము దనుక సాగుచునే యుండెను ఈ యాంధ్రీకరణమున కవిత్రయమార్గ మొకటి, నాచనసోముని మార్గమొకటియని చెప్పితిని సోమునకు పిమ్మట కవులాతని మార్గమునే సామాన్యముగ ననుకరించుచు వచ్చిరి వీరిలో శ్రీనాథ పోతన్నలు ముఖ్యులు శ్రీనాథుడు పురాణైకదేశములను స్వతంత్రముగ దెలిగించి వానికి కావ్యలక్షణములు సమకూర్చెను కావ్యైకదేశములను గూడ హరవిలాసాదులలో నాత డనువదించుకొనెను అంతియేకాక కాశీఖండమున మయూరుని సూర్యశతకమునుండి కొన్ని శ్లోకముల దెలిగించుకొనెను అతనిది నిరాఘాటధాటి పోతనయు భాగవత పురాణమున కావ్యశైలి నవలంబించుట కానవగును

శ్రీనాథుడు తెలుగుసేతయం దెంత స్వతంత్రుడైనను, అతని కృతులు స్వతంత్రకావ్యములు కావు ప్రబంధలక్షణము లన్నియు వానికి లభింపవు అవి స్థలపురాణము వంటివి ఈత

నికి బూర్వమే నన్నెచోడుడు సంస్కృత కావ్యభాగములను కుమారసంభవమున స్వేచ్ఛమై తెనిగించుకొనినాడు పురాణేతిహాసముల వదలి సంస్కృత కావ్యముల నెత్తికొన్న గౌరవము నన్నెచోడునిదే వీరిటులుండ మంచన కేయూరబాహు చరితమునను నందిమల్లయ్య ఘంటసింగనలు ప్రబోధచంద్రోదయమునను సంస్కృతనాటకములను శ్రవ్యకావ్యములుగ జేయు క్రొత్తమార్గమును దొక్కిరి పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు గూడ శృంగార శాకుంతల రచనమున నా మార్గమే యవలంబించెను కాగా బదునాఱవ శతాబ్దియం దవతరించిన ప్రబంధమను స్వతంత్ర కావ్య మాయీ కవులందఱకు ఋణపడియున్న దనవలయును పదునాఱవ శతాబ్దినాటి ప్రబంధములు సంస్కృతమునకు తెలుగు సేతలు గావనునదియే వాని విశిష్టత ప్రబంధ మను పదము తిక్కన భారతభాగములకు ఎఱ్ఱన నృసింహ పురాణమునకు గూడ వర్తించినవని గమనించితిమి అయినను అవి స్వతంత్రములుగావు అట్లే నన్నెచోడ, నాచనసోమ, శ్రీనాథాదుల కావ్యములును స్వతంత్రములు కావు

ఇక కవిసార్వభౌముని బావమఱదియు శిష్యుడు నయిన దగ్గుమల్లి దుగ్గన రచిత నాచికేతోపాఖ్యాన మొకటి స్వతంత్ర కావ్యమని కొందరందురు అది యుత్తమజాతికావ్యమే శృంగారమందు పరిణతినంది పవిత్రమైనది కథావస్తువు ఉదాత్తమైనది దంపతుల పవిత్రప్రేమ వర్ణింపబడినది భావానుకూల పదప్రయోగకుశలతతో అలంకారశోభితమై శైలీపాటవము గలిగి మనోరంజకముగ నుండును కవిత్వము సరళమై యుత్తమస్థాయిని నడచి సర్వజనమనోభిరామమై యొప్పుచున్నది ఈ కథ యుపనిషత్తులనాటినుండియు ఏవో కొన్ని మార్పులతో ఆయా పురాణములందును గృహీతమయియున్నది భారతమందును, కఠోపనిషత్తునందును ఈ గాథ మిక్కిలి వివరముగ నున్నది కాని దుగ్గన రచితమైన గాథ యీ రెంటికి భిన్నముగ నున్నది

దీనికి సరియగు సంస్కృతమూలకావ్యమున్నదని కొందఱందురు అది యెటులున్నను నాచికేతోపాఖ్యానము ధర్మోపదేశమే ప్రధానముగా నడచిన శాంతరస కావ్య మనవలయును కావున శృంగారరసప్రధానములగు పదునాఱవ శతాబ్దినాటి ప్రబంధ రాశిలో నిది జేరదు దుగ్గన శ్రీనాథుని శిష్యుడయినను ఈతని రచనయందు శ్రీనాథుని శబ్దజటిలతగాని శృంగార రసోల్బణత గాని మందుకైన గానరాదు

'ఇక పదునాఱవ శతాబ్దికి బూర్వమందు రచితమైన కావ్యములలో ప్రబంధలక్షణముల నన్నిటిని సమకూర్చుకొనినది పిన వీరభద్రుని శృంగార శాకుంతలము భారతమున ప్రసిద్ధమైన శకుంతలోపాఖ్యానకథను గైకొని యీతడు దానికి వలసిన చోట్ల కాళిదాసాభిజ్ఞానశాకుంతలమునుండి కల్పనాదులు గైకొని మెఱుగు బెట్టెను కావున కాళిదాసు నాటకమునకుగాని, వ్యాసభారతమునకుగాని యిది తెలుగుసేత కాదు కావున ప్రబంధ కవుల కీత డాద్యుడని చెప్పదగును ఈతని రచనల నించుక పరామర్శింతము.

పినవీరభద్రుడు నవరసదర్పణము, నారదీయము, మాఘ మాహాత్మ్యము, మానసోల్లాసము, జైమినీభారతము, శృంగార శాకుంతలము మొదలగు గ్రంథములు రచించినటుల చెప్పుదురు కాని యిప్పటికి శృంగార శాకుంతల మను ప్రబంధము, జైమినీభారత మను పురాణముమాత్రమే లభ్యములు ఈ కవి తన వంశాదుల, తాను భావించి యుత్తమమని నిర్ణయించుకొనిన కవితారీతుల తన గ్రంథావతారికలందు జెప్పుకొనినాడు జైమినీ భారతాశ్వాసాంతగద్యముల ' భారతీ తీర్థశ్రీచరణకరుణాపాత్ర గాదయామాత్యపుత్ర వినయవిద్యాసముద్ర పినవీరభద్ర ప్రణీతం బైన'' అని యుండగా, శృంగారశాకుంతల గద్యము 'శ్రీభారతీ తీర్థ గురుచరణ కరుణాలబ్ధ సిద్ధ సారస్వత పవిత్ర గాదయా

మాతృపుత్రి యారాధితామర వీరభద్ర పిల్లలమఱ్ఱి పినవీరభద్ర ప్రణీతంబయిన శాకంతల శృంగారకావ్య'' మని యున్నది గద్యమునం దటు లుండగా శృంగారశాకుంతల మను నామమునే ఆ కావ్యము సంపాదించుకొన్నది అవతారికవలన నతఁడు ఉపాసనాపరుడనియు, మంత్రశాస్త్రజ్ఞుడనియు నూహింపనయ్యెడు తన వంశాదుల నిటుల వర్ణించెను

కం॥ తాతయుఁ దండ్రియు నగ్ర
భ్రాతయునుం దాను భువనభాసురకృతి ని
ర్మాతలు పిల్లలమఱి వి
ఖ్యాతుని బినవీరు బోలఁగలరే సుకవుల్?

సీ॥ అమృతాంశుమండలం బాలవాలము గాఁగ
మొలచె నొక్కటి జగన్మోహనముగ
చిగిరించె విలయసింధుగతకైతవడింభ
శయనీయవరపలాశములతోడ
పితృదేవతలకు నంచితసత్రశాలయై
చెట్టుగట్టెను గయాక్షేత్రసీమ
నీలువ నీడయ్యె నిందీవరప్రియకళా
కోటీరునకు భోగికుండలునకు

గీ॥ మఱ్ఱిమాత్రంబె పిల్లలమఱ్ఱి పేరు
పేరువలె గాదు శారదాపీఠకంబు
వారి లోపల బినవీరు వాక్యసరణి
సరసులకు నెల్ల కర్ణరసాయనంబు

కం॥ ఆ సుకవిచేత శివభజ
నాసక్తునిచేత గశ్యపాన్వయుచేతన్
భాసుర నవకవితాల
క్ష్మీసదనుని చేత వలయు కృతి జెప్పింపన్

మం॥ అని సాధ్వీమణి నాగమాంబకును విద్యాభారతీజాని గా
ధనకుం బుత్రుని వీరభద్రపదపద్మ ధ్యాన శుద్ధాంతరంగు

అని తెలియుటయే గాక విశేషించి వీరి వంశము శారదా పీఠమని చెప్పుటచే నీతడును మంత్రశాస్త్రమున సిద్ధుడని గ్రహింప వలసియున్నది

పినవీరన కవిత్వ తత్త్వమును శృంగార శాకుంతలమున దెలియ జెప్పిన విధమరయుదుము

సీ. నన్నపార్యుడు ప్రబంధ ప్రౌఢవాసనా
సంపత్తి సొంపు పుట్టింప నేర్చు
దిక్కయజ్వ వాక్ఛక్తి శామోదంబు
చెలువు కర్ణముల వాసింప నేర్చు
నాచరాజుని సోము వాచామహత్త్వంబు
సౌరభంబుల వెదజల్ల నేర్చు
శ్రీనాథభట్టు భాషానిగుంభంబుల
బరిమళంబులగూడ బఱచ నేర్చు

దీనివలన ఆయా మహాకవుల కవితారీతులు, కవిత్వ తత్త్వము పినవీరన నెటుల నాకర్షించినదియు, ఏయే కవితా లక్షణము లుండవలసినవని పినవీరన భావించినదియు కొంతవఱకు దెలియనగును మఱియు జైమినీభారతమందలి యీ పద్యము గూడ పినవీరకవితా స్వభావమును గొంతవఱకు సూచితచును.

ఉ. అల్లన విచ్చు చెంగలువలందు రజంబును కప్పురంబునై
జల్లగ జల్లనై వలచు సౌరభముల్ వెదజల్లు భావముల్
పల్లవహస్తచన్నుగవ పయ్యెద జీబుగ దోచుభాతిగా
బిల్లలమఱ్ఱి వీరన యభిజ్ఞుడు జెప్పగ నేర్చు గబ్బముల్.

ఇటుల కవులు తమ కవిత్వతత్త్వమును, కవితారీతులను జెప్పుకొనుట సాధారణమే ఆయా లక్షణము లన్నియు అక్షరతః వారివారి రచనలయం దుండకున్నను స్థూలముగ నాయాకవుల కవితాలక్షణముల గ్రహించుటకు దోడ్పడును. ఇటుల తమ కవిత్వ తత్త్వమున గ్రంథావతారికయందు నిర్వచించిన వారిలో తిక్కన ప్రథముడు పినవీరన ద్వితీయుడు

శ్రీనాథుడు, పినవీరన సమకాలికులు అట్లయ్యు నీతడు పూర్వకవిస్తుతిలో శ్రీనాథునిగూడ జేర్చుటలో నీతనికి గవిసార్వభౌమునిపట్ల గల మిక్కుటమైన గౌరవభావము వెల్లడి యగుచున్నది శ్రీనాథుని శృంగారనైషధము ను జూచి ఆ నామ మనుకరించి తన గ్రంథమును శాకుంతలశృంగార కావ్యమని ఈతడు వాకొనియెను పద్యరచనలోను కల్పనలలోను సంస్కృత సమాసఘటనలోను శ్రీనాథుని పోకడల నీతఁడనుకరించెను తన ప్రతిభచే శ్రీనాథుని మరపింపనుద్దేశించి శృంగారశాకుంతలరచన సాగించియుండును తానుగూడ శ్రీనాథునంతవాడు కావలయు నని కోరిక గలిగియుండుటయు సహజము శ్రీనాథునివలెనే ఈతడును కామపారాయణుడను నపప్రథయు నొందు గలడు శాకుంతలకావ్యమున స్త్రీవర్ణనాదులు కొన్ని యెడల నతిగా నున్న మాత్రమున కవికీ నింద నంటగట్టరాదు పూర్వకవులకు నిట్టి వర్ణనలయందు శాస్త్రీయదృక్పథమే యెక్కుడు కాని యుచితా నుచితవివరణయం దంత యెక్కువశ్రద్ధ యున్నటుల దోచదు నాటి ప్రజల ప్రభువుల యభిరుచులుగూడ గమనించియే రచనల జేసియుందురు ఋషి కానివాడు కవి కా' డను సూక్తిని గమ నించిన కవియగువానికి నూహింపరాని విషయములుండ వనియు, రసపరతంత్రతచే మహాకవులగువారు సర్వవిషయములందు తన్మ యీభావ మందుచుందురనియు ఆ స్థితిలో వారికి సర్వలోక ములు, దేశములు, సకలప్రకృతులు కరతలామలకములై తోచు ననియు తోచును రవి గాననిచో కవి గాంచునేకదా ' అందుచే కవి తన రచనయందే రస మెంతవఱకు వరణీయమో, యెటుల బరిణితి జెందునో గ్రహించి రచన సాగించును అంతమాత్రమున దాని నాతని వ్యక్తిత్వమునకు ముడివెట్టుట సమంజసము కాదు

ఇట్టిదియే మఱొక యపప్రథ పినవీరన వాణి నా రాణి' యనినాడట సరస్వతీదేవిని తల్లిగాదలచు మన సంప్రదాయమున కిది విరుద్ధము ఈ కవిప్రతిభ దెల్పుట కిది యుపకరించుచున్నను,

పినవీరన యటు లనియుండడు ఈకవి మంత్రోపాసకుడు. మంత్రతంత్రశాస్త్రములలో దేవతకు రాజ్ఞి యను సంజ్ఞ గలదు. పినవీరన వాణిని ఉపాసనదేవతగా భావించి నుతించినటులీ పద్యము వలన దెలియనగును "శృం. శా."

సీ॥ ప్రణవపీఠమున మంత్రపరంపరలు గొల్వ
నుండు నే దేవి పేరోలగంబు
భావజ్ఞులకు బరాపశ్యంతిమధ్యమా
వైఖరు లేదేవి వర్ణసరణి
జపహారకీరపుస్తకవిపంచిసమంచి
తంబు లేదేవిహస్తాంబుజములు
కుందేందుమందారకలదళబృందంబు
చంద మేదేవియానందమూర్తి
గీ॥ కాంచ నేదేవి కాంచనగర్భచతుర
పూర్వదంతకవాటవిస్ఫుటమనోజ్ఞ
చంద్రకాంతశిలాగృహస్థలవిహార
మమ్మహాదేవి వాగ్దేవి నభినుతింతు

మ॥ పొసగ న్నే గృతి జెప్పగా బరిమళంబు ల్పాల శో[illegible]చో
గొస రొక్కించుక గల్గెనేనియును, సంకోచంబుగాకుండ నా
రసి యచ్చోటికి నిచ్చుగాత పరిపూర్ణం బొంద వాగ్దేవి యిం
పెసలారం దన విభ్రమశ్రవణకల్హారోదయామోదముల్.

ఇట్టి వాగ్దేవతాభక్తు డాయనయెడ నపచారోక్తు లాడెననుటకల్ల సరస్వతియే కవికి మాఱుగ గ్రంథరచన చేసెననుగాథ పై పద్యమునుబట్టి కల్పించియుందురు అది గ్రంథప్రాశస్త్యము నినుమడింపజేయు మాటయేగాని యన్యము గాదు

ఈ మహాకవి రచించిన కావ్యములు రెండును ఉత్తమ తరగతికి జెందినవే అందు మొదటిది శృంగారశాకుంతలము, రెండవది జైమినీభారతము శృంగారశాకుంతల కావ్యనిర్మాణమునకు హేతువు గ్రంథావతారికయందు కవి విశదీకరించినాడు

చిల్లర వెన్నమంత్రి కీగ్రంథము కృతియీయబడినది. అతడు పట్న వాస్తకులోద్భవసంభవుడు కౌండిన్యగోత్రాభివర్ధనుడు నయవిశేష విజితసురమంత్రి. అట్టి కృతిభర్త పలుకు లాలింపుడు

శా॥ ప్రఖ్యాతం బన మిశ్రబంధ మన సుత్పాద్యం బనంగా ద్రిధా
వ్యాఖ్యాతంబగు వస్తువందు మతి యధ్యాహారముల్ జేయఁగా
బ్రఖ్యాతం బితివృత్తమైన కృతి చెప్ప న్వక్తకున్ శ్రోతకున్
సత్ఖ్యాతిం గలిగించు బుణ్యమహిమ న్విశ్వంభరామండలిన్

కం॥ శృంగారము ముఖ్యంబగు
సంగీయాంగములు దలప నష్టరసములు
న్సాంగమగునేని డంకము
బంగారముతోడి యొఱ ప్రబంధము నొందున్

ఈపద్యములందు స్థూలముగ బ్రబంధలక్షణముల సూచించి
నాడు ప్రబంధకవు లందఱీలక్షణముల ననుసరించినవారే

గీ॥ కథ ప్రసిద్ధము మిగుల శృంగారమతియు
బరిగణింపంగ శ్రీమహాభారతమున
గథితమైన శకుంతలాఖ్యానభంగి
నది ప్రబంధంబు జేయఁ బ్రఖ్యాతినొంద

సీ॥ సరపువ్వులుగ మాలకట్టి పెక్కు తెఱఁగుల
విరుల సెత్తులుగ గావించునట్లు
కర్పూరకస్తూరికా వస్తువితతిచే
శ్రీఖండచర్చ వాసించునట్లు
ఒడికంబుగా గందవొడికి నానానూన
పరిమళంబులు గూడ బఱచినట్లు
సరిఘలు వివిధపుష్పమరందలవములు
గొనివచ్చి తేనియ గూర్చినట్లు,

గీ॥ భారతప్రోక్త కథ మూలకారణముగ
గాళిదాసుని నాటకక్రమము కొంత
తావకోక్తి నభినవశ్రీ వహింప
గూర్చి కృతిసేయు నాఁట శాకుంతలంబు

ఈ పద్యమువలన నొకటి యేర్పడుచున్నది ప్రసిద్ధమగు నితివృత్తమును గ్రహించుటలో దాని నెటుల గ్రహింపవలయును, దానికి రసవత్తరరూప మేర్పఱుప నెట్టి మార్పులు జేయవలయును అనునవి కొంతవఱకు సూచింపబడినవి భారతప్రోక్త కథను మూలముగా గ్రహించి కాళిదాసు రచనచే మెఱుగుపెట్టి మేళవించి కవి నిజప్రతిభచే రసవత్కావ్యరూప మేర్పఱుపవలయును పూర్వగాథల పూర్వకవుల ననుసరించి యనుకరించినంతమాత్రమున కవితన వ్యక్తిత్వమును, స్వతంత్రభావములను, పోకడలను, రచనారీతులను వీడవక్కఱలేదు పూర్వగాథలు కథాబీజములు మాత్రమే

శృంగారశాకుంతలము కాళిదాసు అభిజ్ఞానశాకుంతలమును మాతృకగ గ్రహించి రచింపబడిన ప్రబంధరాజము. ప్రప్రథమముగ నాంధ్రవాఙ్మయమున స్వతంత్ర ప్రబంధముగ వెలసిన దిదియే యనవలయును నాటకమును ప్రబంధముగ రచించుట మిక్కిలి కష్టముతో గూడిన పని ప్రబంధముగా రూపొందించిన వారిలో నీతడే ప్రథముడు ప్రబోధచంద్రోదయ గ్రంథకర్తలు రెండవవారు మంచనయొకరు కొంతవఱకీ ప్రబంధరచనకు కవి భారతగాథమీద కూడ నాధారపడెననుట విదితము అందందు కొన్ని మార్పులు గనబడును. కాళిదాసుని నాటకములోని యుత్తరభాగమును గైకొనక భారతమునందుండు రీతిని శకుంతలా దుష్యంతులకు పునస్సంయోగము గలిగించెను శకుంతల పుత్రసమేతముగ హాస్తిపురమున కరుగుటయు భారతమునుండి గ్రహించినదే కాని రెండు గాథలకు భిన్నముగ గొన్ని యెడల కథ సాగెను శకుంతల తా జన్మవృత్తాంతము రాజునకు జెప్పుటలో నన్నయ యొక తీరునను, కాళిదాసొక తీరునను, వీరభద్రుడీ రెంటికి వేఱగు మూడవమార్గము ననుగమించిరి ఈ మార్పులు ఔచితి ననుసరించి చేసినవై యుండును మేనకను విశ్వామిత్ర తపోభంగము జేయ నింద్రుడు పంపుటలోను మేనకవిశ్వామిత్రా

క్రమము బ్రవేశించుటలోను కూడ భారతరచనకు, దీనికి భేదము గలదు  అటులనే మునికన్యలు

ఉ  మా తరలాక్షిపై గలుగు మక్కువ నిక్కువమయ్యెనేని యో
భూతలనాథ యీ తలిరుబోడికి నీకును బుట్టు పుత్రు బ్ర
స్ఫీతిగ యౌవరాజ్య పదపీఠమున న్నిలుపంగ సత్కృపా
న్వితుడవై మనోజ్ఞ మహనీయముగా శపథంబు నీదగున్

అనునదియు భారతమందు శకుంతలచే నడగించినదానికి మెఱుగు వెట్టినటులున్నది  మార్పులు చేయవలయునను సంకల్పము మంచిదే  అయినను అన్నియెడల నా మార్పులు సత్ఫలముల నొసగెనన వలనుపడదు  శకుంతల జన్మవృత్తాంత మామె చేతనే చెప్పించుట భావ్యము కాదని కాబోలు, కాళిదాసు మునికన్యలచే జెప్పించెను  అటుల జెప్పుటయు స్త్రీజనోచితము కాదని కాబోలు పినవీరన మునికుమారునిచే జెప్పించెను  అయినను ఫలము కోరినంతగ గలుగలేదు  ఆ మునికుమారుల మాటలు చూడుడు

సీ॥ తేటిమొత్తము నేపు దూటుబుచ్చగ నొప్పు
  కమనీయ నీలాలకములు జూచి
చిగురుటాకుల డాలు జిన్నబుచ్చగ జాలు
  సాంద్రంపు కెంపు హస్తముల జూచి
కరికుంభముల క్రొవ్వు గాకుసేయగ నవ్వు
  దోరంపు నెరిచన్నుదోయి జూచి
చంద్రబింబము పెంపు సవతుగాదనిపించు
  మొలకనవ్వుల ముద్దుమొగము జూచి
రసములూరెడు బింబాధరంబు జూచి
పసిడిపాడి రాలు కత్తువైభవము జూచి
కమలముల నేలు పాదపద్మములు జూచి
మునికి జిక్కులిగిలిగింత గొనె మనంబు

బహుచక్కని పద్యమే  అయినను కళాదృష్టితో జూచినచో నింద్రియ వికార మెఱుగని మునికుమారునిచే నీ రీతిగ

జెప్పించుట దోషమనియు, ననౌచిత్య మనియు దోచక మానదు

భారతగాథ పురాణము అభిజ్ఞానశాకుంతలము నాటకము శృంగారశాకుంతలము ప్రబంధము అందుచే కథాకథనము నందేమి పాత్రపోషణయందేమి భేద ముండుట సహజము పురాణమునందును, ప్రబంధమందును కవి పఠితలకు గనబడి వినికిడి చేయుచుండెనా యనునట్లు కథాకథన ముండును నాటకమున పాత్రల మాటున మరుగువడి పాత్రలచే చెప్పించును అటుల జెప్పుటలో కవిభావములుగూడ ఆ యాపాత్రల భావముల వలె నుండునుగాని కవిభావములని ప్రేక్షకు లనుకొనునటు లుండ రాదు అందుచే నాటకమున సూచ్యమయిన మృగయా విహారాదులు ప్రబంధములందు విపులముగ వర్ణితములగును. ప్రబంధము వర్ణనాత్మకము అష్టాదశవర్ణనలు ప్రబంధములకు ప్రధాన లక్షణములుగ జెప్పబడినవి అందుచే నీప్రక్రియ ప్రబంధరచనమున కవశ్యకరణీయము, నాటకమున ప్రదర్శనయోగ్యములగు విషయములే రూపము దాల్చును ప్రదర్శనయోగ్యము గానివి సూచ్యము లగును ఆదర్శప్రబంధనిర్మాణకుతూహాలు డగు పినవీరభద్రుడు ప్రబంధమునకు నిర్ణీతలక్షణము లనదగు అష్టాదశ వర్ణనల నలంకారములతో గుదిగూర్చి తన గ్రంథము వెలయించి నాడు కొన్ని యెడల నీవర్ణనలు కథాకథనమునకు మాంద్యము కలిగించినవి అయినను అట్టి ఘట్టములనే కవి భావుకత్వము, ప్రతిభ, శాస్త్రజ్ఞానము, కల్పనాచాతురి వెల్లడియగును లోకము నకు దానొసగదలచిన సందేశము, ప్రబోధము మొదలగువానిని సూచించుట కిట్టి పట్టు లవకాశ మొసగును కథను వినికిడిచేసి నంతమాత్రమున తృప్తియుండదు ' సారమతిఁ గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తి లోనారసి మేలునాన్ '' అనిగదా నన్నయసూక్తి ఆలంకారికవర్ణన లుండినగాని కథకు రసపుష్టి గలుగదు శృంగారశాకుంతలమున ననన్యసామాన్యమగు కల్ప

నలు భావోద్దీపితవర్ణనావైభవము గన్పడును ఈ కవి రచించిన రెండు కావ్యములందు నీతని భావుకత్వము ప్రతిభ గన్పడును ఈ విషయము మఱల ప్రస్తావింపబడును

అభిజ్ఞాన శాకుంతలమును మనసునం దిడుకొని యనుసరించుచు మంచిపనితోచిన శ్లోకముల నితఁ డెడనెడ నాంధ్రీకరించుకొనినాఁడు

గ్రీవాభఙ్గాభిరామం ముహురనుపతిత స్యన్దనే బద్ధదృష్టిః
పశ్చార్ధేన ప్రవిష్టశ్శరపతనభియా భూయసా పూర్వకాయమ్
దర్భైరర్ధావలీఢైః శ్రమవివృతముఖభ్రంశిభిః కీర్ణవర్త్మా
పశ్యోదగ్రప్లుతత్వాద్వియతి బహుతరం స్తోకముర్వ్యాంప్రయాతి

చ. విలుఁగొని వెంట వెంట బృథివీపతి శరపాతభీతి దా
మలగిమలంగి కన్గొనుచు మార్గము క్రేవల నడ్డగించుచు
న్నిలుచుచు గొంత గొంత గమనించుచు నర్ధము మేసి మేసి ద
ర్భలు వివృతాస్యపార్శ్వముల రాలఁగ మింటికి జౌకళించుచున్

అసంశయం క్షత్రపరిగ్రహక్షమా
యదార్య మస్యామభిలాషి మే మనః,
సతాంహి సన్దేహపదేషు వస్తుషు
ప్రమాణ మన్తఃకరణప్రవృత్తయః

ఉ. సందియ మేల యీవికచసారసలోచన రాజపుత్రి నా
డెందము మానికన్యల బడిం జనసేరదు, నిక్కువంబ, రే
చందమునందు సంశయవిచారపదంబగునట్టి వస్తునీ
మం దమ చిత్తవృత్తులు ప్రమాణము లుత్తములైనవారికిన్

అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహై
రనావిద్ధం రత్నం మధు నవ మనాస్వాదితరసమ్,
అఖండం పుణ్యానాం ఫలమివ చ తద్రూప మనఘం
న జానే భోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః

చ॥ కొనకొన తావి మూర్కొనని క్రొవ్విరి యెయ్యెడ వజ్రసూచి డా
యని రతనంబు జిహ్వ చవియానని తేనియ గోట మోపి గి
ల్లని చిగురాకు లాలితవిలాసనికేతన మా లతాంగి దా
ననుభవకర్త యెవ్వఁడొ యావిధి యత్న మెఱుంగనయ్యెడున్

ఇటులనే నన్నపార్యుని భారతమందలి పద్యముల బోలిన పద్యములును గలవు ఋష్యాశ్రమవర్ణన భారతమునందలి వర్ణనను జూచి చేసినదే రాజ్యసభలో దుష్యంతునితో శకుంతల చెప్పిన నీతులు, ధర్మములు వీరన మునికుమారులచే చెప్పించెను

గీ. గుణవతియు బుత్రవతియగు శీలవతి
యైన భామను విడచు నన్యాయకారి
కిహపరంబులు లేవనియెడి సమిద్ధ
ధర్మశాస్త్రంబు తెలుగవా ధరణినాథ?

ఈ ఘట్టమునందలి పద్యము లన్నియు నన్నయ పద్యముల బోలియున్నవి కణ్వుడు శకుంతలకు బోధించిన నీతులు స్త్రీలకు శిరోధార్యములనదగినవి యౌవరాజ్య పట్టాభిషిక్తుడై నభరతునకు ధర్మోపదేశము జేయుట రాజనీతులు వివరించుట భారతమందు లేదు ఈ కవి స్వతంత్రించి రాజధర్మముల నిచట ప్రతిపాదించి నాడు ఈ ఘట్ట మెల్లరు జదువదగినది కొన్ని పద్యములను కవి తన కాలపు పరిస్థితులను మనసునం దిడుకొని వ్రాసియుండనోపు ఈ పద్యము చూడుడు

సీ. ఏటికాల్వల పరిపాటిగా దీర్పించి
చెఱువుల నీరందు సెలవు తెలిసి
దేవమాతృకలు నదీమాతృకలు నైన
గ్రామసీమ క్షేమగతులు దెలిసి
నీరుసేలలు వానకారులు పరికించి
వరిపొలంబుల పంటవలతు లరసి
కోరాయములు వచ్చుకొలది విచారించి
పదియూళ్ళ కొకరి దీర్పరిగ జేసి

గీ. చనువువారలు పనివారు శాత్రవులును
జోరులును జేయు బాధలు జేరకుండ
బ్రజల బాలించుకొనుచు దత్పరత సాను
రాగుడై ప్రోవవలయు రాష్ట్రంబు రాజు

కొన్ని యెడల పాత్రపోషణ కలుషితము చేసినాడు మానవ ప్రవృత్తికి మానవేతరప్రవృత్తికిగల యభేదాధ్యవసాయమును కాళిదాసువలె నీతడు పాటించినను కణ్వుని పాత్రయందు దివ్యమని చెప్పదగినవి— అతని బ్రహ్మతేజము, మహాత్వము నీ ప్రబంధములో కొంతవఱకు కుంటువడినవి అటులనే శకుంతల పాత్రపోషణలో కాళిదాసు ననుసరించినటులగాని నన్నయ భారతము ననుసరించినటులగాని దోచదు ఈ ప్రబంధమునందు శకుంతల అధీర దుష్యంతునియందలి వలపుచే అలసత్వమునంది స్వతశ్శక్తి యాలోచన లేని బేల నిస్సహాయ అందుచే కొంతవఱకు నిస్సారముగ చిత్రింపబడిన దనవలయును కాళిదాసు తన నాటకమున ఋష్యాశ్రమమునకు, మహారాజస్థానమునకుగల తారతమ్యముల నిరూపించినాడు తపోవనములో వికసించిన పుష్పము హస్తినాపుర రాజస్థానమున వాడిపోయినది మఱల స్వర్గధామమన నగు మరీచి యాశ్రమమున విప్పారి ఫలించినది తపోవనము సరళస్వభావముతో విశ్వాసముతో నిండిన అమాయిక శైశవావస్థ హస్తిపురము సంసారప్రతిఘాతభీషణమగు మధ్యాహ్నకాలము. శాశ్వతానందదాయకమగు పరిణతవయస్సు స్వర్గధామము ప్రతివాని జీవితమున నీ మార్పులు గన్పడును తరుణవయస్కుల పరస్పరానురాగమునకు వయసుగడచి పరిణతి జెందిన దంపతుల పరస్పరానురాగమునకు భేదము గలదు తరుణుల యనురాగములో నైహికమగు శారీరక సౌఖ్యవాసన లుండును పరిణతి జెందిన వయస్సు దంపతుల యనురాగ మెక్కువగ మానసికము, ఎక్కువ దృఢము పునీతము అభిజ్ఞానశాకుంతలమున మహాకవి కాళిదాసు భూతలమును స్వర్గధామముగ పరిణమింపజేసి చూపినాడు ఋష్యాశ్రమము సంయోగమునకు, రాజాస్థానము వియోగమునకు నాశ్రయములు గాంధర్వవివాహ మెంత శాస్త్రసమ్మతమైనను ఉత్తమమార్గము కాదుగాన ఎంత స్వల్పదోషమైనను ప్రాయశ్చిత్తమునగాని పక్షాళితము గాదను పరమధర్మమును

కాళిదాసు బోధించెను దూర్వాసుని శాపము శాపపరిసమాప్తి కారణము మొదలగువానికి కావలసిన అభిజ్ఞ' గురించిన కల్పన యంతయు నీ ధర్మమును బోధించుటకే కాక దుష్యంతుని మఱపునకు కారణము గల్పించి యాతని పాత్ర కౌన్నత్యము గూర్చి యతనిని ధీరోదాత్తుని జేయుటకు నుపకరించినది ఆ యీయద్భుత కల్పనలే కాళిదాసు శాకుంతలగాథ కింతటి ఖ్యాతి నిచ్చినవి

శృంగార శాకుంతలమున నితివృత్తము ప్రఖ్యాతము నాయకుడుత్తముడు, శృంగారరసము ప్రధానము ఇన్ని కట్టుబాటులతో రసవంతముగ రచింపబడి యిది ప్రబంధకవులకు మార్గదర్శకమైనది ప్రబంధరచనారీతులనే కాక కల్పనల పోకడల ఈ కవిని పెద్దనాది ప్రబంధకవు లంద అనుకరించినవారే ఈతనిని కొన్ని యెడలనైన అనుకరించనిగాని అనుసరించనిగాని రచన జేయుని ప్రబంధకవి లేడన్నను అతిశయోక్తిదోషము పొసగదు ఇతరకవుల రచనలలో నుత్తమ కల్పనలని రసస్ఫూర్తి ప్రయోగములని చెప్పబడు వాని కన్నిటికి బీజప్రాయము లనదగిన కల్పన లీతని రచనలయందు గలవు ఉదాహరణము లీయవలయునన్న ఎన్నియేని గలవు సూత్రప్రాయముగ ముందు ముందు ఉటంకించెదను ఈ గుణములే శృంగారశాకుంతలమును ప్రథమప్రబంధ మొనర్చినవి ఈ కవి భావుకత దెల్పునీపద్యముల జూడుడు

చ ఉడుపతివంశకర్తమహిమోన్నతి కెయ్యది మేర నాడు పా
లక్కడలి జనించునప్పుడు దళంబుగ నంటిన మేనిజిడ్డు వో
గడుగుకొనంగ వచ్చెనని కా శివునాదల యేట బాదముల్
దడబడ నోలలాడుచు హాళాహళిగాపడు నీదులాడుచున్ (జై)

పాదములు తడబడుట ఈదులాడుటవలననా, లేక భయమువలననా? శత్రుసేనను స్త్రీతో బోల్చిచెప్పిన యీ పద్యమందము నరయుడు

మ కరియానం బటుపాళిహస్తబృథుళంఖగ్రీవ చక్రస్తనిన్
బరసేనారమణి న్వరించితి పురోభాగంబునన్ నిల్చె ని

ర్భరకేళిన్ వినమాస్త్ర చిహ్నములు సేరన్ వావిగా దింక మా
ను రణోత్సాహము నీవు జన్యరతి గాంతున్నే యశస్సంతతిన్ (జై)

ఈ పద్యమందలి యలంకారములు సహృదయవేద్యములు మాలినీ నదివర్ణన గమనింపుడు

మ. చలదిందీవర చారునేత్ర సముదంచచ్చంచరీకాలకం
జాలజాతానన కంబుకంఠి బిసహాసం జక్రవాక
బులినశ్రోణి మరాళరాజగమన, న్యాభజాని గాంచె న్నటన్
జలకల్లోలపరంపరాని నదవాచాకాలిని న్మాలినిన్ (శృ శా)

అందమైన ఈకల్పన జూడుడు తేటి శకుంతలముఖాంబుజమును ముసరిన సందర్భమున చెలులమాటలు

మ. శ్రవణేందీవరముం భజించె నదియుం బ్రస్థానముక్తంబుగా
భవదక్షిన్ వసియించె నక్షి ముకుళింపం దేటి నెమ్మోముపై
దవిలెన్ దాని దొరంగజోపుటకు హస్తం బెత్తి వారించెదా
నవునంభోరుహసామ్యదోషము వయస్యా లేదె నీచేతికిన్'

ఎంత అందముగ శకుంతల యవయవమంజులత్వమునుస్ఫురింపజేసెను ! ఈ పద్యమందలి పదముల సయ్యాటము గనుడు

కం. వాలికలై విరిదమ్ముల
యేలికలై భావభవుని యెలదూపులకుం
బోలికలై యుత్కలికల
మాలికలై యబల దాకె మొగి నృపుజూపుల్ (శృ శా)

ఈ పద్యమును జూచియేకాబోలు నరసభూపాలీయకర్త-

కం. వాలికలై వెలిదమ్ముల
పోలికలై చందమామపులుగులకును దా
నేలికలైన నిరీక్షణ
మాలికల నృసింహు జూచె మదవతి వేడ్కన్

అను పద్యము రచించినాడు రసవత్తరములగు కల్పనలెన్నియేని యీ కవిగ్రంథముల జూపవచ్చును ప్రబంధకవుల

కీ కవి భిక్షు వెట్టె ననుటకు గూడ నొకటిరెం డుదాహరణముల నరయుదము

మ జననీ స్తన్యము గ్రోలుచుం జరణకంజాతంబునం గింకిణి
స్వన మింపారగ దల్లిమేన మృదులస్పర్శంబుగా దొండ మ
ల్లన నాడించుచు జొక్కు విఘ్నపతి యాలానంబుతో మంత్రి వె
న్ననికి న్మన్నన సొంపుమీఱ నొసగు న్భద్రంబు లెల్లప్పుడున్.
(శృ శా)

దీనిని మాతృకగ స్వీకరించి పెద్దన యీరీతిగ రచించినాడు

ఉ అంకము జేరి శైలతనయా స్తనదుగ్ధము లానువేళ బా
ల్యాంకవిచేష్ట దొండమున నవ్వలి చన్గబళింపబోయి యా
వంక కుచంబు గాన కహివల్లభహారము గాంచి వే మృణా
ళాంకుర శంక నంటెడు గజాస్యుని గొల్తు నభీష్టసిద్ధికిన్ (మను)

ఇటులనే మనుచరిత్రకారుడు స్వారోచివేటను వర్ణించుతఱి పినవీరన చేసిన వేటవర్ణనము ననుకరించెను మఱియు

మ పలుకుందొయ్యలితోడికూటములు పెంపం దమ్మికూటంబులం
నలుమోముల్ సమకాలసౌఖ్యముల జెందన్ రామి నొయ్యారపుం
బొలయల్కన్ ముఖమండలిన్ మలచు నంభోజాసనుం డిచ్చు భూ
తలనాథాగ్రణి నారసింహునకు నిత్యంబైన దీర్ఘాయువుల్ (జై)

ఈ పద్యమును బీజముగ స్వీకరించి పింగళి సూరనామాత్యుడు తన కళాపూర్ణోదయమహాకావ్యమునకు మూలమైన సరస్వతీకమలభవుల ప్రణయకలహము నద్వితీయముగ చిత్రించియుండునని భావించవచ్చును ఇటులనే

ఉ అల్లన విచ్చు చెంగలువలందు రజంబును గప్పురంబు పై
జలగ జల్లనై వలచు సౌరభముల్ వెదజల్లు భావముల్
పల్లవహస్తచన్నగవపయ్యెద జీబుగ దోచు భాతిగా
బిల్లలమఱ్ఱి వీరన యభిజ్ఞుడు చెప్పగ నేర్చు గబ్బముల్

ఈ పద్యమును మనసునం దిడుకొని దానికి వన్నెచిన్నెలు వెట్టి, మెఱుగులు దిద్దుచు నీవిధముగ తన కళాపూర్ణోదయమున సూరన నుడివినాడు "లయవిభాతి —

చెలువుగల వెన్నెలల చెలువునకు సౌరభము
గలిగినను సౌరభము జలువయును దలిర్పం
బోలు పెసగు కప్పురపు పలుకులకు గోమలత
నెలకొనిన సౌరభము జలువపసయుం గో
మలతయును గల్గి జగముల మిగుల బెంపెసగు మలయపరంబు
గౌదమలకు మధురత్వం
బలవడిన నీడు మఱి కల దనగవచ్చు గడు వెలయగల
యీసుకవిపలుకులకు నెంచగా

వసుచరిత్రకారుడు దీనియందలి యొక శృంగారరసమయ ఘట్టమును మనసునం దిడుకొనియే కొలదిమార్పులతో దన ప్రతిభ మెఱయ స్త్రీవర్ణనలు కల్పనల శ్లేషాద్యలంకారముల గడు నింపుగా జేసినాడు దుష్యంతుడు శకుంతలను జూచివచ్చి నర్మసచివునితో శకుంతలయందమును వర్ణించునపుడు, అంగాంగ వర్ణనలను అతిగ జేసెను ఇటులనే నాయికావర్ణన నర్మసచివునిచే నాయకునిముందు వసుచరిత్రకారుడును జేయించినాడు

అష్టాదశవర్ణనల జేయుచో కవులందఱు స్వల్పభేదముల నొకేతీరున నున్నటులున్నను ఒక్కొక్క కవి యొక్కొకవిధముగ జమత్కరించుటయు, వినూతనత్వము ఘటించుటయు సహజము అది యాయా కవుల ప్రతిభ భావుకత్వముల బట్టి యుండును ఇట్టి వర్ణనల కన్నిటికి కాకపోయినను పెక్కింటికి బీజములు పినవీరనగ్రంథముల గలవు అలతియలతి మాటలతో యమకము, శ్లేష అత్యుత్తమముగ సాగించిన చేమకూర వెంకటకవిరచనకు పినవీరనరచన లాచార్యకములు వీనిని జూడుడు

'డాసి వయస్యు లెల్ల బొగడ న్బొగడ ప్రమానపుల్ "

కం॥ ‘దలదర్శుణ కిసలయ
విలసత్ఫలభరిత విపినవీధిని చర
త్కలకంఠకాకికాశుక
కలకంఠధ్వనులు చెవులకుఁ జవులొసగన్

‘ఇంతి నీ కింక నీ కింక యెందుమాను
జెప్పు నాతోడ నాతోడ దప్పుగాదు
‘నరకత్రాసకరుండై త్రాసకరుండగుట జక్రధరుడును బోలెన్’’

పినవీరభద్రునకు శ్లేషాలంకారమునం దెక్కుడు ప్రీతి యేమో యనిపించును మఱియు సంస్కృతసమాసముల శ్రీనాథుని రచనల మనసునం దిడుకొని చేసియుండు నంటిమి. ఈ సమాసముల జూడుడు

అహిప భూషణాంఘ్రి పంకేరుహ భ్రమరాయమాన మానసుండు’’
‘సకల దేశావనీపాల మకుట నూత్న రత్నరాజి రాజితాంఘ్రి నీరజయు’’
‘దానధారాప్రవాహజలపరిక్షాళితాఖిలకలుషనికరు’’
‘అరుదెంచెన్ వినతాతనూజుడు సముద్యత్ప్రావృడారంభ ని
ర్ఝర జీమూత ఘటాంతరాళవిచలద్రాఘిష్ఠ విద్యుల్లతా
పరిపంథిప్రతిమాన దీధితినటత్పక్షానిలాఘాత జ
ర్జరితోడ్డీన కులక్ష్మాధరదృషజ్ఝంపాకశాసంపదన్’’

ఇట్టి దీర్ఘసమాసము లన్నియో గలవు

౨

ఈ మహాకవి రచించిన రెండవ మహాకావ్యము జైమినీ భారతము విజయనగర ప్రభువగు సాళువ నరసింహరాయల కంకిత మీయబడినది ఆ ప్రభువు పదునైదవ శతాబ్ది చివరిభాగమున (1487-91) రాజ్యము జేసెను విద్వత్ప్రభువు కవిజనాశ్రితుడు, సారస్వత పోషకుడు నగు నా ప్రభువు—

‘రాజమాత్రుండె ధరణివరాహబిరుద
వర్ణఫలకాయమానదుర్వారి గర్వి

కాహితోర్వీశ విపులదోరంతనుండు
సార్వగుణుఁడయ నరసింగజనవిభుండు."

అని కృతికర్తచే గీర్తింపబడినవాడు. కృతిభర్తమాటల
గనుడు —

ఉ॥ అడట సప్తసంతతులయందును శౌర్యాకలోకము కాలమందు వి
చ్ఛేదము గల్గు నాటికికి జెప్ప విపర్యయ మేయుగంబునన్
లేదు కవిత్వసంతతికి నిక్కము తత్కవికావిలాసమున్
జాదులు నిష్టదైవత ప్రసాదము నా హరికీర్తనంబునన్,

గీ॥ ఆ పురాణంబు గన దెనుగయ్యె నేని
జెప్ప నేర్చిన కవి ప్రసిద్ధుఁడేని
దెనుగు నుడికారమును మించు గనియె నేని
గుందనము కమ్మవలచిన చందమగును.

ఈ పద్యమువలన కృతిభర్త యాంధ్ర భాషాభిమానము దెలియుచున్నది. కవిత్రయాంధ్రీకృత భారతమందు క్లుప్తముగ నున్న యశ్వమేధగాథను జైమినీభారతము ననుసరించివిపులగ్రంథముగ పినవీరన తెనుగున రచించినాడు. సంస్కృత గ్రంథమున కనువాదమైనను, ఈతని కవిత కుంటువడక గంగాప్రవాహమువలె సాగిపోవుచుండును. ఈ విషయమునగూడ శ్రీనాథుని రచనావిధానమును పినవీరన మనసునం దిడుకొనియుండనోపు. మహాభారతగాథక, దీనికి భేదము లనేకములు కలవు. ఇందు ముఖ్యముగ నర్జునుని దిగ్విజయయాత్రలే యభివర్ణితములు. ఇం దద్భుతవృత్తాంతము లెన్నియో కలవు. దీనిలో శ్రీకృష్ణుని మహిమ విశేషముగ నభివర్ణితము. దీనియందు సంస్కృతపదముల పోకడలు, దీర్ఘసమాసములు తఱచుగా గాన్పించునుగాని నన్నయ సంస్కృతమువలె మృదుమధురమై గంభీరమగు భావములతో నింపుగా నుండును. పినవీరన శ్రీనాథుని సంస్కృతపద దీర్ఘసమాసముల నెంత మక్కువతో ననుకరించెనో. అంతటి భక్తి

తోడనే యలతియలతి పలుకులచే మధురభావముల గల్గించుటలో సోమయాజి ననుసరించె ననవలయును అందుచే భారతకవుల రచనల, అందును తిక్కయజ్వరచనల మేలుబంతిగా నిడుకొని కృతకృత్యుడాయెను యుద్ధఘట్టముల వర్ణించు పట్టుల భారత యుద్ధపంచకమందలి పద్యరచనయే యనిపించును శ్రీరామ చరితము వ్రాయుటలో, నందును సీతాపరిత్యాగఘట్టమున తిక్కన నిర్వచనోత్తర రామాయణమును మనసునం దిడుకొని యనుక రించె ననుట విస్పష్టముగ గన్పడును కాని ధర్మప్రతిపాదనమున, భావానుకూల పదప్రయోగ కుశలతయందును సోమయాజికి గల అప్రతిమానప్రతిభ యీ కవి కంతగా నలవడలేదు శ్రీనాథుని రచనారీతు లీతని నాకర్షించినటులనే మృష్టాన్నభోజనాదివర్ణనలు కూడ నీతని నాకర్షించెనేమో. ఈ పద్యము జూడుడు.

మ కలమాన్నంబును నొప్పు పప్పుఘృతముల్ గజ్జంబులుం బిండివం
టలు బాసెంబులు నానవాలు ఫలముల్ నానావిధ వ్యంజనా
వలులున్ రాజతపాత్రలన్ మునిసతుల్ వడ్డింప వాల్మీకి బం
తులు సాగింపగ నారగించిరి మునీంద్రుల్ మద్రసోపేతముల్.

ఇట్టి ధారతో నొప్పి యుత్తమకావ్యమనబరగు జైమినీ భారతమున లోటులనదగినవియు గలవు వ్యాసుడు ధర్మరాజునకు జారస్త్రీలక్షణముల వర్ణించి చెప్పుట యెంతమాత్రము సమంజస ముగ లేదుసరిగదా అసందర్భముగగూడ నున్నది అది కథా కథనమున కేవిధమునను దోడ్పడదు శ్రీనాథుడు కాశీఖండ కావ్యమున పతివ్రతాస్త్రీలక్షణముల నభివర్ణించెను అదిచూచి కాబోలు పినవీరన జారస్త్రీవర్ణన జేయుట అచ్చటచ్చట వ్యాకరణ విరుద్ధప్రయోగములు, అప్రసిద్ధశబ్దములు అపసవ్య క్రియాలంకారములు నున్నను మొత్తముమీద జైమినీభారతము ధారాశుద్ధిచే, కథాకథనముచే వర్ణనవైచిత్రిచే నుత్తమకావ్య మని గణుతికెక్కినది.

పినవీరనరచనలయందు లోకోక్తులు సామెతలు విరివిగ గలవు 'అనటిపం డోల్వనేటికి నినుపగోర'' ''రేగుబండ్లకు ముత్యముల్ బోయుకరణి'' దుష్పూరుషుచే నిందబొందు శ్రుతియుంబోలెన్'' చింతామణిన్ విడిచి గవ్వ జేకొనుభంగి'' 'స్త్రీబుద్ధిః ప్రళయాంతక' అనునవియేగాక శశవిషాణము, గగనపుష్పము నాలుకవెచ్చన మొదలగునవి వాడి తనరచనల రసవత్తరము జేసెను శ్రీనాథుని జాడల, నవ్యదేశ్యంబులను వాడినాడు అందుచే ఆచార్య పింగళి లక్ష్మీకాంతం పంతులుగారొకయెడ నుడివిన యీ మాటలెంతయు పినవీరన రచనాసారమును దెలియపఱచుచున్నవి ఆంధ్రవాఙ్మయమున శ్రీనాథుడు సృష్టించిన ప్రబంధశైలిభిక్షను తానొకచేత నుంచుకొని వేఱొకచేత ప్రబంధకవుల కిచ్చిన సచ్ఛిష్యుడును శ్రీనాథుడు నాందీశ్లోకమును పఠించిన ప్రబంధమహానాటకమునకు శృంగార శాకుంతలరూపమున ప్రస్తావనజరిపిన సూత్రధారుడును అయిన వీరభద్రుడు''

ఈ సందర్భమున-అనగా ప్రబంధరచనారీతుల పరిణామమునువిచారించునప్పుడు జంటకవులగు నందిమల్లన ఘంటసింగనలు స్మరింపదగినవారు వారు సంస్కృతమున కృష్ణమిశ్రునిచే రూపకముగ రచింపబడిన ప్రబోధచంద్రోదయ మను వేదాంతగ్రంథమును ప్రబంధముగా తెనుగున రచించిరి ప్రబోధచంద్రోదయము విచిత్రమైన నాటకము అది భారతగాథను స్ఫురింపజేయునటుల రచింపబడిన వేదాంతగ్రంథము ఆంగ్లవాఙ్మయమున A legory అనుదానిని బోలియుండును పినవీరన సంస్కృత రూపకమును ప్రబంధముగ రచించుట ఆకాలపువారికి ప్రబంధములందలి పక్షపాతమే కారణ మనవలయును సంవాదాత్మకమగు నాటకముగా దెలిగించుట సులభమే యయినను కథనాత్మకమగు ప్రబంధముగ రచించుట దుష్కరమే యయినను జయప్రదముగ జేసి కృతార్థులైరి వీరును శ్రీనాథుని జాడనే గమించి

తెలుగుసేత జేసిరి వేదాంతగ్రంథమును ఇంత సరస సరళిని రచించు టెంతయు కష్టసాధ్యము ఆముక్తమాల్యద, పాండురంగమాహాత్మ్యము మొదలగు గ్రంథముల రచనకు కొంతవఱకైన వీరి రచన మూలకారణ మనవలయును ఈ జంటకవులు రచించిన వరాహపురాణమునందలి ప్రబంధప్రాయములైన ఇతిహాసములే రాయలుకాలమునాటికి ప్రబంధపూర్ణ స్వరూపమునకు బాటలు వేసిన వనవచ్చును వరాహపురాణము వీరి సూక్తి భాండారము. దీనియందును నృసింహపురాణమునందువలె దశావతారవర్ణన గలదు. అది తరువాతి కవులకు మార్గదర్శకమాయెను వీరి కవితాశక్తి కుదాహరణములుగ రెండు పద్యములు మాత్రమే యుదాహరింతును

ఉ. కమ్మని తేనియల్ తెఱచుకాలువలై ప్రవహింప మీద ఝం
ఝుమ్మని మ్రోయు తుమ్మెదల జొంపము మళ్ళను నీళ్లుకట్టుచో
బమ్మిన వేడ్క బాడు వనపాలక బాలకదంబకంబు చం
దమ్మున నొప్పు నప్పురపు నాలుగువంకల బువ్వుతోటలన్.

ఉ. తరుణి యనంగ మారుని ప్రధానశరంబది భగ్నమైన ద
త్పరికరముల్ సుధాంశుఁడు కదంబవసాగత కోమలానిలాం
కురములు చంద్రికానిశలు కోకిలకీరమధువ్రతంబులున్
బరువపు బువ్వుతోటలు నపార్థములైనవి గావె చూడగన్.

పెద్దన ప్రబంధరచనకారణముగ నాంధ్రకవితాపితామహు డయినా డను మాట యెటులున్నను, పినవీరభద్రుడు మాత్రము ఆంధ్రప్రబంధప్రపితామహు డనుట కెట్టి యభ్యంతరము నుండ నేరదు



# 4

# స్వారోచిష మనుసంభవము

[అల్లసాని పెద్దన్న]

శ్రీ విద్యారణ్య మాధవాచార్య యతీంద్రులవారి యా శ్వాదా దేశములనందిన సంగవంశీయులగు హరిహర బుక్కరాయ సోదరులచే, ఆంధ్రకర్ణాటకుల సమైక్య కృషి ఫలితముగ స్థాపితమైన విజయనగర రాజ్యము కొంతకాలము సంగవంశీయుల పాలనమునను, కొంతకాలము సాళువవంశీయుల పాలనమునను ప్రవర్థమానమై, రాజకీయముగ, సాంఘికముగ దినదినాభివృద్ధిగాంచుచు సాహిత్యపోషణమున, పరిపాలనాదక్షతను ప్రఖ్యాతిగాంచి తుళువ వంశపారావార సుధాకరు డనబరగు శ్రీ కృష్ణదేవరాయల పాలనమున మహోన్నతస్థితి నందినది. వంశానుగతమగు ధైర్య స్థైర్యాది సద్గుణములతోపాటు విజయనగరాధీశ్వరుల కానువాయితీగా వచ్చుచున్న సారస్వతాభిమానము, పండిత కవి గాయకాదుల పోషణ మొదలగు సద్గుణము లా మహారాజు పాలనమును దక్షిణహిందూ దేశ చరిత్రమున స్వర్ణయుగముగ జేసినవి. రాజ్యాభివృద్ధితోపాటు, నాచనసోమన, ఎఱ్ఱాప్రెగడలచే సంకురార్పణ జేయబడి, శ్రీనాథునిచే బ్రోదిచేయబడి, పినవీరభద్రాదులచే

రూపొందింపబడిన ప్రబంధప్రక్రియ రాయలకాలమున పరకోటి నందినది రాయల యుగమని సారస్వతేయులు పిలుచు కాలమున ఆముక్తమాల్యద స్వారోచిషమనుసంభవము, పారిజాతాపహరణము పాండురంగమాహాత్మ్యము వసుచరిత్ర, కళాపూర్ణోదయము మొదలైన రసవత్తరగ్రంథముల రచన సాగినది. స్థూలముగ నివి యన్నియు ప్రబంధము లనబఱగినవి వీని కన్నిటికి తలమానిక మనియు ప్రబంధరాజ మనియు స్వారోచిష మనుసంభవమునకు గీర్తియు తద్గ్రంథరచనకారణముననే పెద్దనకు 'ఆంధ్రకవితాపితామహు' డను బిరుదును వచ్చినదని పండితపరంపరాగతమగు ప్రచారము గలదు ఇది యెంతవఱకు సమంజసము? మనుసంభవకావ్యము ప్రబంధరాజమా? దానిని రచించుటచేతనే పెద్దన 'ఆంధ్రకవితాపితామహు' డయినాడా? అనునవి విచారణీయములు

గ్రంథవిమర్శనకు గొన్ని నియమములు గలవు ముందుగా నా గ్రంథమును సమగ్రముగ జదువవలయును కవికాలాదుల మనసునం దిడుకొని యాకాలపు సారస్వతపోషకుల పాఠకుల, ప్రజల అభిరుచుల కనుకూలముగ కవిభావములను సమన్వయించవలెను అనగా దేశకాలపాత్రముల గుర్తెఱిగి కవిహృదయము నర్థముచేసికొనవలయు ననుట ఆ గ్రంథమునుగూర్చి యంతవఱకెవరయినను ఏవిధముగనైనను వ్రాసియుండిన అట్టి విమర్శలనుగూడ చదువుటయు నుచితమే పూర్వవిమర్శనముల తనకు దోచిన భావములతో తులదూచి సమన్వయించుకొనగలిగిన స్వీకరింపవచ్చును లేదని తోచినచో సహేతుకముగ విమర్శింపవచ్చును ఆ వ్రాతలు ప్రఖ్యాతులు వ్రాసినవి కదా యని స్వీకరింపనక్కఱలేదు తన పరిజ్ఞానమును పరీక్షించుకొనుటకు మాత్రము స్వీకరింపవచ్చును విమర్శకు లనుసరించు మార్గము లన్నియు నొకేమార్గమున నుండవు కొందఱు కావ్యపు సమగ్ర రూపమును మనసునం దిడుకొని ~~యాకాలమును~~ రసవత్తరము



అగునా? అటులగుటకు కవి యేమేమి చమత్కారములు జేసెను? ఏయే యలంకారముల నెటుల నుపయోగించెను? ఏకల్పన నెందుకు జేసెను? మొదలగు విషయముల పరామర్శించి అవి యన్నియు నారసవత్తర కావ్యనిర్మాణమున కెటుల కారణభూతమయినదియు వివరింతురు ఏవిధమైన స్వల్పదోషము లున్నను అవి కవికి తెలియకయే యందందు దొరలియుండునని భావింతురు వీలయినంత వఱకు లోపములుగ గన్పడువానిని సమన్వయించి సమర్థింప యత్నింతురు ఇంకొక తెగవారికి సమగ్రదృష్టి యుండదు కావ్యసంపూర్ణరూపమును జూడరు ఏ పద్యమునో, ఏపదమునో పట్టుకొని దానిని శాబ్దికముగ ముక్కలు ముక్కలుగ జేసి వ్యాకరణరీతిని తార్కికదృష్టిని తమ అలవాటులకు గోరికలకు నను రూపముగ నన్వయింప యత్నింతురు తమ పాండిత్యమును తార్కికశక్తిని వెలువరించి పరితలను తికమకపెట్టు విపరీతార్థములు గల్పించు విమర్శన సద్విమర్శనము కాదు ఒక పద్యము బాగుగ నున్నంతమాత్రమున ఒకమాట సందర్భమునకు చక్కగ నతికియుండినంతమాత్రమున ఆ గ్రంథము మహాగ్రంథమనియు ఆ గ్రంథకర్త మహాకవి యనియు చెప్పుటయు, ఏదో యొక లోప మున్నంతమాత్రమున ఒక గ్రంథము క్షుద్రకావ్యమనుటయు తద్రచయిత కవినామార్హుడు కాదని చెప్పుటయు రెండును కూడని పద్ధతులే

ఈ కాలమున పండితవిమర్శకుల మనుకొనువారు కొందఱీ మార్గమున గమించుట చూచుచునేయున్నాము విమర్శన యనగా తప్పుల నెన్నుటయే యని కొందఱు భావించుచున్నటుల దోచుచున్నది మంచిచెడ్డల రెంటిని విశదీకరించుచు దోషములని స్థూలముగ దోచిన విషయములగూడ దేశకాలపాత్రములబట్టి అన్వయించుకొని వానియందు మంచి యేమాత్ర మున్నను గ్రహించి విశదీకరింపవలయును తప్పనుట సులభము ఎటులనో విశదీకరించుట కష్టము సహేతుకముగ సమర్థించుట యుత్త

వము సాహిత్య ప్రపంచమున మన సాంప్రదాయముల కవిసమయముల విస్మరించి పాశ్చాత్య సాహిత్య విమర్శనాలోచనముతో, వారిసాంప్రదాయానుసారము మన సాహిత్య గ్రంథములను విమర్శింపబూనుట తగని పని. పూర్వకాలపు అలవాటులు ఆచారములు వాడుకలోనున్న మాటలు ఈ కాలపువారికి తెలియక పోవచ్చును ఈ కాలపు ఆచారములు అలవాటులను కాలతబద్ధతో పూర్వపువానికి విలువగట్టుట వివేకముతో గూడిన పద్ధతి గాదు మనకు తెలియక పోయినను అవి దోషములు కాక పోవచ్చును పూర్వ విషయములు కొన్ని యీ కాలమున ననుసరణీయములు కాకపోవచ్చును అట్టివానిని నేటి కవులు అనుసరింపనక్కర లేకపోవచ్చును ఈనాడవి యుచితములుగా నెంచబడనంత మాత్రమున వానిని దోషము లనరాదు నేటి మానవుల మనస్తత్వముల ననుసరించి పూర్వగ్రంథములందలి పాత్రల స్వభావాదుల నూహించుట తగని పని ఇట్టి రొందుదుదుకులు లేకుండ క్రమమైనమార్గమున జేయబడినది యే సువిమర్శనము)

ఆంధ్ర సారస్వతమున ప్రబంధప్రక్రియ యొక్క ప్రత్యేకస్థాన మాక్రమించిన దనియు పబంధమునకు నిర్ణీత లక్షణములు గలవనియు నుడివితిమి మహాకవియగువాడీ లక్షణముల నెల్ల గుదిగూర్చి తన భావుకత్వ విశేషమున సువర్ణాక్షరముల పోహళింపుచే సుమనోహర రూపకల్పన జేసి రసవత్తర కావ్యము రచించును ఇతివృత్తము నిమిత్తమాత్రము దానిని స్వీకరించి నవనవోన్మేషణశాలియగు తన ప్రతిభచే కల్పనావైచిత్రి మెఱయు అలంకారశోభితమైన వర్ణనలలో మాధుర్యాదిగుణములు గల రసవత్తర కావ్యముగ రూపొందించినవాడే మహాకవి అటుల రూపొందినమహాకావ్యములతో స్వారోచిషమనుసంభవమగ్రస్థాన మాక్రమించిన దను అభిప్రాయము జనశ్రుతిగ వచ్చుచున్నది

పెద్దన తన గ్రంథనామమును ముత్తెఱగుల వాకొనినాడు
‘ మనుచరిత్రం బందుకొను వేళ పురమేగ బల్లకి తన కేల బట్టి

యెత్తె'' 'కోరికనీస్వారోచిషచరిత్రను వినిన వ్రాసిన'', ''నాయొనర్పంబూనిన స్వారోచిషమనుసంభవంబను మహాప్రబంధమునకు'' అని చెప్పినాడు వీనియందు స్వారోచిషమనుసంభవం బనునామమే యుచితముగ నున్నది అట్టి యీగ్రంథమున ప్రబంధలక్షణము లెంతవఱకు సమన్వయ మగుచున్నవో విచారింతము

ఇతివృత్తము కేవలము కల్పితము కాదు పూర్వగ్రంథములనుండి యనువాదమును గాదు అది మార్కండేయ పురాణమునుండి స్వీకరింప బడినది పెద్దన సంస్కృతమునందలి మార్కండేయపురాణమును మారన ఆంధ్రీకృత మార్కండేయ పురాణమును జూచియే యీకథను స్వీకరించియుండును మూల గ్రంథమున మారనచే 150 పద్యములలో క్లుప్తముగ జెప్పబడిన స్వారోచిషమనుసంభవగాథను విస్తృతపఱచి తన ధీ విశేషముచే వర్ణనావైచిత్రి మెఱయ ఆఱాశ్వాసముల బృహద్గ్రంథముగ రచించెను కథాభాగమును పెంచినదియు నెక్కుడుగ లేదు ఒకటిరెండు చిఱుమార్పులు చేసెను మాతృకా భిన్నమయిన ప్రధాన వస్తుకల్పన స్వారోచిమృగయావిహార వర్ణన, ఈ ఘట్టము అంగరసములగు వీరభయానక భీభత్సాదిరసముల కాటపట్టయినది. ఇంకొక మార్పు చూడుడు మార్కండేయపురాణమున హంస సంవాదము విన్నపిదప స్వారోచి విరక్తుడై యడవికి బోయెనని యున్నది అటుల విరాగియైనవానికి మఱల వనదేవతా సంగమరూపమగు శృంగారరసావృత్తి గూర్చుట యసంగతమని పెద్దన స్వారోచిని వేటకు పంపినాడు చక్రవాకి పలుకులు మొదలగునవి వాని శృంగారరసావృత్తికి మార్పు గలిగించలేకపోయినవి ఇందీవరాక్షుడు మనోరమను స్వారోచికిచ్చెద నన్నప్పుడే యా లలన తన చెలుల మాట స్వారోచికి చెప్పినటుల మూలమున నున్నది. ఇందీవరాక్షుడు మనోరమ నిచ్చెదనని చెప్పినపు డాపె స్వారోచి యెడల లజ్జబొందియుండును ఆ లజ్జాభరమున తండ్రియెదుట తన చెలుల మాట యెత్తుట అసహజమని భావించి పెద్దన యా

దంపతుల తొలికూటమి రేయి యాప్రస్తావన వచ్చినట్లుగా కథ మార్చినాడు ఇట్టి చిఱుమార్పులు చేయుటలో నౌచిత్యమున్నది ఆఱాశ్వాసముల గ్రంథ మగుటకు పెద్దన కథాకథనమును విస్తృత మొనర్చుటకు ప్రాధాన్య మీయలేదు వర్ణన వైచిత్రి మెఱయ తన కల్పనాశిల్పము నంతయు తనప్రతిభచే భావకవిత్వముచే సాధించి హృదయంగమముగ ప్రసన్నతాగుణభూయిష్ఠమైన కావ్యమును శిరీషకుసుమ పేశలసుధామయోక్తులచే రచించెను. ఆ ప్రయత్నఫలమే స్వారోచిషమనుసంభవకావ్యము

స్వారోచిషమనుసంభవము ఏకనాయకాశ్రయమా ? అను నది విమర్శనీయవిషయము అనగా ఇందలి యితివృత్తమునకు నాయకు డెవరు ? అని నిర్ణయించవలయు ననుట ఈ గ్రంథ మున మూడుగాథలు వేఱువేఱుగ గన్పడుచున్నవి మొదటి రెండును స్వయంసంపూర్ణములయిన వేఱువేఱు రసవత్తర కావ్యములన నొప్పియున్నవి మూడవది యగు స్వారోచిష మనువుచరిత్ర ఆఱవ ఆశ్వాసపు చివరిభాగమున నిరువది పద్యము లలో నిమిడియున్నది మొదటిదగు వరూథినీప్రవరాఖ్యుల రస వత్తరగాథ రెండాశ్వాసములతోనే ముగియును మూడవ ఆశ్వా సమున ప్రవరునిచే తిరస్కృతయైన వరూథినిదురవస్థ యతికరుణ ముగ చిత్రింపబడినది మాయాగంధర్వుని మోసము స్వారోచి జననమునకు కారణభూత మయినది పలువురు కొందఱు ఈ మూడాశ్వాసములే చదువుదురు ఉత్తరార్థము చదువనివా రనేకు లుందురు నాల్గైదాశ్వాసముల ఆఱవ ఆశ్వాసమున చాలభాగమువఱకు స్వరోచిచరిత్రమే విపులపఱచబడినది చివరి యిరువదిపద్యములలో స్వారోచిషమనువుకథ యున్నది "నయతి ప్రాప్నోతి ఇతివృత్తం ఫలంచేతి నాయకః" అనగా కథను వ్యాపించి తత్ఫలము నందువాడు నాయకు డనిగదా యాలంకారి కుల మతము మొదటికథకు ప్రవరాఖ్యుడు, రెండవదానికి

స్వరోచి, మూడవదానికి స్వారోచిషవును కథానాయకునిలుగా జెప్పవలయును అందుచే నీకావ్యము ఏకనాయకాశ్రయము కాదు అటు లగునని సమర్థింప నెన్నియుక్తులు పన్ని ఎంతగా వాదించినను ప్రయోజన మీమాన్సాశక్తి ముండదు పెద్దన తన కావ్యమును స్వారోచిషమనుసంభవ మనినాడుగాన స్వారోచిషువే కథానాయకు డనెడివా రుండవచ్చును స్వారోచిషుని జన్మ కావ్యాంతమున నున్న స్వల్పవిషయము మనువుగా నాత డొనర్చిన కార్యములుగాని చేసిన పాలనగాని స్థాపించిన శాస్త్రధర్మములుగాని యీగ్రంథమున నిసుమంతయు నుడువబడలేదు 'అట్లుజనియించి స్వారోచిషాఖ్యు సతడు శాంతిదాంతిదయాసత్య శౌచనిరతుడై, యకామత జిరతాపం బాచరించె నచ్యుతుని గూర్చి'' అని యతిక్లుప్తముగ స్వారోచిషువుచరిత్ర చెప్పబడినది

ప్రత్యక్షమైన శ్రీమహావిష్ణువును స్వారోచిషువు స్తవము జేసిన పద్యములు లేకున్నచో స్వారోచిషమనువుచరిత్ర యంతయు నాలుగైదు పద్యములలో నిమిడియుండును మనుసంభవమున గ్రంథనామసార్థక్యము కలిగినది కాని యంతమాత్రమున స్వారోచిషమనువే కథానాయకు డనజనదు ప్రధానమైనమనువు చరిత్ర మప్రధానముగను అప్రధానములుగాగనపడు ఇతరగాథలు ప్రధానముగను, రసవత్తరములుగను రచింపబడినవి ఆ కథల పరమావధి అనగా ఫలశ్రుతి స్వారోచిషమనువు జననము కాన నత డేల యీ కావ్యమునకు నాయకుడు కాకూడ దని ప్రశ్నించువా రుండవచ్చును ఆ దృష్టితో జూచిన అభిజ్ఞాన శాకుంతల నాటకమునకు భరతుడు కథానాయకుడు కావలయును శకుంతలా దుష్యంత వివాహమునకు బూర్వమే కోరబడిన భరతుని యౌవరాజ్యపట్టాభిషేక మభిజ్ఞానశాకుంతలనాటమునకు ఫలశ్రుతి ఆ భరతుడే భరతవంశీయులకు మూలపురుషుడు కౌరవపాండవులు భరతవంశీయులు ఇతర విశిష్టమైన విశేషములకు గారణభూతుడైన భరతుడు కావ్యనాయకుడుగాక దుష్యంతునకే కావ్య

నాయకత్వము సిద్ధించినది కావ్యమందలి ప్రధానరసమునకు బాత్రభూతుడగువాడే నాయకు డని వేఱుగ జెప్పనక్కర లేదు అటులనే స్వారోచిషమనువు కావ్యనాయకుడు కాడనుటలో ఎట్టి విప్రతిపత్తియు నుండరాదు ఇంతకు నీ కావ్యము మనుసంభవమే కాని మనుచరిత్ర కాదని యెంచుటయే మేలు

ఇక వస్త్వైక్యవిషయము విచారింతము విమర్శకులు కొందఱు ఈ కావ్యమునందు వస్త్వైక్యము లోపించిన దందురు ఈ కావ్యమున కితివృత్త మేది యని విచారించిన గ్రంథనామమును బట్టి స్వారోచిష మనువుజన్మ యనికదా తేలినది మను సంభవము కావ్యఫలముగాని కావ్యమంతయు వ్యాపించిన ఇతివృత్తము కాదు అందుచే వస్త్వైక్యము సిద్ధించిన దనరాదు ఇందలి కథలన్నియు స్వయం సంపూర్ణములై వేఱువేఱుగ నుండుటయు వానిని గుదిగూర్చు సూత్ర మంత పటిష్ఠముగ లేకుండుటయు వస్త్వైక్యము లేదను వాదనకే బలముగూర్చుచున్నది స్వారోచి చరిత్రమని ఈకావ్యమును వాకొనదగును అప్పుడు మొదటి రెండాశ్వాసములు ఆ కథకు బూర్వరంగములుగ నుపకరించును వస్త్వైక్యము గలదనువారి వాదము చూతము ఇది స్వారోచిష మనువు పుట్టువునుజెప్పు కావ్యము మనువు గాదగినవాని గుణములు పితృపైతామహాదులనుండి సంక్రమించుట సహజముగాన వాని పూర్వులచరిత్ర విపులపఱచు టెంతయు నవసర మనియు, అందుచే స్వారోచిషు పూర్వుల చరిత్ర విపులపఱచబడిన దనియు ఆ కారణమున వస్త్వైక్యము సిద్ధించిన దనియు జెప్పుదురు దీని సమర్థింప నెన్నియో కారణముల జూప యత్నింతురు అసలు మనువు లెందుకు జన్మింతురు? మనువున కుండవలసిన లక్షణము లేవి? ప్రతివాడును మనువు కావచ్చునా అనునవి యాలోచింతము మానవుల లోకవర్తనము నిర్ణీత మార్గముల నుండుట కొక ధర్మ శాస్త్రము కావలయును అట్టి శాస్త్రముల వెలయించు వారు మనువులు మనుస్మృతి కున్నంత ప్రాధాన్యము వేదాదు

లకు లేదందురు అట్టి స్మృతుల వెలయించిన మనువులలో స్వారోచిషమను వొకడు మానవుడు మనువగుటకు కావలసిన యోగ్యతల నెటుల సంపాదింపవచ్చును? తపము జేసి సంపాదింపవచ్చును పితృపైతామహమైన గుణసంపుటివలన మనువు కావచ్చును పూర్వకర్మఫలపరిపాకమున కావచ్చును మానవుడు పూర్వజన్మమందు జేసినవి కర్మల కనువగు తల్లిదండ్రులకే జన్మించును కనుక నట్టి యుత్తముని జన్మ చెప్పుటకు ఆతని తల్లిదండ్రుల తాతముత్తవల చరిత్రకూడ నెఱుగవలయును కొన్ని యెడల నొక జీవుని పూర్వజన్మగాని ఆజన్మమున జేసిన కృత్యములుగాని దెలియనక్కఱ లేదు ఆతని తల్లిదండ్రుల యోగ్యతల విచారించిన నతని పూర్వజన్మ సుకృతదుష్కృతముల నూహింపవచ్చును మానవుడు తపము జేయదలచుటగాని, చేయుటగాని కొన్ని లక్షణము లతనియందు నిగూఢముగ బీజప్రాయముగనైన నుండియుండవలయును స్వారోచిషుడు తపము జేసి మనువయినవాడే అటులగుటకు వాని జీవునియందు కొన్ని ప్రత్యేక లక్షణము లుండవలయును అవి పూర్వకర్మపరిపాకమున గావచ్చును లేదా, తల్లిదండ్రులనుండి సంక్రమించియుండును ఇచట స్వారోచిషుని పూర్వజన్మ మేమియు మనకు దెలియదు అది చెప్పబడియుండ లేదు కావున రెండవది యగు పితృపైతామహగుణముల కారణమున స్వారోచిషునందు తపస్సుచేయుటకు, మనువగుటకు గల ప్రత్యేక గుణము లుండియుండవలయునని భావింపవలయును అందుచే వారి చరిత్ర ప్రధానమనియు అది చెప్పుట అవసర మగుటచే వస్త్వైక్యము చెడలేదనియు నందురు మనువగుటకు ఒకనికి శాంతిదాంతి దయాసత్యశౌచాది గుణము లుండవలయును అవి వాని తాతతండ్రుల జీవన సంపుటిగతమైన గుణములుగా నుండినగాని వానికి సంక్రమింపవు మనువునందు బ్రహ్మాత్వ ముండవలయును దానికి తోడు దైవాంశ ముండవలయును బ్రహ్మజ్ఞానము గలిగి శాసించుటకు ప్రభుత్వముకూడ దోడుగావలయును కనుక

స్వారోచిషమనువునందు బ్రహ్మత్వము, రాజరికమునకు గావలసిన గుణములు ఎటుల సంక్రమించినవో యాలోచింపవలయును.

స్వారోచిషమనువు తలిదండ్రులగూర్చి యాలోచింతము. తండ్రి స్వరోచి గంధర్వరాజు. తల్లి వనదేవత; పవిత్రురాలు. స్వరోచి వరూధినియందు మాయా ప్రవరాఖ్యుడగు గంధర్వుని వలన జన్మించినాడు. అనగా తలిదండ్రు లిరువురు గంధర్వులే. ఇరువురు నిగ్రహ మెరుగని కాముకులు. వీరియందు దైవాంశ ముండుననుట హాస్యాస్పదము. త్రిమూర్తుల తరువాత ఇంద్రాదులే దేవతలు. దేవగణములోని వారగు సిద్ధసాధ్య గంధర్వ విద్యాధర కిన్నర కింపురుషాదులు సంగీతాది కళాకుశలులు. వారిది భోగ భూమి. సౌందర్య ప్రియులును, ప్రణయజీవులు నయిన గంధర్వ లలో స్త్రీలోలత్వముగాని, మధుపాన జారత్వాదులుగాని దోస ములు కావు. కర్మభూమియందు బుట్టినవారికి నిషేధములని జెప్పబడిన పరస్త్రీగమనాదులు వారికి దోసములు గావు. పూత పసిండివంటి వలపుం బచరించు కులంబునందు జన్మించినది వరూధిని. వలదని నిరాకరించి వెళ్లిన ప్రవరునికొఱకు బాధపడుట యా కులపునీతికి లేత. అత్తెఱగు లేమను జూచి సాటి సుదాంగ నలు మెచ్చరు. ఇట్టివారిని ఈ లోకమునను జూచుచున్నాము. వారికి సంఘమునం దెంతటి గౌరవ ప్రపత్తి యున్నదియు గూడ నెఱుగుదుము. అట్టి వరూధినియందు గంధర్వునకు జనించినవాడు స్వరోచి. మొదలే దుశ్శీలుడు గంధర్వుడు. అందును వంచనచే వరూధినిని బడసినవాడు. ఇట్టి దంపతులకు గలిగిన సంతానమునం దుత్తమ లక్షణము లుండునా యనునది యొక ప్రశ్న. కాని యే పూర్వజన్మ కర్మఫలముననో శుభలగ్నమున జననమందిన వానికి మునులు స్వరోచి యని నామమిడిరి. జాతకర్మాదులజేసి శస్త్రాస్త్ర విద్యల గరపి యన్నిటియందును సమర్థుని జేయగా యౌవనవంతుడయి వేదాంతార్థము లెఱిగి యెల్ల తీర్పులు జేయ

నేర్పరియైనాడు అతడు తనకు విశ్వకర్మ చేసిన నగరి వితతాటవిక చమూసేవితుడై సామ్రాజ్య మనుభవించుచుండెను

ఇటుల స్వరోచి జన్మమున గంధర్వుడైనను సంస్కారము వలన క్షత్రియ మర్యాదల నెఱిగి పరిపాలనాదక్షుడగు గంధర్వ ప్రభువయినాడు మనోరమవలన నస్త్రహృదయమను విద్యను, ఇందీవరాక్షునివలన నాయుర్వేదమును, విభావసివలన మృగపక్షి జాతుల భాష లెల్ల నెఱుగు విద్యయు కళావతివలన పద్మినియను విద్యను బడసి సర్వకళాశోభితుడైనాడు గంధర్వులకు సహజము లగు భోగముల యథేచ్ఛమై భార్యలయం దనుభవించినాడు పుత్రులను గాంచినాడు చక్రవాకి పలుకులచే ఇట్టి అవహేళనచే ప్రబోధితు డయినాడు. కామమునందు విముఖత్వము ప్రబల సాగినది వనదేవత సమాగమకారణమగు ఓషధీ మహిమచే సర్వదోష పంకమునుండి క్షాళితుడయి పునీతుడయినాడు అట్టి స్వరోచివలన స్వతః పవిత్రయగు వనదేవత యందు జనన మందిన స్వారోచిషునకు మనువగుటకు గావలసిన రాజధర్మ ములు పైతృకముగ సంక్రమించినవి దేవతలు కోరినగదా వన దేవత స్వరోచిసమాగమ మపేక్షించినది అది దైవనిర్ణీతమగు కార్యము వనదేవతకు జన్మించుటచే స్వారోచిషువు జన్మ నిష్క ళంకమైనది ఇక మానవధర్మ శాస్త్రనిర్ణేత యగుటకు గావలసిన శమదమశౌచాదిగుణము లెటుల సంక్రమించిన వను ప్రశ్న మిగిలి నది అది పితామహదత్తము జాగ్రత్తగ బరిశీలనము జేయ వలసిన విషయము స్థూలరూపమున స్వారోచిషు పితామహుడు గంధర్వుడు అందును మాయావి వానివలన సద్గుణములు స్వారోచిషువునకు సంక్రమించెననుట యసంభవము మాయా ప్రవరుడుగ తన్ను మోసగించిన గంధర్వుని వరూథిని ప్రవరునిగా భావించినది ప్రవరుని రూపమే వరూథిని మనఃఫలకమున ప్రతి ఫలించినది అందు ప్రవరుడు స్థిరవాస మేర్పఱచుకొని యుండు టయు ఎల్లప్పుడూ వరూథిని ప్రవరధ్యానతత్పర యగుటయు

కారణములుగ ఆ పెసంతానమునందు ఆ ప్రవరుని శమదమాది సద్గుణము లుండుటకు హేతువయినది ఆ దివ్యగుణములు గంధర్వ కుమారుడగు స్వారోచియందు మరుగుబడియుండి సర్వదోషముల నుండి క్షాళితుడైన స్వారోచికి వన దేవతాపవిత్ర క్షేత్రమున ప్రభవించిన సంతానమునందు ప్రతిఫలించినవి స్వారోచియందు మరుగు బడిన ఉత్తమబ్రాహ్మణ ధర్మములు వాని సంతానమునందు రూపొందినవి అందుచే స్వారోచిషుడు జన్మించినతరువాత శాంతిదాంతిదయాసత్యశౌచనిరతుడై యకామత జిరతపం బాచ రింపగల్గెను ఇటుల పైతృకంబగు రాజలక్షణములు మాతృకమైన పవిత్రత పైతామహమైన బ్రహ్మజ్ఞానము గల స్వారోచిషుడు అచ్యుతుని గూర్చి తపము జేయుటకు జీవలక్షణముల పుట్టుకతోనే గలిగియున్నాడు అతడు అచ్యుతునిగూర్చి తపము జేసెను అంత ప్రత్యక్షమయ్యె లక్ష్మీశ్వరుండు ' ఇట పెద్దనగారు 'లక్ష్మీశ్వరు' డను పదము వాడుటలో నొక విశేషము స్ఫురించుచున్నది లక్ష్మీశ్వరుడగువాడే లక్ష్మినీయగలడు రాజ్యలక్ష్మి ధనలక్ష్మి, యశోలక్ష్మి ధాన్యలక్ష్మి భోగలక్ష్మి మోక్షలక్ష్మి మొదల గున వన్నియు లక్ష్మిరూపాంతరములు వీని ననుగ్రహింపగలవా డగుటచేతనే అచ్యుతునిగూర్చి స్వారోచిషుడు తపమాచరించెనని చెప్పబడినది ప్రత్యక్షమైన నారాయణుని స్తోత్రము జేయుట విధి స్తవము జేయుట అష్టాదశవర్ణనలలో నొకటి యనిగదా లాక్షణి కుల మతము అందుచే నిచట దశావతారముల వర్ణించుటలో నెంతయు నౌచిత్యము పాటింపబడినది కొందఱు భ్రమపడినటుల ఇట దశావతారముల వర్ణించుట విశిష్టాద్వైతమతప్రతిపాదనకు గాదు పెద్దన తన వైష్ణవమతాభిమానము నిచట వెలయించినా డనుట సమంజసము కాదు ఆ భావమే నిజమయిన, అటు చేయు టకు ఇంత దూర మెందులకు? కావ్యారంభపద్యమే విష్ణుపరముగ జెప్పబడినది అదికూడ వైష్ణవమతాభిమానముననే రచించె నందురా కాని కవు లనేకులు తమ కావ్యముల విష్ణుస్తుతితోనే

ప్రారంభించుచు వచ్చిరి శివభక్తాగ్రేసరుఁడగు శ్రీనాథుడు తన కావ్యారంభమున విష్ణుస్తుతియే చేసెను అది సంప్రదాయము సృష్టిస్థితిలయ కారకులుగదా బ్రహ్మవిష్ణుమహేశ్వరులు స్థితికారకుఁడగు విష్ణువును కృతిభర్తకు సకలసౌఖ్యముల ప్రసాదింప ప్రార్థించుటతి సహజము

శా॥ శ్రీ వక్షోజ కురంగనాభ మెదపై చెన్నొంద విశ్వంభరా
దేవిం దక్కుములా సమీపమున బ్రీతిన్ నిల్పినాఁడో యనం
గా వందారుసనందనాది నిజభక్తశ్రేణికిం దోఁచు రా
జీవాక్షుండు కృతార్థు జేయు శుభదృష్టిం గృష్ణరాయాధిపున్

ఈ పద్యమందు లక్ష్మీపతిత్వము నేగాక భూపతిత్వమును గూడ స్ఫురింప జేయుటవలన నా విష్ణుః పృథివీపతిః' అను వచనము వలనను భూపతియయిన కృతిపతి విష్ణ్వంశసంభూతుఁడగుట వ్యంజితమగుచున్నది తనకు సమృద్ధిగా నున్నగదా యితరుల కిచ్చుట అందుచే కావ్యారంభమున విష్ణువును స్తుతించుటెంతయు సమంజసము ఈ పద్యమునే స్వారోచిషుని పరముగ నన్వయించవచ్చును కృష్ణదేవరాయలకు గోరబడిన శుభములు స్వారోచిషునకు గూడ కోరినటు లగును సకల భువనరక్షాదక్షుఁడు కావలయునుకదా మనువు అట్టి శక్తి నీయగలవాఁడే విష్ణువు స్వారోచిషుని తపమునకు మెచ్చి ప్రత్యక్షమై స్తుతులకు మోదమంది పాంచజన్యధరుఁడు నేలు మిల ద్వితీయమనువవై నయధర్మాలోలబుద్ధి దిరముగ వేలుపులకు దపసులకును విధికి బ్రియముగాన్' అని నియమితు జేసెను

ఇటుల అన్వయము జేసికొనిన కావ్యమున వస్త్వైక్యము లేకపోయినను విస్తృతమైన కథావస్తువు కలదని చెప్పవచ్చును,

ప్రబంధములు శృంగారరసప్రధానములుగ నుండవలయునను లాక్షణికుల నిర్ణయము మనసునందిడుకొని స్వారోచిషమనుసంభవ ప్రబంధమందలి ప్రధానరస మేదియో నిర్దేశింపవలయును

మనుచరిత్రము శృంగారరస ప్రధానకావ్య మని కొందఱు, శాంతరసప్రధాన కావ్యమని కొందఱు చెప్పుదురు అందుచే నీ గ్రంథమున నీ రెండు రసములు ప్రధానముగా పోషింపబడిన వనుటలో విప్రతిపత్తి లేదు సుకుమార రసములగు వీనిని వెలయించుటకు కావలసిన మాధుర్యగుణము కావ్యమునం దెల్లెడ వెల్లివిరియుచున్నది ఇట నొకమాట ప్రబంధము వర్ణన ప్రధానమైనదే కాని రసప్రధానమైనది కాదని కొంద ఱందురు ప్రబంధములు పురాణాంతర్గతమైన ఏ యుపాఖ్యానమో ఇతివృత్త ముగ గైకొని దానిని నానావిధవర్ణనాలంకారములతో సింగారించి పాత్రచిత్రణయందు రసపోషణయందు దృష్టి నిలిపి ప్రౌఢమైన అలంకారిక శైలి ప్రధానముగా రచింపబడిన స్వతంత్ర కావ్యము అను ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారి నిర్వచనము అంగీకరింప దగినది రసాత్మకం కావ్యం' అనికదా ఆలంకారికుల మతము దీనిని ద్రోసిరాజనిన కావ్యము ఎండుకట్టెగను జీవములేని శరీర ముగను తయారగును అందుచే ప్రబంధము రసప్రధానము కాదనరాదు రసవిహీనరచన కావ్య నామార్హము కాదు మను చరిత్రయందు శాంతశృంగారరసములలో నంగిరసము నిర్ణయించుట నచ్చలేకనో లేక పరస్పర విరోధరసము లనబరగు శాంతశృంగార రస సమ్మేళనయెడ విముఖత్వముననో ప్రబంధములు రసప్రధాన ములు కావని వారు భావించియుందురు రసపోషములు గాని వర్ణనలు నిరర్థకము లని వేఱుగ జెప్పనక్కఱలేదు.

మనుచరిత్ర స్థూలదృష్టికి శృంగారరస ప్రధానకావ్యము గనే తోచును ఇది నాలుగు కథల సంపుటి మాయా ప్రవరుని కథ వరూథినీ ప్రవరులగాథలో కలిపిన మూడు కథల సంపుటి యనవచ్చును మొదటిది వరూథినీప్రవరుల చరిత్ర దీనియందు శాంతశృంగారరసముల సంఘర్షణ రెండవదియగు స్వారోచి చరిత్రయందు శృంగారరసము ప్రధానము మిగిలిన రసములు గౌణములుగ పోషింపబడినవి స్వారోచిషు చరిత్ర శాంతరస

ప్రధానము అందుచే మనుచరిత్రము సరస ప్రధానమైన కావ్య మనునది నిర్ణయించుటలో చిక్కు గలదు ఆ చిక్కు జాగ్రత్తగ విడదీయవలయును ప్రథమ ఘట్టము నారంభించుచు

ఉ. ఆ పురి బాయకుండు మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి భా
షాపరశేషభోగి వివిధాధ్వర నిర్మల ధర్మకర్మ దీ
క్షాపరతంత్రు డంబురుహగర్భకులాభరణం బనారతా
ధ్యాపన తత్పరుండు ప్రవరాఖ్యు డలేఖ్యతనూవిలాసుడై

అని కవి వ్రాయుటలోనే శాంతశృంగార రసముల సంకరము సూచింపబడినది కర్మిష్ఠి యజ్ఞయాగాదు లొనర్చి సోమయాజి యైన బ్రాహ్మణకులశ్రేష్ఠుని మకరాంక శశాంక మూర్తిగా నలేఖ్య తనూ విలాసునిగ జిత్రించుటలో విశేష మున్నది శృంగార రసాత్మకమైన గాథకు కథానాయకు డగు ప్రవరుడు అపరశేషుఁ డనియు అనగా కొంద అనునటుల వ్యాకరణము మాత్రమే తెలిసినవాడుగాక సర్వవిద్యాసంపన్నుడని వివిధాధ్వర నిర్మల ధర్మ కర్మ దీక్షా పరతంత్రు డనుటలో శాంతరసమునకే ప్రాధాన్య మీయబడినదని తోచుచున్నది అదియే పెద్దనగారి యభిప్రాయ మయియుండవచ్చును పై పద్యమునందు కవి తాను నిర్వర్తింప దలచిన రససంఘర్షణ సూచించినాడు ఇటుల సూచించుట మహాకావ్యలక్షణము ఈ సంఘర్షణయందు శాంతుడు విజ్ఞాని యగువాడు భ్రష్టుడు కాడని

గీ. వాని చక్కదనము వైరాగ్యమున జేసి
శాంతి సేయు జారకామినులకు
భోగబాహ్యమయ్యె పూచిన సంపెంగ
పొలుపు మధుకరాంగనలకు బోలె

అని సూచించినాడు ఈ ఘట్టమున శాంతశృంగారములు రెండును ఒకదాని నింకొకటి అధిగమింప ప్రయత్నించినవి పర పురుషసాంగత్యము దోషముగా నెంచబడని కాలమున బుట్టిన గంధర్వాంగన పరపురుష వశీకరణవిద్య నుగ్గుపాలతో నేర్చుకొని

నది. రంభ, తిలోత్తమ మొదలగు ప్రౌఢాంగనలు చెలిమికత్తియ లగుటచే కామశాస్త్రము నందలి లోతుపాతు లన్నియు నామె సంగ్రహించినది. అందుచే కామశాస్త్రోపాధ్యాయివినా ప్రవరు నితో వాదించినది. అవి యన్నియు నా కాలపు కామినులకు దొసగులు కాక గుణములే యగును. ఎంత సొగసు ఎంత హొయలో చూడుడు. "ఇంతలు కన్నులుండ తెరు వెవ్వరివే డెద"వని కైతవకుసుమశరాసన యని సంబోధించినది. తానేకత మున నున్న జవరాలి నని చెప్పినది. కుందనమువంటి మేను ఎండ తాకుడు కందినదనియు లోపలికి వచ్చి సేదదీర్చుకొను మన్నది. పరస్త్రీ యని అనుమానించునని తాను సామాన్యనని తన కుల గోత్రముల నేకరువు బెట్టినది. "అనవిల్తు శాస్త్రంపు మినుకు లా వర్తించు పని వెన్నతోడ పెట్టినది మాకు" అని చెప్పినది. ఘృతాచీ, తిలోత్తమా, హరిణీ, హేమా, రంభా, శశిరేఖ మొదలగు ప్రౌఢ దేవవేశ్యలు తనకు ప్రాణసఖులని చెప్పినది. ఇటుల తన మనోవికారమంతయు వెల్లడించుటయే కాక ప్రవరుని ప్రేమపా గుర బంధింప యత్నించినది. ఇక ప్రవరుడో వేలిమియున్ సురార్చనయు విప్రసపర్యయు జిక్కుటయు, వృద్ధులయిన తన మాతాపితలు తన రాకకై యెదురుచూచుచుందు రనియు, తాను ఇలు చేరకున్న సమస్తధర్మములు దూలుననియు చింతతో తద్గం ధర్వాంగన యనన్యసామాన్యలావణ్యాతిశయమునకుగాని, తదీయ శృంగారచేష్టలకుగాని, నర్మగర్భాలాపములకుగాని లేశము కలంగ డయ్యె. ఈప్రకరణమంతయు సూక్ష్మముగ బరిశీలించిన సంస్కృ తిగన్న మానవప్రవృత్తికి, శారీరవాంఛలకు మధ్య గలుగు ఒక ప్రబలసంఘర్షణ మనవచ్చును. శాంతరస మొకవంక శృంగార రస మొకవంక శుకరంభాసంవాదమునందువలె నున్నవి. ఆంధ్రులు శుకుని మఱచినను ప్రవరుని మఱవరు. ఇందు నాయికానాయ కుల వాక్యోపవాక్యములందు అత్యుక్తులు లేవు. కల్పనలు లేవు. ఇందలి కవితాశక్తి యంతయు రసోత్కర్షకు ముఖ్యముగు భావనా

శక్తియుండే మిళితమైయున్నది వరూథినీప్రవరాఖ్యుల వాద ప్రతివాదము లోక రసవత్తరకావ్యము ఉభయపక్షముల వాదము లింపుగొలుపుచు న్యాయసమ్మతముగనే యుండును

పరపురుషసంపర్కము దోసముగా నెంచక ఆనందమే యనుభవించు గంధర్వకామిని ప్రవరుని వరించి వశముజేసికొని యత్నించుటలో దోసము లేదు పరమనైష్ఠికుని లోబఱచు కొన యత్నించినదే యని యెవరును కోపగింపరు హతాశయైన వరూధిని యవస్థజూచి సానుభూతి చూపకుండ జాలరు ప్రవరుడు మానవుడు ఇది కర్మభూమి పాపపుణ్యము లనునవి గలవు పరస్త్రీగమనము పాపము కులభేదములు కులధర్మములు మర్యాదలు కలవు అనగా వర్ణాశ్రమధర్మములకు సంఘము కట్టుబడియుండును ప్రవరుడు శమదమాదిసద్గుణముల కాటపట్టయిన సద్బ్రాహ్మణకుటుంబమున బుట్టినవాడు ఆహితాగ్ని. యౌవనముననే యజ్ఞయాగాదిక్రతువులు జేసి సోమయాజి యయినాడు నిర్మలధర్మకర్మ నిష్ఠాగరిష్ఠుడు సాలగ్రామదానమునైన గొన నొల్లని సువ్రతుడు కాసెకొంగున రంభాదులైన వారింపగల నాట్యరేఖా కళాధురంధరులైన వెలయాండ్రకు భోగబాహ్యుడైనాడు ఏకపత్నీవ్రతుడు వానికి వరూధిని మాటలు భ్రమ కలిగింపలేదు ఆపెసొగసు ఆకర్షింపలేదు చేష్టలు వశపఱచు కొనలేదు నిశ్చలమైన, నిర్మలమైన శీలమే యతని కవచము ఆ వలపుసానిచూపుగాని, మాటలు తీపులుగాని అతని శీలకవచమును ఛేదింపలేదు ఆ వరూధిని చేష్టలన్నియు నతని దృష్టిలో నరకద్వారమునకు సోపానములు ఈ ఘట్టమున శృంగారరసమే యధికముగ పోషింపబడినది అటుల పెద్దన చేయుటకు హేతువున్నది. అది యెంత బలీయమైనను ప్రవరుని స్థిరచిత్తస్థైర్యమును చెడగొట్టలేక పరాభూతమైనది దీనివలన ప్రవరునియందు రాశీభూతమైయున్న శాంతశౌచాదు లెంత బలీయమైనవో నిరూ

పితమైనది పెద్దనగారు కథాప్రారంభముననే ప్రవరుని ప్రవేశ పెట్టుటయు అతని శీలము శాంతిదాంతిశౌచాదుల విపులముగ వర్ణించుటయు తన గావ్యమునకు ప్రధానరసము శాంతమనియే యాయన భావించియుండెనని తలంచవలయును శాంతరసమునకు ఆలంబనము ప్రవరుడు శృంగారరసమునకు వరూధిని రెండును విరుద్ధరసములు శృంగారరసము వీగిపోయినది శాంతరసము విజయము గాంచినది ప్రవరాఖ్యుడు వరూధినిని ద్రోసివేయుట శాంతరసము శృంగారరసమునకు శృంగభంగము జేయుటయే శాంతరసమునకు స్థాయీభావము శమము. అది ప్రవరుడు హవ్య వాహనుని ప్రార్థించుటలో అయ్యగ్ని దేవుడు అమ్మహీ దేవుని దేహమున సన్నిహితుడగుటయు పావకప్రసాద లబ్ధంబగు పవన జవంబున నిజమందిరంబు జేరినాడు ఇచట అద్భుతరస ముప్పతిల్లి నది రసాభాసానంతరము అద్భుతరస ముప్పతిల్లుట సహజము నిత్యకృత సత్కర్మకలాపంబుల నిర్వర్తించుటలో శాంతిరసము సిద్ధిచెందినది మఱల నది శిఖదీప్తి మహిమను అతని యంశ మున బుట్టిన స్వారోచిషునందు ప్రతిఫలించి, అతడు మనువగు టకు కారణభూతమైనది శాంతిరసమూర్తియగు ప్రవరునితో ప్రారంభమయిన గాథ శమదమాదిగుణములు మూర్తీభవించిన స్వారోచిషమనువుతో సమాప్తమయినది అందుచే స్వారోచిష మనుసంభవకావ్యము శాంతరసప్రధానమని విమర్శకుల మతము.

వరూధినియత్నము లన్నియు విఫలములైనవి శృంగార రసము సిద్ధించలేదు ఏకత్రానురాగమగుటచే శృంగార రసా భాసము గలిగినది అటులగుట దోసముకాదు ఆలంకారికులు నవ రసములతోపాటు రసాభాసమునుగూడ నంగీకరించిరి స్థాయీభావ మును పొందనంత మాత్రమున రసపోషణ జరుగ లేదనుట పొస గదు శృంగారరసపోషణ జరిగినది కొందరు శృంగారరసా భాసమగుటకు సమ్మతింపక శృంగారరససిద్ధి గలిగినదను వాదమును లేవదీసిరి వరూధిని ప్రవరాఖ్యుని రూపమున నున్న మాయావి

యగు గంధర్వుని ప్రవరునిగా భావించనందున శృంగారరసము స్థాయీభావ మందినదని యందురు ఇది యతివాదము స్వప్నమున గన్న పెన్నిధికి జాగ్రదవస్థయందెంత విలువగలదో దీనికినిఅంతియే ఫలము వరూధినిని కామించి, మోసగించిన మాయా ప్రవరుని రూపమున వరూధినిని పొందగలిగినందున శృంగారరససిద్ధి యయినదందురా? రసము సామాజిక నిష్ఠమనిగదా ఆలంకారికుల మతము వరూధిని మాయాగంధర్వుల సంయోగము సామాజికు లకు నింపుగూర్పదు సరిగదా వలవంతగుందు అమాయికయగు వరూధినిని మోసముజేసినందుకు సహృదయులకు జాలికలుగును ప్రవరునిచే తిరస్కృతయై విరహోత్కంఠత విలపించు వరూధిని యప్పటిస్థితి కరుణరసోద్దీపికము గంధర్వుని దుశ్చేష్ట వరూధిని యెడ జాలిగలిగించుటచే కరుణరస మినుమడించును అందుచే శృంగారరససిద్ధి గలిగినదనుట పొసగదు ఈ ఘట్టము కరుణరస ప్రధానము

వరూధినీ ప్రవరాఖ్యులసంవాదఘట్టమున విపరీతవ్యాఖ్య చెప్పిన వారును గలరు వారి దృష్టికి ప్రవరుని మనసులో ఎచటనోలీలగా భోగలక్షణములు కనబడినవి అటుల కనబడుటకు హేతువుగూడ వారికి కనబడినది ఎఱ్ఱని గుడ్డను జూచి వృషభము బెదరినటుల మాయా ప్రవరుడు ధరించిన అరుణాంశుకోత్తరీయమును జూచి వీరు భ్రమించిరి ప్రవరుడు అట్టి యుత్తరీయమునే ధరించియుండు నట బంగారుసరిగతీగ అంచుగల ఎఱ్ఱని యుత్తరీయము ధరించుట వలన, అతడు ధనవంతుడు భోగి యని తేలుచున్నదట అరు ణాంశుక మనుటచే రంగు అద్దినదయి యుండవలయునట అగ్ని హోత్రియగు సోమయాజి యట్టివానిని గట్టకూడదు తెల్లని యుడుపులే ధరించవలయునట అటుల అరుణాంశుకోత్తరీయము ధరించిన ప్రవరునియందు భోగలక్షణములు గనబడుచున్నవట రాగరంజితహృదయ మయియుండునట వరూధిని మాటలవలన అతని యంతరాత్మలో ఏదో దూరముగా నొకానొక యాభి

ముఖ్యము గలిగినదట కాని ఆమె తత్తరముపడినది ఆ తత్తరమువలన వానికి సిగ్గును, వెగటును పొడమినవి వరూథిని తత్తరపడనియెడల ఏమి జరిగియుండెడిదో దైవమున కెరుక ఈ కావ్యరూపమే మాఱియుండెడిదేమో అరుణాంశుకోత్తరీయధారణము వలనగదా ప్రవరుడు ధనవంతుడు భోగి యని తేలినది నిజముగ నతడు ధనవంతుడే ఆ విషయము నిర్ణయించుటకు నరుణాంశుకోత్తరీయమవసరము లేదు వాని భాగ్యవైభవములను పెద్దనయే చెప్పినాడు అతడు ధనవంతుడు అతని మాన్యక్షేత్రములు పెక్కు చందాలం బందును తరగని పాడిపంట లాతని గృహమునకలవు ధనవంతుడు సువ్రతుడు గనుకనే ఏ భూపాలు డీవచ్చినం సాలగ్రామదానమైన గ్రహించని కర్మిష్ఠి తాన తిని పదుగురకు బెట్టగలిగిన సంపన్న గృహస్థు తీర్థసంవాసు లేతెంచినా రని విన్న ఎంత దూరమైన నెదురుగా వెళ్లి వినయముగ నాహ్వానించు అతిథి అభ్యాగతిపూజాపరతంత్రుడు ధనవంతుడుగాన భోగి భోగియయినంతమాత్రమున దుశ్శీలుడు కానక్కర లేదు స్వస్త్రీయందు భోగాసక్తుడు పరస్త్రీపరాఙ్ముఖుడు ఇవి యన్నియు సద్గృహస్థు లక్షణములు పెద్దనగారు ఇట్టి కళంకలు కలుగకుండుటకే ప్రవరుని గుణగణముల నంత విపులముగా చిత్రించినది అట్టి శీలవంతుడా భ్రమించునది? వరూథినితో ప్రవరుడు మాటలాడిన కాలమెట్టిది? ప్రవరుని అప్పటి మానసికస్థితి యెట్టిది? 'నళినీబాంధవభానుతప్తపరవికాంత స్యందినీహార కందళచూత్కార పరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నము' దెల్పుచున్న సమయము సిద్ధాపదేశమున హిమవన్నగంబు జూడవచ్చి పాదలేపనము మంచుచే గరగిపోగా స్వగృహము జేరుటకు మానసమందు తహతహ పడుచున్నాడు వాని యవస్థజూడుడు

సీ. నను నిముసంబు గానక యున్న నూరెల్ల
నరయు మజ్జనకు డెంతడలునొక్కొ
యెపుడు సంధ్యలయందు నిలువెళ్ళనీక వ
న్నొత్తు మెదు తల్లి యెంతలొ అలునొక్కొ

యనుకూలవతి నాదు మనసులో వర్తించు
కులకాంత మది నెంత కుందునొక్కొ
గడదోడునీడలై క్రీడించు సచ్ఛాత్రు
లింతకు నెంత చింతింతురొక్కొ

గీ॥ యతిథిసంతర్పణంబు లేమయ్యెనొక్కొ
యగ్ను లేమయ్యె నొక్కొ నిత్యంబులైన
కృత్యముల బాపి దైవంబ కినుక నిట్లు
పాఱవైచితె మిన్నులు పడ్డచోట.

మఱియు నీ పద్యము చూడుడు.

ఉ॥ వేఁడిమియున్ సురార్చనయు విప్రసపర్యయు జిక్కె భుక్తికిన్
వేళ యతిక్రమించె జననీజనకుల్ కడు వృద్ధు లాకటన్
సోలుచు జింతతో నెదురుసూచుచునుండుదు రాహితాగ్ని నే
దూలు సమస్తధర్మములు దొయ్యలి నేఁడిలు సేరకుండినన్

అనాలోచితముగ వచ్చినందులకు "బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్" అని తనను తానే నిందించుకొనుచున్నాడు. అట్టి మానసిక పరివేదనలోనుండి, మధ్యాహ్నపు ఎండ వేడిమికి డస్సి తానెఱుంగని పరప్రాంతమున పరవనితమాటలకు భ్రమించునంతటి యవ్యక్తుడెవడుండును? అందును "బ్రాహ్మణుడింద్రియవశగతి జిహ్మచరత్నైకనిపుణ చిత్తజనిశితాజిహ్మగముల పాలై చెడు, బ్రహ్మానందాధిరాజ్యపదవీచ్యుతుడై" యని చెప్పగలిగిన ప్రవరునకా మతి భ్రమించుట? 'అరణుల్ దర్భలు నగ్నులుం బ్రియములైనట్లు అన్యములు గావని భావించిన కర్మిష్ఠి, ఇహలోకతుచ్ఛసుఖములో మీసాలపై తేనియల్' అని భావించువాడు ప్రవరాఖ్యుడు. దేశకాలపాత్రముల విచారింప నక్కఱ లేదా యిట్టి విపరీతవ్యాఖ్య చెప్పుటకు? ఈ విపరీతభావమువలన ప్రవరాఖ్యుని శీలమునకు మచ్చయు పెద్దనగారి పాత్రచిత్రణ పోషణాదులకు స్ఖాలిత్యము ఆపాదించుటయే యగును. ఈ కాలపు మానవులలో దుర్బలచిత్తులగువారి తత్త్వమను కొలతబద్దతో పూర్వుల నడవడిని కొలచి వారికి వీరికి సాపత్యము గలిగించుటకుగా

చేసిన యత్నముగా దీనిని భావింపవలయును ' వెలివెట్టిరే బాడబులు పరాశరుపట్టి'' అని వరూధిని యనినటుల ప్రవరాఖ్యునంతటివానికే మనసు చలించినది మన మొక లెక్కా'' యని ఈ కాలపువారు తమ దుశ్శీలముల సమర్థించుకొనుటకుమాత్రమీ విపరీతవాద ముపకరించును 'తాటాకులలోన వ్రాసిరి పరాంగన గూడిన బాపమంచు' అని తారాశశాంకములోని పద్యమున కెంత విలువయో దీనికిని అంతియే విలువ. ఇంతకు నరుణాంశు కోత్తరీయ మనగా శ్రోత్రియులుధరించు నీరుకావిపంచె యని తోచినచో నిట్టి విపరీతవాదనకే తావుండదు

స్వారోచిచరిత్ర శృంగారరసప్రధాన మని యంటిమికదా. స్వారోచియందు శృంగారరసము సర్వాధిపత్యము వహించినది మూవురు సుందరాంగులను బరిణయమాడినాడు అత డంచితమతి నప్పాబోడులు మూవురతో వివిధవిహారసంగతుల దత్పరుడై పద్మినీవిద్యాప్రభావమున నన్నపానీయములకును వస్త్రాభరణములకును గంధపుష్పములకును నేకొఱతయు లేక యుండగా నా గంగానదిలోని చల్లని యిసుకతిన్నెలయందును, పూవుదేనెలతోనిండుకొనియున్న తుమ్మెదరొదలతోడి యుద్యానవనములందును, చంద్రకాంతమణుల యరుగులచే నందగించుచున్న కొండగుహాలయందును హంసలు తామరతూండ్లు దిని బలిసి గుంపులుగా గూడి మెలగుచున్న సరోవరముల తీరములందును విహరించుచుక్రీడించుచుండెను అతడు చక్రవాకిపలుకులు బహుసక్తివలని రసాభాసము నెత్తి దూఱుట వినియు తలవంచి యుస్సురనుటయేకాని తమకము మానడు ఇట్టిమిధునసంవాదము శాంతరసమును నూరిపోసినను 'వీరలతోడి సంగమ మిక వీడెద నంచు దలంచునే'' గాని ' దుర్వారములైన కోరికలవంత వివేకము చొప్పుదక్కు'' నదికాదు ఈ యంకుశపు పోటులు ఆ కామమదోద్రేకపు టేనుగును గుదియింపవయ్యె'' (శ్రీ వెం రమణరావు) ఇటుల స్వారోచి శృంగారరసార్ణవమున తలమునుకలుగ తెప్పతేలుచున్నటుల కవి

వర్ణించినాడు శృంగారరసము స్వారోచియందు పరమావధి నందినది అది శాంతరసము నడంచి మించియుండుటయే కాక వీర కరుణరౌద్రభీభత్సరసముల గౌణములుగా గలిగియున్నది మనోరమవృత్తాంతమునందు ఇందీవరాక్షునితో యుద్ధమునందు వీర కరుణభీభత్సరసములను, కళావతిని గామించిన దేవాపియందు అది రౌద్రభయానకరసములతో గూడినది ఇటుల స్వారోచిచరిత్ర శృంగారరసప్రధానమైన ఘట్టమయినను, కవి తన ప్రతిభావిశేషమున ఇతరరసములకు నుచితసందర్భములు కల్పించి గౌణములుగా పరికాశింపజేసినాడు దీనివలన మనుచరిత్ర వర్ణనప్రధానమైన గ్రంథమేకాక రసప్రధానగ్రంథ మనికూడ ఋజువయినది వన దేవతాసంగమఫలముగ స్వారోచిమమనువు జన్మించుటయు, ఆ యపత్యమహిమ స్వారోచికి బుణ్యాలోకప్రాప్తి యగుననుటయు జూడ చివఱకు శాంతమునందే శృంగారము పర్యవసించినదని చెప్ప వలయును కాన నీగాథయందు శృంగారరస మెంతతలముసకలుగ వెల్లివిరిసినను చివఱకు శాంతమునందే పర్యవసించుటచేత నీమహా కావ్యమునకు శాంతరసమే ప్రధానరసమని నిర్ధారణమయినది.

ఇతివృత్తమున జేసిన మార్పులను కొంత పరామర్శించినాము ఈప్రబంధమున కథాక్రమ మెటులున్నది, ఆయా కథలకు పరస్పరసంబంధము క్రమము మొదలగునవి యెటుల నిర్వహింపబడినదియు, ఆ నిర్వహణలో కవిచూపిన నేర్పు గమనించుట కథాకథన ప్రాశస్త్యము గ్రహించుట కవసరము మొదటి కథ యగు వరూథినీ ప్రవర సంవాదఘట్టము కరుణరస ప్రధానమయిన వరూథిని విరహవేదన, గంధర్వుని వంచనము, స్వారోచిజన్మము వఱకు కథ లొకదాని నంటి మఱొకటి క్రమముగనుండి యంతయు నొకేకథగ దోచును స్వారోచివృత్తాంతము మనోరమవిభావసికళావతుల గాథలు ఉపకథలుగాగల ఒక ప్రత్యేకకథ స్వారోచికథ వనదేవతాసంగమముతో పరిసమాప్తి నందుటతో స్వారోచిష మనువుకథ ప్రారంభమగును

వరూధిని ప్రవరాఖ్యసంవాదఘట్ట మీ ప్రబంధమున మణిపూసవంటిది అది తలమానికము ఇందలి కవితాశక్తి యంతయు రసోత్కర్షకు ముఖ్యోపకరణమగు భావనాశక్తియందే మిళితమై యున్నది ఆ భావనాశక్తి క్రమక్రమముగ బరిణామావస్థకు వచ్చినంతనే కవినాయికానాయకులయందు సంపూర్ణతన్మయత్వము నందినాడు కవి తానే వరూధినియై ఆ పాత్ర కుచితమగు వాచాభినయ అంగాభినయాదులతో నర్మగర్భోక్తులతో మది గరగించు అనునయాలాపములతో ప్రవరునియెడ వరూధినికిగల మోహోత్కర్షావిష్కరణము అతిస్వాభావ సిద్ధముగ ప్రదర్శించినాడు మఱల కవి ప్రవరుడై శుద్ధశ్రోత్రియత్వము ఏకపత్నీవ్రతము, ఇంద్రియ నిగ్రహము నిత్యకర్మానుష్ఠానాసక్తి సురభూసురార్చనతత్పరత, అతిధ్యభ్యాగత సపర్యానురక్తి, పితృభక్తి శిష్యవాత్సల్యము నిష్కలంకవైరాగ్యదీక్ష, అచంచలమనోనిగ్రహము మొదలగు ఉత్తమలక్షణముల నౌచితి చెడకుండ ప్రకటించినాడు తన్మయీభవనయోగ్యత గల కవియే దుష్కరమగు నిట్టివానిని అంత రసవంతముగ నీతిస్వాభావికముగ బ్రకటింపగలడు

ప్రవరుని సాంగత్యమునకై వరూధిని తన చాకచక్యమంతయు జూపి నిరాకృతయైనది అందుచే శృంగారచేష్టలు వర్ణనలు, హాయలు, నర్మగర్భోక్తులు కొరగాని కుయుక్తులలోనికి దిగినది 'యజ్ఞకోటులం బావనులౌటకున్ ఫలము మా కవుగిళ్ల సుఖించుటేకదా'' యని సంబోధించినది 'వెన్నవలెం గరంగు నలివేణుల గౌగిట జేర్చు భాగ్యము లెన్నిభవంబులం గలుగు''నని హెచ్చరించినది 'ఆనందోబ్రహ్మ' యను శ్రుతివాక్యమును ప్రమాణముగ జూపినది 'వెలివెట్టిరే బాడబులు పరాశరుపట్టి దాశకన్యాకేళి తప్పుసేసి,'' మొదలగు పెద్దల విషయముల ప్రస్తావన తెచ్చినది నీవు వారికంటె ఘనుడవా ''ఇనుపకచ్చడాల్ గట్టుకొను మునిముచ్చులెల్ల తామరసనేత్రలిండ్ల బందాలుగారె'' అని యడిగినది వరూధినీ ముఖమున నిట్లు చవులూర

బలికిన పెద్దనయే మునుల ప్రవరుని ముఖమున ప్రతివాదన ప్రారంభించినాడు "నీవన్న యర్థంబెల్ల గాముకులకు మాత్రమే కాని నకాముకు డది గణించునా ?' అని ఎదురుప్రశ్న వేసినాడు 'బ్రాహ్మణు డింద్రియవశగతి జిహ్మచరత్వైకనిపుణచిత్తజనిశితాజిహ్మముగలపాలై చెడు బ్రహ్మానందాధిరాజ్య పదవీచ్యుతుడై" అని తృణీకరించినాడు కామశాస్త్రోపాధ్యాయివినాత్రయీధర్మములు పాపమనియు రతి పుణ్యమనియు చెప్పుచున్నావు మోక్షలక్ష్మీ పథ్యాగమసూత్ర పంక్తికి ఇవి యామీ సాంప్రదాయములని" యీసడించినాడు ఆనందో బ్రహ్మ' యను సూత్రమునకు వరూధిని చెప్పిన విపరీతార్థమును ఖండించినాడు. ఈ శారీరక సుఖములు తుచ్ఛము లనియు అవి మీసాలపై తేనియలవంటి వనియు నిరూపించినాడు అరణులు దర్భలు అగ్నులు తనకు ప్రియంబయినటుల అన్యంబులు కావని వ్యక్తీకరించినాడు

ప్రవరుడు నిరాకరించిన కొలదియు వరూధిని మోహము ఉద్రేకింపసాగినది ఆపె ఉద్రేకము పెరిగినకొలదియు వానివైరాగ్యము బలపడజొచ్చెను శృంగార శాంతరసముల పరిణామావస్థ సమీపించినది రతిసంరంభమ మతియై వరూధిని "ప్రాంచద్భూషణ బాహుమూలరుచితో బాలిండ్లు పొంగార పై యంచుల్ మోవగ కౌగిలించి యధరం బానింప హా శ్రీహరీ యంచున్ బ్రాహ్మణు డోరమో మిడి తదీయాంసద్వయంబంటి పొమ్మంచు ద్రోచె" శాంతరసమున కెంతకంటె పరిణత యుండదు శృంగారము ఆ శాంత పరాకాష్ఠ ముందు తలవాల్చినది కవి తాను పాత్రలనుండి వేఱయి మధ్యస్థుడుగా కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్' అని హసించినాడు

కోపముతో కాటువేయబోవు నాగాంగనవలె వరూధిని లేచినది ఇంకను ఆపె హృదయమున ఆశ పూర్తిగనశింపలేదు పాటున కింతులోర్తురె కృపారహితాత్మక' అని ప్రవరుని దూయునాడి వానిని పశ్చాత్తాపతప్తుని చేయువలయునని చూచినది

మతొకయెత్తు యెత్తినది స్త్రీల చేతిలో బ్రహ్మాస్త్రమగుదానిని ప్రయోగించినది 'నీవు తొలియ నిచ్చోట భవన్నఖాంకురము సోకె కనుంగొనుమంచు జూపి యప్పాటలగంధి వేదననెపం బిడి యేడ్చె కలస్వనంబుతో' అని కవి చెప్పినాడు నఖాంకురము సోకిన యచ్చోటును జూపుటయు అశ్రుపాతము ఆ వగలాడి యుపయోగించిన బాణములు ఎంత రమణీయమైన దృశ్యము ఎంత భావపూర్ణత ఇవి యన్నియు ప్రవరుని శీలకవచమును భేదింపలేకపోయినవి అతని శాంతశౌచాదులు చలింపలేదు ఇటుల శాంత మెంత బలీయమైనదియు పెద్దన నిరూపించినాడు అగ్నిదేవుని ప్రసన్నతయే శాంతరససర్వస్వమునకు ఫలసిద్ధి ఈ ప్రకరణ మంతయు నాటకీయతకు పరమోదాహరణము పెద్దన ఈయెడ నసమాన యుక్తి వైచిత్రిని ప్రదర్శించినాడు

ప్రవరుని నిష్క్రమణముతో కవిహృదయరంగమున మిగిలినది వరూధిని మాత్రమే మతిచెడి యప్పర్వతప్రాంత కాంతారములలో ప్రవరాన్వేషణార్థ మున్మాదినివలె దిరిగినది కవికి ఆమెయం దిప్పు డత్యంతకరుణ కలిగినది విరహోత్కంఠితయగు వరూధినీ విలాపమున కరుణరస ముట్టిపడ జేసినాడు చివరకు శశికాంతశిలావేది శాంతరమున విశ్రమింప జేసినాడు

ఎన్నియో దినములనుండి వరూధినిప్రేమ బడయజాలక కందుచున్న గంధర్వకుమారుడు ఎటులైన వరూధినిని పొందు యత్నమున నున్నవాడు. వరూధిని యప్పటిస్థితి జూచినాడు 'శాంతరస మొల్క బ్రహ్మతేజంబుతోడ బ్రవరుడయ్యె వియచ్చరప్రవరు డపుడు' అతని బాహ్యరూపముజూచి ప్రవరుడని భ్రమించినది విరహార్తి గుందు వరూధిని కామార్తులు చేతనాచేతన భేదమునే యెఱుగరనికదా కవికులగురువుసూక్తి వాని వంచనను వరూధిని గ్రహింపలేదు వాని మోసపు మాటలకు లోబడినది ఈ వంచన వలన వరూధినియెడ పఠితలకు జాలి కలిగినది విరహార్తి గుందుచున్న వరూధినియెడ సహృదయుల కంతకు పూర్వమే

కొంత జాలి యుండియుండును. ఈ సంఘటనవలన ఆ కరుణము బలీయమైనది. ఆ గంధర్వుని మాయకు లోబడి వరూధిని తాను సుఖించుచున్నది ప్రవరునితోడనే యని భ్రమించి యిష్ట సౌఖ్యముల నందినది. గర్భవతియైనది. గంధర్వుని సంకల్పమీడేరినది. ఇక వాడు రంగమునుండి నిష్క్రమించవలయును. అందుచే కవి వానిచే—

కం॥ వంచన యొఱిగిన మఱి శపి
యించునొ సురకాంత చెప్పకేగిన క్షేమం
బంచశరశర పరంపర
బంచక ప్రాపించి మీద బాపంబిదునో.

అని వితర్కింపజేసినాడు. ఏదో నెపమున అతడు తప్పుకొన జూచినాడు. మంచిమాటలతో వరూధినిని సమ్మత పఱచినాడు.

గీ॥ అని వరూధిని నూరార్చి యచటు వాసి
పోయె దన యిచ్చ గంధర్వపుంగవుండు
తప్పరాదు ఋణానుబంధంబు దెగిన
బ్రాణపదమైన వలపును బాసి చనదె.

గంధర్వునకు వరూధిని యెడ పవిత్రప్రేమ లేదు. కామము మాత్రమే. అందుచేతనే వరూధినిని మోసగించి లోబఱచు కొనుటయు వీడి చనుటయు చేయగలిగినాడు. పవిత్రప్రేమికు డటుల జేయజాలడు. గంధర్వుడు శాశ్వతముగనే వీడిచనెను. "పోరే రారే ప్రియుంబు గల్గిన జనుల్" అను వాని మాటలు బూటకము లనియు దేలినది. కవినేర్పు కల్పనాశక్తి కథయందు పాత్రల చిత్రించుటలోనేగాక కథానుకూలముగ పాత్రపోషణ జేయుచు, ఆ పాత్రల సందర్భోచితముగ నిష్క్రమింప జేయుటలో నున్నది. ఈ విషయమున పెద్దన యెంతైన నేర్పరి.

ఇక రెండవ ప్రధానకథయగు స్వారోచిచరిత్ర చతుర్థాశ్వాసములో ప్రారంభమయినది. ఈకథ గ్రంథాంతము వఱకు చివరి

యే యిరువది పద్యములలోనో తప్ప వ్యాపించినది స్వారోచి జననము, జాతకర్మ విద్యాభ్యాసాదులు, యౌవనవంతుడగుట, మందపర్వత పార్శ్వమందు విశ్వకర్మనిర్మితమైన నగరియందు చెంచులు మొదలగు నాటవికులు గొలువ కాపురముండుట అతని వేట మొదలగునవి విపులముగ వర్ణింపబడినవి ఈ కథలో లీన మైన కథలు కలవు అవి మనోహరమైన మనోరమ చరిత్ర, విభ్రమముగొల్పు విభావసికళావతుల వృత్తాంతము ఈమూవురను స్వారోచి వివాహమాడి వారితో నిష్టభోగముల ననుభవించుట వనదేవతాసంగమము మొదలగు గాథలు ఈ యువకథను ప్రధాన కథలో మేళవించి యంతయు నొకకథయా యనునటుల రచించుటలోనే యున్నది కవిప్రతిభ కల్పనాశక్తి మనోరమకు శాపము గలుగుటకు హేతువుగ కల్పింపబడిన కథ చదివిన భారత మందలి చ్యవనుని గాథ స్ఫురించును ఇందీవరాక్షుని శాపవృత్తాంతము చదివిన కర్ణుడు పరశురామునికడ ధనుర్వేదము జదువుటయు శపింపబడుటయు స్ఫురించును ఇందీవరాక్షుడు "కపటాంతేవాసినై శాంబరిక గొంటుంజందమునీంద్ర శిష్యుల గొడన్ గూర్చుండి" వంచనమై బ్రహ్మమిత్రునివలన నాయుర్వేదవిద్య నామూలాగ్రముగ నభ్యసించెను అటుల యసురయగు మాయ ప్రయోగించి విద్యగఱచుట యేకాక ధూర్తత్వముతో నా గంధర్వ రాజు గురువుతో గ్రుద్దులాడుటా" యను నటుల నేమనెనో గమనింపుము

శా॥ తండ్రీ నాకు ననుగ్రహింపగదె వైద్యం బంచు బ్రార్థించినన్
గండ్రల్ గానటులాడి ధిక్కృతులబోకాల్మంటివోహో మదిం
దీండ్రల్ గల్గినవారి కేకరణి జేనిన్ విద్య రాకుండునే
గుండాగ్రాడాచిన బెండ్లి యేమిటికి జిహ్వాం గష్ట ముష్టింపచా

ఇటుల గురువును దూలనాడి యసురత్వమంద శాపం బందెను స్వారోచి మూడవభార్యయగు కళావతిచరిత్రకు, శకుంతల చరిత్రకు గొంత పోలిక గలదు

స్వారోచిచరిత్రి యంతయు శృంగారరసప్రధానము అయి నను పైన సూచించినటుల అందలి వివిధసన్నివేశములు వీరభయానకభీభత్సాద్యంగరసములకు బోషకములై యొప్పినవి శృంగార రసము అంగి, తదితరములు అంగములుగ రసవత్తరకావ్యమయినది ఈఘట్టమున విమర్శనీయములగు కొన్ని సందేహములు కలవు స్వారోచి మనోరమవలన నస్త్రహృదయమను విద్య బడసెను ఆ శక్తిచే రాక్షసరూపమున నున్న ఇందీవరాక్షుని జయించెను ఇందీవరాక్షుడు వరశుల్కముగ నిచ్చిన ఆయుర్వేదవిద్యాప్రభావమున విభావసీకళావతులను రోగబాధా విముక్తులజేసెను విభావసివలన నొకవిద్యను కళావతివలన నొకవిద్యను బడసెను అస్త్రహృదయమనువిద్య సకలరిపునాశకమయ్యు మనోరమచేతిలో ప్రయోజనశూన్యమాయెను భాసిల్ల లేదు అటులగుటకు కారణము చెప్పబడలేదు సకలరిపునాశకము యశస్కరమునైన దాని వేవేగ తనవలన బ్రతిగ్రహించి దైత్యుని అడపుమా యని స్వారోచిని కోరినది

కం అనుటయు శుచియై నిలిచిన
జననాథునకుం బ్రయోగసంహారంబుల్
వనిత రహస్యంబుగ జె
ప్పిన నాతడు నెఱిగెనంత భీషణభంగిన్

ఇట మనోరమ గురుస్థానముననున్నది స్వారోచి శిష్యప్రాయుడుగ విద్యను గ్రహించెను తరువాత మనోరమనువివాహమాడెను ఇది యెట్టి సాంప్రదాయము ? ఆ విద్యను స్త్రీధనముగ స్వీకరించెనా ? ఇట్టి సందేహమే విభావసీకళావతులవలన స్వారోచి విద్యల గ్రహించు విషయమునను గలుగును ఇట్టి యనుమానమే పెద్దనకుకూడ కలిగినదేమో వీరువారనగ వలవదనఘ సద్విద్య యొందున్న గొనగవలయు అని మనోరమచే ననిపించినాడు, 'నీచాద ప్యుత్తమాం విద్యాం స్త్రీరత్నం దుష్కులాదపి' అని యున్నదికదా విద్యల నొసగుటచే గురుస్థానీయులగు మనోరమా

విభావసికళావతులను చెట్టపట్టుట దోసమయినచో ఆ విద్యలు వారు అరణముగా దెచ్చిన స్త్రీధనమై యుండుననియు, వారిని వివాహమాడుటచే స్వారోచికి వాని ననుభవించు హక్కు ఏర్పడిన దనియు భావించవచ్చును లేదా ఆయావిద్య లాతనిని వరించినవి గనుక అలంకారికముగ నా విద్యలకు స్త్రీత్వము కవి కల్పించెనని భావించుటయు సమంజసమే

ప్రబంధములు వర్ణనా ప్రధానములయిన కావ్యములందురు. అందుచే అష్టాదశవర్ణనాదు లన్నిటిని జేర్చి రచించినంత మాత్రముననే కావ్యమున కుత్తమత్వము సిద్ధింపదు ఆంధ్రలాక్షణికు లైనను గీర్వాణలాక్షణికులైనను మహాకావ్యలక్షణములుగ వీనిని విధించినం తమాత్రమున వానివలననే కావ్యత్వము సిద్ధించుననుట కల్ల అంగడిలో అన్నియు నుండి అల్లుని నోట శనియున్నటుల ఇన్ని వర్ణన లుండియు కావ్యము రసబంధురముగానిచో ప్రయోజనము లేదు కావున ఈ వర్ణనలను రసపోషకములుగా మలచు కొనుటయే కవిప్రతిభకు నికషము గాగలదు

మ పురవారాశి మహీధరర్తు శశభృత్సుప్రోదయోద్యాన పు
ష్కర కేళీమధుపాన మోహన వియోగశ్లేషయాన స్వయం
వర పుత్రోత్సవ మంత్రదూత్యగణ దోస్సైవ్యాజిసంకీర్ణ నా
కరమష్టాదశవర్ణనాన్వితము తత్కావ్యంబు భవ్యంబిలన్ (కా చూ )

కం పురసింధు నగ ఋతు నశశి
సరసీవన మధురతి ప్రసంగ విరహముల్
పరిణయతనయోదయనయ
విరచన యాత్రాజిదౌత్య విభువర్ణనముల్ (కా సం )

ఇవి చాలక కాబోలు మఱి నాలుగు జేర్చి యప్పకవి మహా కావ్యమునకు ఇరువది రెండు వర్ణనలుండవలయునని శాసించినాడు కాని మూర్తికవి ఇందు నొకకొన్ని కడమైనను నేమిగాక, యదియుగూడ మహాకావ్య మనగబరగు నని చెప్పినాడు ఈ అవకాశము లేకున్న శాస్త్రములోని ప్రతిసియమము బాటించుచు

కావ్యరచన గావించుట అసాధ్యము అటుల యత్నించి రచింప బడిన కావ్య మస్వాభావికముగ నుండును రసవత్తర కావ్యముగా రూపొందుట దుర్లభము కొన్ని యెడల కొన్ని వర్ణన లతికినటు లుండునేగాని కథకు రసపుష్టి గలిగింపవు కవి శృంఖలాబద్ధుడయి వ్రాయువానివలె నుండును కొన్ని యెడల ఈ వర్ణనలు కథకే సంబంధము లేనటు లుండుటయు గద్దు అట్టి వర్ణనలు కవియొక్క ప్రతిభావ్యుత్పత్తులకు సాక్ష్యములగునే కాని కావ్యమునకు ప్రాణము వంటి రసమును బోషింపజాలవు సరిగదా దానిని భంగించును

శాంతశృంగారములయందు గొంతసేపు కరుణారసమందు కొంతసేపు పెద్దనార్యుడు మునిగి రసార్ణవమునుండి పారము జేరు కొనెను వాని కిపుడు విశ్రాంతి చిక్కినది అందుచేత ననన్య కల్పనాశిల్పమును బ్రదర్శించుటకు ప్రారంభించి పూర్తిగ సృష్టి సౌందర్యము పరితల హృదయములకు హత్తుకొనునటుల జేసెను ఇట్టి కల్పనా శిల్పమున కవి తన నిరంకుశత్వము బ్రకాశింప జేయును ఇది సిద్ధించుటకే మన లాక్షణికులు అష్టాదశవర్ణనలను కావ్యలక్షణములలో జేర్చియుందురు కథాకథనము బాగుగ జరిగినంతమాత్రమున కవియొక్క స్వయంసిద్ధప్రతిభా వ్యుత్పత్తులు భావుకత్వము ప్రస్ఫుటము కావు శబ్దప్రధానమైన రచనతో పాటు అర్థప్రధానమైన భావముకూడ సత్కావ్యలక్షణము అట్టి భావనాశక్తి సత్కవికి సహజము అట్టి కవి కథాకథనమున కట్టు బడక స్వతంత్రుడై కథ కనుకూలములగు వర్ణనలతో దన కల్పనాశక్తిని జూపగలుగును ఈ విషయమును దృష్టిలో నుంచు కొని, మనుసంభవకావ్యము చదివిన సహృదయులకు పెద్దనగారి సర్వతోముఖ పాండిత్యము, చతుర్విధ కవితావిలాసము, భాషా వైదుష్యము కల్పనాచాతుర్యము లోకజ్ఞత సృష్టిపరిశీలనాశక్తి గోచరమగును

స్వారోచిషమనుసంభవము సౌభాగ్యమునకు ముఖ్యముగా హేతుభూతమైనది కథాకథనముకన్న అందలి వర్ణనాసంపద

యనవలయును. వర్ణనావైభవము ప్రధానస్థానమును కథాకథనము రెండవ స్థానము నాక్రమించినవి ఈ వర్ణనలన్నియు కథా సందర్భమున కుచితములు కథాకథనమున కావశ్యకములునగును ఈ వర్ణన లీ కావ్యశ్రీయందు ఆ యా స్వభావములకు కుద్దీపన విభావములుగా వెలుగొందుచుండును స్వారోచి వేటవర్ణన ఆ ప్రకరణమున జరుగు కథాప్రవృత్తికి రంగముగా చిత్రింపబడినది మనోరమా స్వారోచుల వివాహమునకు వేదికయైనది ఈ వర్ణన యంతయు కథకు ప్రధానముగనే భాసిల్లినది ఇటులనే ప్రతివర్ణనయు నేదియో ప్రయోజనము నుద్దేశించియే చేయబడినది వర్ణిత దృశ్యములబట్టి వర్ణితభావముల బట్టియు భాష మాఱుచుండును ఎన్ని మార్పులు జెందినను పెద్దనగారి వాక్కునకు సహజమగు ప్రసన్నత స్థిరముగ నుండును వర్ణన మూడు విధములుగ విభజింపవచ్చును స్థావరపదార్థవర్ణనము చరపదార్థ వర్ణనము ప్రాణుల యంతరపరివర్తనము వర్ణించుట ఇవి యొకదానికంటె మఱొకటి దుష్కరము. పెద్దన ఈ త్రివిధములగు వర్ణనల జేయుటయందు సమాన నైపుణిగల మహాకవి ఈ వర్ణనల జూడుడు—

సీ. మూడిచిన యొంటి కెంజడమూయ మువ్వన్నె
మెగముతోలు కిరీటముగ ధరించి
కకపాల కేదారకటకముద్రితపాణి
గుఱుచలాతాముతో గూర్చిపట్టి
యైణేయమైన యొడ్డాణంబులవణిచే
నక్కళించిన పొట్ట మక్కళించి
యూర్ధపూటచ్ఛాయ నవఘళింపగజాలు
బడుగుదేహంబున భస్మమలది

గీ. మిట్టయురమున నిడుయోగపట్టె మెఱయ
జెవుల రుద్రాక్షపోగులు చవుకళింప
గావికుబుసంబు జలకుండికయును బూని
చేర వచ్చె మాయాసిద్ధు డొకడు

అని సిద్ధుని రూపమును పారకులముందు నిలువబెట్టినాడు పెద్దన మాయాప్రవరుని రూపము చిత్రించిన సొగసు గూడ నిట్టిదియే—

'సీ అర్ధచంద్రుని తేట నవఘళించు అలాట
పట్టిదీర్చిన గంగమట్టితోడ
జెక్కుటద్దములందు జిగివెల్లువలు చిందు
రమణీయమణి కుండలములతోడ
బసిడివ్రాతచెఱంగు మిసిమి దోప కెలంగు
నరుణాంశుకోత్తరీయంబుతోడ
సరిలేని రాకట్టుజాళువా మొలకట్టు
బెడగారు నీర్కావి పింజెతోడ
గీ ధవళ ధవళములగు జన్నిదములతోడ
గాశికాముద్ర యిడిన యుంగరముతోడ
శాంతరసముల్కు బ్రహ్మతేజంబుతోడ
బ్రవరుడయ్యె వియచ్చర ప్రవరు డపుడు"

ఈ కుహనాభూసురుని నటనను "పసిడితోరముల తోడి బాహువల్లన జూపి" అను పద్యమునందును 'కొనసాగి కామినీ గోష్ఠిప్రౌఢములైన" అను పద్యమునందును ఎంత స్వభావికముగ వర్ణించెనో గమనార్హము ఇటులనే హిమవన్నగౌన్నత్యమును స్ఫురింపజేయు పద్యమును చూడుడు

ఉ "అట జని కాంచె భూమిసురు డంబరచుంబిశిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగతరంగ మృదంగనిస్వన
స్ఫుటనటనానురూప పరిఫుల్లకలాపకలాపిజాలముం
గటకచరత్కరేణు కరకంపితసాలము శీతశైలమున్

ఈ పద్యములో నాధునికులు కొందఱు రస మేమియు లే దందురు శబ్దాడంబరముచే సందర్భము పాడయిన దనువారును కలరు కాని శబ్దప్రయోజనమున కిది పరమోదాహరణము ఈ పద్యము చదువగనే ప్రతిపదార్థముమాట యెటులున్నను వర్ణ్య

విషయమును ఆపద్యమునందలి శబ్దగుంఫనయు, అందలి లయము మనసున హత్తజేయును తరంగముల మర్దలధ్వనులు నెమళ్ళ నాట్యపుటొయ్యారములు వీఃనాశబ్దములే మనకు బట్టియిచ్చి శిరఃకంపన మొనర్పజేయును దీనియందలి వర్ణనాశిల్పము సహృదయవేద్యము శబ్దగతరసమునకిది పరమోదాహరణము

శా॥ తావుల్ క్రేవల జల్లు చెంగలువ కేదారంబు తీరంబునన్
మావుల్ క్రోవులు నల్లిబిల్లిగొను కాంతారంబునం దైందవ
గ్రావాకల్పిత కాయమానజటిల ద్రాక్షాగుళుచ్ఛంబులం
బూవుందీవెల నొప్పు నొక్క భవనంబున్ గాంచె నుత్కర్ణమున్ ॥

అని వర్ణించి అది మిహికాహార్య ప్రాంతమున నభోవాహినీలహరీశీతల గంధవాహపరిఖేలల్ మంజరీసౌరభగ్రహణేందిందిరతుందిలంబులగు కాంతారంబునందు నిర్మించబడినదిగా చెప్పినాడు వరూథినీప్రవరాఖ్యుల సంవాదరసఘట్టమునకు ఎట్టి రంగస్థలము కల్పించెనో చూడుడు ఇటులనే చరవస్తువర్ణన జేసిన సొంపు గనుడు

ఉ॥ చూచి ఝళంఝళత్కటక సూచితవేగ పదారవిందయై
లేచి కుచంబులుం దుఱుము లేనడు మల్లలనాడ నయ్యెడం
జూచిన యొక్క పోక సునుబోడియు జేరి విలోకనప్రభా
వీచికలం దదీయపదవీకలశాంబుధి వెల్లిగొల్పుచున్

విరహార్తయైన వరూథిని చెలికత్తెలు బలవంతమున వనవిహారమునకు బయలుదేరునపుడు ఆపె యలంకరించుకొనుటలోని విరహిణికి సహజమగు నిస్పృహ అలసత్వము, విరక్తి ఎంత చక్కగ స్ఫురితములో గమనింపుడు

సీ॥ ఘనసారపంక మొక్క లతాంగి దెచ్చిన
మట్టిగ్రేలనె చుక్క బొట్టుబెట్టి
యింతి యొక్కతె పూవుబెత్తు శెత్తిన జూచి
వినువులో నొకకొన్ని విరులు దుఱిమి

పడతి యొక్కతె రత్నపాదుకలిడ నిల్చి
తోడుగ కవ్వలికి బో నడుగుపెట్టి
బాగాలు వేసనొక్క పద్మాక్షి యొసగిన
వెగ్గలంబని కొన్ని వెడల నుమిసి

గీ. సగముగొఱికిన యాకును, సఖులు పిలువ
సగమొసగు నుత్తరము చెవ్వి సగము మఱపు
సగము నయి చింతచే సగమగుచు నరిగె
నవ్వరూధిని యంతితోద్యానమునకు

ఇటులనే మానసికపరివర్తన చిత్రింపబడిన పద్యములు గమనింపుడు

ఉ॥ అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింప గాంత్రిపై
ల్లుబ్బి కనీనికల్ వికసితోత్పలపంక్తుల గ్రుమ్మరింపగా
గుబ్బమెఱుంగు జన్నవ గగుర్పొడువన్ మదిలోన గోరికల్
గుబ్బటిలంగ జూచె నలకూబరు సన్నిభు నద్ధరామరున్

మాయాప్రవరునిగాంచిన వరూధిని మానస మెటుల వర్ణితమో చూడుడు

సీ. తొలుదొల్త వాని గన్నుల గాంచినప్పుడ
పల్లవాధరగుండె జల్లుమనియె
నట రెండుమూ డంజ లరుగునప్పుడ కాళ్ళ
బంకజాక్షికి దొట్రుపాటు గదిరె
డాయంగజనునప్పుడ ముఖాంబుజంబున
గంబుకంధరకు దైన్యంబు దోచె
గదిసి నిల్చినయప్డ కనుదోయి రెప్పల
అలనకు మిగుల జంచలత బెరసె

గీ. కటకటా యనునపుడ గద్గదిక వొడమె
జెఱగువట్టినయపుడ లేజమట గ్రమ్మె
సొలసి మాటాడ సంకింపదలచి మోము
జేరకొనచూచునపుడ కన్నీరు వొడమె

శృంగార రసస్థాయీభావమున కుద్దీపనవిభావము లిట పొందుపఱచుటచే నిది యెంతయు సహజముగ, సందర్భశుద్ధిగలదిగ నున్నది. ఇటుల నెన్నియే నుదాహరింపవచ్చును.

ఈ మహాప్రబంధమునందలి వర్ణనలు ఖండకావ్యము లనందగినవి. సూర్యోదయాదివర్ణన లన్నియు రమణీయఖండ కావ్యములు. మన సాహిత్యములో కావ్యమునందలి వివిధరసములకు నీ వర్ణన లుద్దీపనభావములుగా నుపచరించి సార్థకములై భాసిల్లుచున్నవి. Merchant of Venice లోని చంద్రికావిహారరంగము చదివినవారు షేక్స్పియరు ఆ రంగము నటుల అచట సృజించుట లోని యౌచిత్యము గ్రహించియేయుందురు. ఏ భావయందైనను మహాకవులందఱు చేయు కల్పనాశిల్ప మొకేతీరున నుండును. ఆంగ్లసాహిత్యమున నిది యుత్తమపద్ధతిగ భావించి యానందించు ఆంగ్లభాషావేత్తలు కొంద ఱేలనో మన ప్రబంధములందలి వర్ణనల నీసడించెదరు.

గీ॥ బహురత్నద్యుతిమేదురోదర దరీభాగంబులం బొల్చు ని
మ్నహాకాహార్యమునం జరింతు మెపుడుం బ్రేమన్ నభోవాహినీ
లహరీశీతలగంధవాహ పరిఖేలన్మంజరీ సౌరభ
గ్రహణేందిందిరతుందిలంబు దివిమత్కాంతార సంతానముల్.

ఈ పద్యమునందు కొండకోన వర్ణింపబడినది. ఈ వర్ణనము వలన ప్రత్యేక ప్రయోజ మేమియైన గలదా ? దీనియందలి భావపు లోతు లేమి యని విచారింతము. రత్నకాంతులచేత ప్రకాశించుచున్న మంచుకొండప్రాంతమున, ఆకాశగంగయొక్క ప్రవాహము వలన గలిగిన చల్లగాలిని అనుభవించుచు, సౌరభవములీను పుష్పముల మధువును గ్రోలు భ్రమరములతో నిండియున్నది. ఇందు సదా ప్రీతిమై చరించుచు ఆ చల్లగాలులు హాయిగ ననుభవించుచు మేమును ఆ పుష్పములమే, మమ్ము జేరి ఆనందామృతము గ్రోలు భ్రమరము కమ్ము అనునది ధ్వనించుచున్నది. ఇది నర్మగర్భితముగ తన మనోగతాభిప్రాయమును దెలియజేయుటయే యగును.

రసికు డుపరేంగితజ్ఞాని యగు సరసుడు. గ్రహించుటకీమాత్రపు సూచన చాలును. స్త్రీలను పుష్పములుగ, భ్రమరములుగ జెప్పుట కవిసమయమే కదా. ప్రవరుని కులశీలాదుల రూపరేఖ విలాసాదుల విపులవర్ణనమును, స్వరోచి వేటవర్ణన మొదలగువానిని ప్రత్యేక ప్రయోజనము నుద్దేశించియే పెద్దన జేసెను. వర్ణనాత్మకమైన ప్రతిఘట్టము నీ దృష్టితో నాలోచించిన పెద్దనగారి ప్రతిభయు కల్పనాశిల్పము, వర్ణన వైచిత్రియందలి భావుకత్వము ఎంతేని యచ్చెరువు గలిగించును. ఇంపైన కథను సొంపైన వర్ణనలతో పెంపొందించుటకు అనువగు శైలి కావలయు ననిగదా లాక్షణికుల భావము.

శైలినిగుఱించి యభిప్రాయభేదములు గలవు. ఒక్కొక్క శైలికి ఒక్కొక్క గుణ ముండును. కొందఱకు క్లిష్టమగు శైలిపై మక్కువ. అందఱకు దెలియునటుల వ్రాయుట కవిత్వము కాదందురు. సమాసభూయిష్టమై, దూరాన్వయము గలిగియో, అస్పష్టార్థము గలిగియో, అప్రచురశబ్ద సంయోజనముననో వ్యాకరణసాధిత విపరీతప్రయోగములవలననో అన్వయకాఠిన్యమున నలరారు శైలియే వారి నూరించును. ఒక్కొక్కయెడ దానిని రచించినవారే దానిని సులభముగ నన్వయము చేసికొనలేకపోవచ్చును. అన్వయించినను అందు భావము స్వల్పముగను పరికరము లెక్కువగును నుండును. రెండవ మతముప్రకారము అర్థము శీఘ్రముగ సమర్పించు శబ్దప్రయోగముచే ప్రసన్నమగు శైలి యుత్తమము. మాధుర్యప్రసాదగుణములపై వారికి మక్కువ. ఆయా శైలీభేదంబులబట్టి పాకభేదంబుల నాలంకారికులు నిర్ణయించిరి. మాధుర్యము, ఓజము ప్రసాదము అనుగుణములను కదళీద్రాక్షానారికేళాదిపాకభేదముల నేర్పఱచిరి. "మధురముగను సుకుమారముగను ఒకసొగసు గలుగునట్లుగా రచన చేయుటయు, లోకము పద్యములోని మాధుర్యాది గుణములకుమాత్రము వశమగుటయు ప్రశంసనీయమగు విషయము కా"దని మొదటి మతమువారిలో కొందఱిభావము.

'మధురపద్యరచనానుబంధ వాగ్వ్యవహారముల మూలహేతుక విశిష్టజీవలక్షణముకలవారి రచన ప్రజాదరణమునందును అట్టిచో మధురపద్యరచనాశక్తి గలవాని రచనలో శిల్పము సమకూర్చు కొనుట మిక్కిలి కష్టమైన విషయము ఆ కవి మాధుర్యగుణ వశుడై అదియే శిల్పమనుకొని దాని వెంట్లబడిపోవును వచ్చిన కీర్తికి చట్టలు పొంగించుకొనును మాధుర్యసౌకుమార్యగుణ ములు జీవలక్షణముచేత ఏ కవినోటినుండి వచ్చు పద్యమునందు కుదురుకొనియుండునో ఆ కవి యాగుణమునకు వశుడై సంప్రాప్త మైన సులభకీర్తికి దాసుడై మహాశిల్పమార్గమునకు బాహిరు డగుట సర్వదాసంభవము'' అని ఒకరు వ్రాసిరి కాని వారి భావ ములో శిల్పమన నేమియో అది యెట్లుండునో నిర్వచింపజాల రైరి వీరి నిర్వచనముప్రకారము మాధుర్యాదిసుకుమారగుణము లుండిన కావ్యములో శిల్ప ముండనేరదని కదా తెలిసినది క్లిష్టపద సమాసబంధురమై జటిలమైన శైలి యున్నంతమాత్రమున కవితా శిల్ప ముత్పన్నమగునా అసలు శిల్పమనునది పాకభేదములమీద ఆధారపడియుండునా కథాకథన శిల్పమునకు వర్ణనాశిల్పమునకు మృదుమధురశబ్దజాల మనుకూలమైనది కాదా ఈ దృష్టితో చూచిన రసవత్తర కావ్యము లని పండితప్రకాండులచే కొనియాడ బడుచున్న మనుసంభవము, పారిజాతాపహరణము ప్రభావతీ ప్రద్యుమ్నము, విజయవిలాసము మొదలైన కావ్యములన్నియు శిల్పదృష్ట్యా కొరగానివిగా భావింపవలయును అటులనుట సాహ సమే యగును ఒకరికి ఒకశైలి యమరును రసభేదములచే శైలి మారుచున్నను ప్రసాదగుణము వారి కవితయందు కొరవడదు ప్రచురార్థములగు అలతియలతి పలుకులచేతనె కవిశ్రేష్ఠులు ఓజో గుణమును సమర్పింపనేర్తురు అట్టి పద్యముల నెన్నిటినేని మన పూర్వ గ్రంథములందు జూపవచ్చును దీర్ఘసమాసములను మాధుర్యమును సంతరించుకొనుట నన్నయ పెద్దనల రచనలందు ప్రసిద్ధమే శైలికి శిల్పమునకు విరోధము లేదు అప్రసిద్ధపదప్రయో

గమును దూరాన్వయక్లిష్టాన్వయములును శిల్పమునకు హేతువు లగునేని ఆకవిత కొక నమస్కారము పురాకృతపుణ్యవశమున నొకొక్కరి కొక శైలి యలవడును అదియే యుత్తమ మని సమర్థించుటకై దాని నొక శిల్పముగ ప్రదర్శించు యత్నము వ్యర్థము నన్నయతిక్కనాది మహాకవుల రచనలనుండి ప్రసన్న మధురములగు రచనలను సర్వరసములందును చూపవచ్చును ఇక ప్రస్తుతమగు మనుసంభవకావ్యశైలిని పరామర్శింతము

మనుసంభవకావ్యమున శాంతశృంగారము లగ్రిస్థానము నాక్రమించినది మిగిలిన రసములు సందర్భానుసారముగ నంగరసములుగా పోషింపబడినవి సుకుమారరసములగు శాంతశృంగారముల మాట యటులుండ వీరభయానకాద్యంగి రసఘట్టములందు గూడ పెద్దనరచనలో దూరాన్వయక్లిష్టాన్వయములు మందునకైన గానరావు ఇందలి పద్యము లన్నియు హృద్యములు, భావబంధురములు మృదుమధుర పదయుతములు అవి కొన్ని యెడల సంస్కృతపద సమాసయుతముగను, కొన్ని యెడల అలతి యలతి పలుకులతో తేనెలొలుకునుడికారముతో లోకోక్తులతోడను కావ్యశోభనినుమడింప జేయుచున్నవి ఇటులుండుటకు కారణము కలదు

ప్రబంధకవితలమునకు మూలపురుషుడు, మహాచార్యుడు అనదగినవాడు కవిసార్వభౌముడు ఆతని యాంధ్రీకృతశృంగార నైషధమహాప్రబంధము విద్వదౌషధమే అయినను అది తరువాతి కవులకు భిక్ష పెట్టినది అటు పూర్వకవులగు నన్నయాదులకు ఇటు ప్రబంధకవులగు పెద్దనాదులకు చెరియొక చేయి అందిచ్చి పురాణకవులకు ప్రబంధకవులకు వ్యవధానము కనబడకుండ జేసెను పెద్దన శ్రీనాథుని శతథాఅనుకరించి కృతికృత్యుడైన శిష్యుడు మనుచరిత్రయందలి సీసపద్యములు శ్రీనాథుని సీసపద్యములకు ప్రతిబింబము లనునటు లుండును అలంకారిక శైలియందు, రీతియందు, సంస్కృతసమాస సఘటనమునందు శ్రీనాథుని యడుగు

జాడల నడచినటుల దోచును. ఇటులనే అచ్చ తెలుగుపదములనే మిక్కిలిగ గూర్చి యుజ్జ్వలమైన ప్రతిభావిలసనముచేతను, అసదృశమైన కవితాప్రౌఢిమచేతను అపూర్వములు, అతిమనోహరములు నగు పెక్కురచనావైచిత్ర్యములు పచరించి యాంధ్రభాషాలతాంగి కనన్యలావణ్యము నొడగూర్చిన కవిబ్రహ్మ పెద్దనకు పెక్కెడల ననుకరణీయు డయినాడు. అలతియలతి పలుకులలో నల్ప భావస్ఫురణము చేయువిద్దె తిక్కననుండి గ్రహించినదే. అర్థగౌరవము గల యల్పపరికరమే రచనాప్రౌఢికి శరీరము. అర్థవ్యక్తి కతి మాత్రమైన పదచ్ఛటాపటలము కవితాసతికి రోగంపుబలుపు వంటిది. పదాడంబరము భావప్రకాశకము కాదు. కొన్నిపదముల సొగసుగ పోహళించి భావముల కుప్పలగొనజేయుచు రసముచిప్పిల జేయుట ప్రతిభాశిల్పము. 'మిసిమిపరసీమ వలరాజు మేనమామ' ''వేవెలుంగులదొరజోడు రేవెలుంగు'' ''తుణతుణముల్ జవరాండ్రచిత్తముల్'' ''అచట పుట్టిన చిగురుకొమ్మైనచేవ.'' వీని యందు పదపరికరము స్వల్పము, అర్థము నిబిడము. కాళిదాసాది కవులు దీర్ఘసమాసముల జోలి కేగక అల్పపదముల మూలముననే రస ముప్పతిలజేయ సమర్థులు. అర్థగాంభీర్యమునకు మాటతేట దనము వన్నియపెట్టును. పెద్దనగారి శిరీషకుసుమపేశల సుధామయోక్తులు రసోద్దీపకములు. ప్రారంభదశయం దున్న కవికి బదజాలముపై నుండు మోజు కృతహస్తున కుండదు. అర్థగౌరవము నకు దగిన పరిమితశబ్దప్రయోగముచేతనే మహాకవులు తమ రచన కొనసాగింతురు. నైఘంటికములగు పదముల జోలికి ప్రావడిన మాటల పొంతకు వారు పోనేపోరు.

ప్రబంధలక్షణైకదేశమగు వర్ణనాబాహుళ్యమునకు బెద్దనయే యొరవడి పెట్టెనని కొందఱందురు. కాని నన్నిచోడ, నాచన సోమన లంతకుమున్నే యీమార్గము నేర్పఱచిరని మనము గమనించవలెను. మఱి పెద్దనకు ప్రబంధరచనాగురుత్వ మెటుల యంటు నన్నచో నావర్ణనలు సప్రయోజనములుగ చేయుటవల్ల

ననవలయును, కవికాలమునాటి సాంఘికాచారములను, అప్పటి నడత, నాగరికములను, సంస్కృతిని ప్రతిబింబించు వర్ణనలు పెద్దన రచనలయం దధికముగ జూపట్టును. 'రాయలనాటి రసికత' యని అనంతకృష్ణశర్మగారీవిషయమును వివరించిరి. ఆనాటి యాచార వ్యవహారములను, వేషభాషలను మనుసంభవకావ్యముచే మన మూహించుట కెంతేని ఆస్కారము గలదు. ఆనాడు 'పసిడివ్రాత చెఱంగు మిసిమితోప జెలంగు నరుణాంశుకోత్తరీయము ధరించుట' ఆచార మయియుండవచ్చును. అందుచే కావ్యమున వర్ణితము లగు వస్త్రాభరణ లేపనాదులు ఆకాలపు అలవాటులని స్వీకరించ వలయునేగాని కావ్యమునందలి పాత్రల స్వభావముల చిత్రించు చున్నవని భావింపనక్కఱలేదు.

పెద్దన తిక్కనాదుల ననుసరించెనని యంటిమిగదా. కొన్ని కొన్ని యుదాహరణముల జూతము.

"ఆతడు భూరిప్రతాప మహాప్రదీపదూర విఘటితగర్వాంధకార
వైరివీరకోటీరమణి ఘృణివేష్టితాంఘ్రితలుడు కేవలమర్త్యుడె
ధర్మసుతుడు (భా)

అతిశితకృపాణకృత్తమత్తాది వీరమండలేశసకుండలమకుట నూత్నమస్తమాల్యపరంపరామండనార్చితేశ్వరుండగు నారసింహేశ్వరుండు; మరియు పాత్రల ఆంతరప్రవృత్తిని దెల్పుబాహిరరూపమును అలతియలతి పలుకులచే తిక్కన పెద్దన లెట్లు ప్రదర్శించిరో చూడుడు :

సీ॥ ముదమున నెలమి సొంపొదవి నెమ్మొగమున
దోపంగవచ్చిన, ద్రోచిత్రోచి
అలి సల్లసిల్లుచు, లలితలోచనదీప్తు
లడర సుంకించిన నాగియాగి
సంతసంబున చాలికములగు చెయ్వులు
దొడరజూచిన జేయ, దడిగియడిగి
మనమున మల్పుపై మాట నాలుకపై రా
గడగిన నాడక, కడపికడపి

గీ॥ ధీరయై యిల్లు సమ్మద, పూరమునను
గలితవమును బలితంపుగట్టు వెట్టె
వెలది యెఱుగని యదివోలె, వికృతిలేక
యల్ల నెప్పటియట్టుల, యరుగుటయును. (భా)

సీ॥ కొనసాగి కామినీగోష్ఠి ప్రౌఢములైన
యుదుటుజూపుల తెప్ప, తుదలనాచి
సంతసంబున ముఖాబ్జమునందు జిఱునవ్వు
కందళింపక యుండ డిందుపఱిచి
పొంగారుమై దోచు శృంగారచేష్టల
తమిదెచ్చికోలు మాధ్గ్యమున డాచి
పొడము రసావేశమున వచ్చు నర్మోక్తు
లాదిని నాలుకను రాకుండ గ్రుక్కి

గీ॥ మస్తకము వాంచియునురని మానముద్ర
నేల బొటవ్రేల వ్రాయుచు, నిలిచి కొంత
సేపు వెడవెడ చింతించి, శిర సొకింత
యెత్తి సన్నంపుబెలుగుతో, నిట్టులనియె. (మను)

మార్కండేయ పురాణమునుండి గాథనుస్వీకరించినటులనే పద్యముల యెత్తుగడలను భావములను గూడ బెద్దన స్వీకరించెను.

ఉ॥ ఈ సుకుమారు డెవ్వడొకొ, యిందుల కెందులనుండి వచ్చెనో
భాసురరూపకాంతిజిత, భావజచంద్రు డితండురాగ లీ
లాసరసత్వ మొప్ప గడులాలసుడై ననుజూచినేని చే
జేసిన పుణ్య మెవ్వరును, జేయరు కాముని దక్క నేలుదున్.
(మార్కం)

ఉ॥ ఎక్కడివాడొ, యక్షతనయేందు జయంతవసంతకంతులం
జక్కదనంబున గెలువజాలెడివాడు మహీ సురాన్వయం
బెక్కడ, యీ తనూవిభవ మెక్కడ, యేలని బంటుగా మదిన్
డక్కగొనంగరాదె యకటా నను వీడు పరిగ్రహించినన్. (మను)

తే॥ అనఘ మందారవిద్యాధరాత్మభవను ననువిభావసియం(డ్రు). (మను)

తే॥ అనఘ మందార విద్యాధరాత్మజన్మ నే విభావసి యనుదాన.
(మార్క)

మరియు 'తీర్థసంవాసు లేతెంచినారని విన్న' అను పద్యమునకు మార్కండేయ పురాణము నందలి 'అతిథి జనార్చనాభిరతుడై చరియించుచు శైలకాననాంచిత సకలావనీతల విశేషము లెల్లను గన్గొనగ మతి గడుగోరుచుండు'' అను మార్కండేయ పురాణమునందలి పద్యమే మూలము.

శ్రీనాథుని గీర్వాణ రచనలకు జొక్కి తన రచన నెటుల కొన్నియెడల సంస్కృతభూయిష్ఠము గావించెనో చూడుడు :

మ॥ పవమానప్లవమాన పంకజరజః పాళీపిశంగచ్ఛవీ
భవదభ్యర్ణ వికీర్ణ తీర్థసరిత్ప్రోథ స్సరంగాహతం
దర పాషాణ వితర్ది కాతలమునన్ శాలీక పుత్రాత్ములు
త్సవ మొప్పన్ విహరించుచున్ సరసవాచాప్రౌఢిమల్ మీఱగన్

(మను)

మఱియు శృంగార నైషధమందలి-

శా॥ శ్రీరామాకుచమండలీమృగమద శ్రీగంధసంవాసిత
స్ఫారోదారభుజాంతరుండు ధరణీసంశ్లేష సంభావనా
పారీణుండు కృతార్థు జేయు కరుణాపాథోధి పద్మాక్షు డిం
పారం మామిడి పెద్దమంత్రి సుతు సింగామాత్య చూడామణిన్.

అను గ్రంథారంభమును మనసునం దిడుకొనియే పెద్దన ''శ్రీవక్షోజకురంగనాభ మెదపై'' అను పద్యముతో తన కావ్యము ప్రారంభించియున్నాడు; మనుచరిత్రకథ యంతయు నించుమించు భ్రమప్రమాదములతో గూడినది కావున మహాకవియగు పెద్దన యీ పద్యమున వట్టిభ్రమకు దావుకల్పించి కావ్యారంభసూచన మొనర్చెను. నైషధపద్యముల బోలిన మఱికొన్ని పద్యములు-

సీ॥ నలిన సంభవు వాహనము వారువంబులు
కలము సాములు మాకు, కువలయాక్షి
చదరెటి బంగారు, జలరుహాంబుల తూండ్లు
భోజనంబులు మాకు, బువ్వబోడి

సత్యలోకముదాక, సకలలోకంబులు
నాటపట్టులు మాకు నబ్జవదన
మధురాక్షరములైన, మా మాటలు వినంగ
నమృతాంధసులు యోగ్యు లనుపమాంగి

గీ భారతీదేవిముంజేతి పలుకుచిలుక
సమదగజయాన సబ్రహ్మచారి మాకు
వేదశాస్త్రపురాణాది విద్యలెల్ల
దరుణి నీయాన ఘంటాపథంబు మాకు (శృంగా)

సీ చిన్నివెన్నెలకందు వెన్నుదన్నుసుధాబ్ధి
బొడమిన చెలువతోబుట్టు మాకు
రహిపుట్ట జంత్రగాత్రముల వాలిక గరగించు
విమతగాంధర్వంబు విద్య మాకు
ననవిల్తు శాస్త్రంపు మినుకు లావర్తించు
పని వెన్నతోడ బెట్టినది మాకు
హయమేధరాజసూయము లనబేర్పడ్డ
సవనతంత్రంబు లుంకువలు మాకు

గీ గనకనగసీమ కల్పవృక్షముల నీడ
బచ్చరాచట్టుగమి రచ్చపట్టు మాకు
బద్మసంభవ వైకుంఠ భర్గసభలు
సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర (మను)

'త్ర్యంబకాచల కన్యకాంబుపూరంబుల నఘమర్షణస్నాన
మాచరించి" (కాశీ)

సచ్ఛాత్రుడగుచు నిచ్చలు నేగి యద్యేట నఘమర్షణస్నాన
మాచరించి" (మను)

నిద్ధమైన మడుంగు నీర్కావిధోవతి గనకమేఖలతోడ
గటిఘటించి' (కాశీ)

"సరిలేని రాకట్టుజాళువా మొలకట్టు బెడగురు నీర్కావి
పింజతోడ' (మను)

"ఓ మిహిరాంశువంశకలశోదధిపూర్ణశశాంక" అను శ్రీనాథుని
పద్యపాదమే "ఓ చతురాస్యవంశకలశోదధిపూర్ణశశాంక"

యని పెద్దన నోట దొరలినది ఇటులనే పినవీరభద్రుని రచనల ననుకరించె ననునది పరిశీలించితిమి

ఇటుల శ్రీనాథుని కన్ని యెడ్లలను ఋణపడియుండియు ఆ కవిసార్వభౌముని కవితాభాండారమునుండి స్వేచ్ఛగా జారగొనియు పెద్దన యెందుచేతనో పూర్వకవిస్తుతి చేయుటలో శ్రీనాథుని పేరైన ఎత్తలేదు కవిత్రయమునుమాత్రమే స్తుతించెను నాచన సోముని రచనల ననుకరించిన ఘట్టములును గలవు వర్ణనాత్మకమైన వస్తుకవిత సోముని సొమ్ము వర్ణనాప్రధానమైనది ప్రబంధము మనుచరిత్రమం దెల్లెడ వర్ణనవైచిత్రియే వెల్లివిరియుచున్నది అట్లయ్యు సోమనాథునిని గూడ పెద్దన నుతింపడాయెను అట్టిచో —

మ భరమై తోచు కుటుంబ రక్షణకుఁగా బ్రాల్మాలి చింతన్ నిరం
తరతాళీదళ సంపుట ప్రకర కాంతారంబునం దర్థపుం
జరవాటుల్ దెగికొట్టి తజ్జ్ఞ పరిషద్విజ్ఞాత చౌర్యక్రియా
విరసుండై కొఱతంబడుం గుకవి పృథ్వీభృత్సమీపక్షితిన్

అని కుకవినిరసన మాత్రము చేసినాడు పూర్వకవుల గ్రంథము లందలి భావములనేకాక పదములనేకాక పద్యపాదములనే గ్రహించిన పెద్దన ఇటుల కుకవినింద సేయుట చింత్యము ఇటుల పరుల రచనలనుండి శబ్దభావాదుల గ్రహించుట చౌర్యగుణ మని సందేహము పొడముట సహజము ఈ విషయము రాజశేఖరుడు తన కావ్యమీమాంసయందు చర్చించినాడు పరకవి ప్రయుక్తంబులగు శబ్దార్థములను స్వగ్రంథమున గూర్చుటయే కారణము హరణము పరిత్యాజ్యమనియు అనుగ్రాహ్యమనియు ద్వివిధము ఇందు శబ్దహరణమే మొత్తమున పద, పాద అర్థ వృత్త ప్రబంధాదులనుండియైన భేదములవలన నైదు తెఱంగులగుచున్నది ఇందు ఏకపదహరణ మంత దోసము కాదని యందురు మూడు మొదలుకొని పైగా అశ్లిష్టములగు పదములున్ననే హరణ మగు నను వాదము కలదు కాలాతిపాతమగు

కొలదియు పురుషుని చౌర్యము సమసిపోవుచున్నది. పుత్రపౌత్రాదులు తన మాటల ననుకరించుచుందురు. ఈ వాక్చౌర్యము క్రమముగా శీర్ణమగును. ఉల్లేఖవంతమగు పదసందర్భము హారణము కాదు. అది స్వీకరణమగును. భిన్నార్థములను, పాదములను ఏక పాదముతో నన్వయించుట హారణముకాదు. వాక్యమును అన్యార్థము వచ్చునటుల వ్యాఖ్యానముచేయుటకూడ స్వీకరణముగాని, హారణముగాని కాజాలదు. కాని పరకీయమగు దానిని తన దానినిగ జెప్పుచు ఇతర కారణములవలన నాలపించుట కేవలము హారణముమాత్రమే కాక దోషోదాహరణముగూడ నగును. ఐతే నితరులు చెప్పినదానిని మూల్యమునకు గొని తనగ్రంథములో జేర్చుకొనుటయు హారణమే యగును.

సభాపతి యన్ననో ఉపజీవుడు, ఉపజీవకుడు అను భేదములచే ద్వివిధముగ నుండును. ఉపజీవనమాత్రాన దోషమేదియు లేదు. ఏలనన ఎల్లవారును ఇతరులవలననే వ్యుత్పన్నులయ్యెదరు. కనుక అనేకగ్రంథములలోగల విషయములు తమ గ్రంథములో దొరలినంతమాత్రమున హారణమనిగాని, స్వీకరణమని అనుటకు వీలులేదు. కొన్ని యెడల అర్థాంతరములలో గూర్చిన అనుకరణోక్తులు బయల్పడక రసములొలుకుచుండును. ఇట్టివి హారణమునుగూడ హరించునవని పండితులమతము. చౌర్యములేని కవిగాని, వక్తకుడుగాని లేడు. శబ్దార్థములలో నూత్న విశేషములను కనిపెట్టువాడును, ప్రాచీనసూక్తులలోగల వైశిష్ట్యమును కొంత అపేక్షించువాడును నగువాడే మహాకవి యనదగు. అర్థహారణమున నాలేఖ్యప్రఖ్యాతిభేదముల విశదీకరించిరి.

శ్లో॥ శబ్దార్థహారణోపాయాః ద్వాత్రింశ దుప దర్శితాః
హానోపాదానవిజ్ఞానే కవిత్వం తత్ర సంప్రతి ”

శ్లో॥ కించైతే హారణోపాయాః జ్ఞేయా స్సప్రతియోగినః
అర్థస్య వైపరీత్యేన విజ్ఞేయా ప్రతియోగితా॥

(పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారి అనువాదము)

కనుక పూర్వకవుల రచనలనుండి అలవోకగా అక్కడక్కడ స్వీకరించుట దోషముకాదు. ఒక భాషనుండి మఱొక భాషలోనికి అనువదించునపుడు అర్థహరణము దోషము కాదుకదా. అటులనే కవిసమయనిబద్ధములగు నలంకారముల వాడుటయు దోషముకాదు. అసాధువులైనను ప్రఖ్యాతపూర్వకవుల ప్రయోగములను స్వీకరించి వాడుచున్నారు. పెద్దన తన గ్రంథమున తత్పూర్వకవిరచనలు నలవోకగా అనుకరించినను, అనుసరించినను, స్వీకరించినను, ఆ మహాకవిరచనాశక్తికి లోపములేదు. ఆత డిందు స్వతంత్రముగా జూపిన రచనానైపుణ్యము, కల్పనాప్రౌఢిమ మునుబట్టి చూడగా, నవి విస్మరణవశమున, అప్రయత్నముగ కవికి తెలియకయే దొరలినవేగాని, యశక్తిచే ఉద్దేశపూర్వకముగ తెచ్చుకొనినవి కాదనుట విజ్ఞుల కెల్లరకు తెల్లమగును. ఈకవి భారతాదిపురాణములను విశేషించి శ్రీనాథుని కృతులను జక్కగా చదివియే తన ప్రబంధరచన సాగించినాడనిగదా యంటిమి. అందుచే గురుస్థానముననున్న భారతకవుల శ్రీనాథాదుల పోకడులు కల్పన లందందు మనుచరిత్రమునందు దొరలుటలో వింత లేదు. ఇంతమాత్రమున పెద్దనకు శబ్దభావహరణదోషము నాపాదింపరాదు. సంస్కృత "బాణోచ్ఛిష్టం ఇదం జగత్" అనునటుల భారతాది మహాగ్రంథస్థములగు శబ్దములు ప్రయోగములు కవులకు శిరోధార్యములు, అనుకరణీయములు.

కవి లోకజ్ఞుడు, సర్వశాస్త్రపారంగతుడు కావలయును. అతడు ధర్మశాస్త్రనిర్ణేత. పెద్దన శ్రోత్రియధర్మములతో నైతిక ధర్మములను తన కావ్యమున నెటుల ప్రతిపాదించెనో యటులనే కథాసందర్భము ననుసరించి ఆయుర్వేదశాస్త్రవివిధాంగ విశేషములను సంగీతశాస్త్రరహస్యములను సూచనాప్రాయముగ ననుసంధించెను. స్వరోచి "తేజం బబ్బభవాండ గేహమునకున్, దీపాంకురచ్ఛాయమై రాజిల్లం గ్రహపంచకంబు రవి చేరన్ బోని

లగ్నమున జన్మించె'' నని చెప్పుటలో పెద్దన జ్యోతిషశాస్త్రపరిజ్ఞానము తెలియుచున్నది

తే. కాయబాలగ్రహోర్ధ్వాంగకములు నాల్గు
శల్యదంష్ట్రాజరావృషసంజ్ఞ నాల్గు
నైన యష్టాంగకము రావు లార గల్గు
వైద్య మెనిమిది నెలల సర్వమును నేర్చి

వైద్యశాస్త్రమునందు తనకు గల పరిచయమును ఋజువు చేసినాడు సంగీతశాస్త్రమందు సమగ్రజ్ఞాన ముండినటుల ఈ పద్యము వలన తెలియును

శా. వాలారుం గొనగోళ్ల నీ వలసతన్ వాయించుచో నాటకన్
మేళంబైన విపంచి నిన్న మొదలున్ నీ కంటమిం జేసి యా
యాలాపంబె యవేళ బల్కెడు బ్రభాతాయాతవాతాహతా
లోల త్తంత్రులమేళవింపగదవే లోలాక్షి కేళాక్షికిన్

వసంతర్తు సంధిసమయమున హిందోళంబును బాడిరి బృందారకసతులు విరహబృందార్తిగ'' అని పెద్దన వర్ణించెను శ్లో॥ శిశిరస్య వసంతస్య సంధౌ హిందోళరాగకః అను ప్రమాణముచే హిందోళరాగము వసంతాదియందు బాడిరని చెప్పిన కవికి సంగీతశాస్త్రమునందు పరిపూర్ణ పరిచయ ముండుననుట నిస్సందేహము పెద్దన పక్షుల ప్రకృతి నెంత నిశితదృష్టితో పరిశీలింపగలడో స్వాభావికముగ జిత్రింపబడిన యీపద్యమున విశదము.

చ. పలుకులు నేర్పువేళ గల భాషిణి నీ విటులుండ బంజరం
బుల నరగన్ను వెట్టి ముఖముల్ చరణాగ్రనఖాళి గోకుచున్
నిలుగుచు నావులించుచు వనీవిహారోత్కర మెట్లు వల్కె న
ప్పలుకులె యట్టులెత్తి విని పల్కెడు వింటివె కీరశారికల్.

లోకోక్తులు సందర్భమునుబట్టి వాడబడినవి అవి యన్ని యెడల భావస్ఫూర్తి గలిగించినవిగ నున్నవి 'గుంటడా దాచిన పెండ్లి యేమిటికి జిక్కెన్'' 'కంటన వత్తిబెట్టుకొని,'' వ్రతము చెడ సౌఖ్యమైన గలుగవలయు'' రెంటికిం జెడిన రేవడి'' మొద

లగునవి పెక్కులు గలవు పెద్దన రసభరితముగ రచించిన పద్య పాదములు తరువాతివారికి సామెతలుగ పరిణమించినవి 'అచట బుట్టిన చిగురుకొమ్మైన చేవ' క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్' తామరసనేత్రలిండ్ల బందాలు కారె' వనిత తనంత దా వలచివచ్చిన చుల్కనగాదె యేరికిన్' వెన్నవలెం గరంగు అలివేణుల గౌగిట జేర్చు భాగ్యముల్' పెద్దన అన్యదేశ్యంబుల వాడుటకు సందేహింపలేదు కాలము మారినకొలదియు నన్య భాషాసంపర్కమున రాజకీయముగ కొన్ని మాటలు క్రొత్తవి భాషయందు జొచ్చుట సహజము దినదినము భాష ప్రవర్ధమాన మగుచుండును అన్యదేశ్యంబుల మొట్టమొదటగా తన కావ్యముల వాడినవాడు కవిసార్వభౌముడగు శ్రీనాథుడు శ్రీనాథుని పెక్కుయెడల ననుకరించిన పెద్దన ఈ విషయమునగూడ ననుసరించెను హాలరుమంచి పైతాణపుసింగిణి మొదలగు పదముల నెన్నిటినో వాడెను అది యటులుండ 'ఇంతలు కన్నులుండ' 'కైతవ కుసుమ శరాసన' 'చందనమువంటి మేను మధ్యదినాతపోష్మహతిగందె వడదాకి' ఇటుల సాభిప్రాయముగ వరూధిని పలికినంతట 'ఏ పాపము నెఱుగని శ్రోత్రియప్రవరుడు భీతహరిణేక్షణ' 'అండజయాన' అను పదములు స్త్రీ పర్యాయమాత్రముగ వాడినను, వరూధిని వానినిగూడ సాభిప్రాయముగ నెంచిభ్రమించుటచేవరూధినీప్రవరుల సంవాదఘట్టము రసవత్తరమైనది కొందఱు పెద్దన ఈ పదములు వాడుటలో పొరపడి యనౌచిత్యదోషమునకు పాల్పడె ననిరి మఱికొందఱు ప్రవరున కీషన్మాత్రముగ నైన శృంగారరసచ్ఛాయలు హృదంతరాళమున నుండెననుట నివి సూచించుచున్నవందురు కాని పూర్వకవులు స్త్రీకి పర్యాయపదముగా శృంగారభావస్ఫురణములగు పదములనేకములవాడుట కలదు నన్నయభట్టారకుని భారతరచనమున గరుత్మంతుడు తల్లిని 'అంభోరుహాననా' అని సంబోధించిన సందర్భమున సామాన్యార్థమునే చెప్పుకొనవలయును గాని వేఱుగ భావించుటతగదు

కదా. ఇంతకు పెద్దన యిచట ప్రవరునిచే నమాయికముగా నట్లు పలికించి కథను రక్తికట్టించుట ప్రశంసనీయమేయని చెప్ప వలయును.

పెద్దన శైలి అలంకారశోభితము. శబ్దాలంకారములు సరసముగ తగుచోటుల నతకబడి కావ్యకన్యకు శోభగలిగించినవి. పద్యముల భావవైచిత్ర్యము పిక్కటిల్లును. ఈ కావ్యము చదివిన వారికి పెద్దన సర్వతోముఖపాండిత్యము, చతుర్విధకవితావిలాసము, లోకజ్ఞత, బహుభాషావైదుష్యము, సకలశాస్త్రసమ్యగ్జ్ఞానము, కల్పనాచాతుర్యము, భావుకత్వము ప్రకటితమగును. ఈ గుణ ముల నన్నిటి క్రోడీకరించి ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు "శైలియందు దీనిని మించిన ప్రబంధమింతవఱకు పుట్టలేదు. ఆడం బరము లేని గాంభీర్యము, సౌమ్యమైన ప్రభావము, ఉద్వేగము లేని శీఘ్రగమనము, పేలత్వము లేని స్వాభావికత, వెలితి లేక నిండారి, మెరుగులుదీరిన పదగుంభనము ఈ కావ్యశైలికి ముఖ్య లక్షణములు. ఇన్ని గుణము లొక్కచో రాశీభూతమై ఆవిర్భ వించిన మొదటి ప్రబంధమగుటచేతను, తరువాతి ప్రబంధకర్త లెల్లరు బుద్ధిపూర్వకముగనో, అప్రతర్కితముగానో దీనిని అనుక రించుటచేతను ప్రబంధకవులలో పెద్దనార్యునకు అగ్రస్థానము సంక్రమించినది" అని సెలవిచ్చిరి. పెద్దనయే తన కవితామత మును "పూతమెఱుంగులుం బసిడిపూత మెఱుంగులు" అను ఉత్పల మాలికలో స్పష్టీకరించి "పెద్దనబోలు పండితులు పృథ్విని లేరని నీ వెఱుంగవే పెద్దన కీదలంచినను పేరిమి నాకిదు కృష్ణరాడ్విభూ" అని నిండుసభలో గండపెండెరమును రాయలచే నందుకొనెను.

మనుసంభవగాథకు ప్రధానములగు వరూధినీ ప్రవరుల పాత్రలను, స్వారోచిపాత్రను పెద్దన పోషించిన విధము జూచితిమి. పెద్దన అప్రతిమానప్రతిభ గమనించితిమి. అవి యన్నియు సజీవ పాత్రలు. ప్రధానపాత్రలతోపాటు కథాకథనమునకు ముఖ్య మగు పాత్రలు మఱిరెండుగలవు. ఒకటి సిద్ధుని పాత్ర. రెండ

వది మనోరమపాత్ర వరూథినీప్రవరుల సమాగమ హేతువు ప్రవరుని తీర్థాభిలాష ఆ యభిలాష నెఱవేఱుటకు మార్గము జూపినవాడు సిద్ధుడు అటులనే స్వారోచిబహుభార్యాత్వమునకును వివిధములగు శక్తులు విద్యలరూపమున వానికి గలుగుటకును మూలకారణము మనోరమ సిద్ధుడు లేకున్న ప్రవరుని తీర్థయాత్రాభిలాష నెఱవేఱియుండదు అది నెఱవేఱనప్పుడు కథకంతకు బీజమగు వరూథినీప్రవరుల కథయే యుండదు అటులనే మనోరమను రక్షించి వివాహమాడుటయే లేకున్న అస్త్రహృదయాదివిద్యలు స్వారోచికి సంక్రమించెడివి కావు విభావసీకళావతులను భార్యలుగ బొంది వారివలనగూడ విద్యల స్వారోచి బడయుట తటస్థించియుండదు ఈ విద్యలన్నియు లేకుండ స్వారోచికథ రాణించెడిది కాదు ఇది లోపించిన మనుసంభవమే లేదు స్వారోచిమనుసంభవము మహత్తరరసమయ ప్రబంధముగా రూపొందియుండెడిది కాదు ఈ పాత్రల మూలగ్రంథమునుండియే స్వీకరించినను, వానిని పరిపోషించుటలో పెద్దనజూపిన నేర్పు గమనార్హము

సిద్ధుని రంగప్రవేశమునకు ప్రస్తావనగా పెద్దనగారు ప్రవరుని గుణశీలముల వర్ణించుట అను అవకాశము గల్పించుకొని "తీర్థసంవాసు లేతెంచి నారని విన్న—తీర్థసందర్శనాభిలాష మాత్రమనుప్పొంగ నత్తరుణాగ్నిహోత్రి" అభ్యాగత సేవాపరతంత్రసకలజీవనుడయి భూదేవకుమారకు డున్నటుల వర్ణించెను ఈ ప్రస్తావనానంతరము సిద్ధుని ప్రవేశపెట్టుచు నతని రూపము వేషధారణము నతిస్వాభావికముగ జిత్రించి పాఠకులయెదుట సిద్ధుని సాక్షాత్కరింపజేసినాడు సిద్ధుని జూడగనే అతనికి వలయుసపర్యల నడపి తన్మహిమ నొగ్గడి పిదప దన హృదయమందున్న దీర్థయాత్రాభిలాష ప్రేరేపించగా మానినాథకుటుంబ జంబాలపటలమగ్న మాదృశగృహమేధిమండలంబు నుద్ధరింపంగ నౌషధమొండు గలదె యుష్మదంఘ్రిరజోలేశ మొకటిదక్క అని పొగడినాడు ఈఘట్టమున ప్రవరుని వినయానుసంధానము భక్తి

తిశయమును తీర్థయాత్రలయందు కాంతియు, భాషాచమత్కృతితో హృద్యముగ చిత్రింపబడినవి. తైర్థకావళి తీర్థసేవ అను సిద్ధుని మాటల నూతగాఁ గొని ప్రవరుడు తీర్థయాత్రల ప్రసంగము దెచ్చి

"ఏయే దేశములన్ వసించితిరి మీ రేయే గిరుల్ చూచినా
రేయే తీర్థములందు గ్రుంకిడితి రేయే ద్వీపముల్ మెట్టినా
రేయే పుణ్యవనాళి ద్రిమ్మరితి రేయే తోయధుల్ డాసినా
రాయా చోటుల గల్గు వింతలు మహాత్మా నా కెఱింగింపరే॥ అని

"పోయి సేవింప లేకున్న బుణ్యతీర్థ మహిమ వినుటయు నఖిలకల్మష హరంబు" కదా యని యజనయోక్తిచాతుర్యధుర్యంబుగా ప్రవరుడు సిద్ధుని ప్రార్థించినాడు. దీనివలన ప్రవరునకు సిద్ధునియందు భక్తివిశ్వాసము లుండెననుట విదితము. సిద్ధుడు మోసగాడును, గృహస్థుల నిచ్చకపుమాటలచే వంచించి పొట్టగడుపుకొనువాడును కాడనియు ప్రవరునివంటి లోకజ్ఞులగు గృహస్థుల విశ్వాసము చూరగొనినవా డనియు సువిదితము. సిద్ధుడు నయ్యైచోటుల గల యయ్యైయాద్భుతంబుల నీశ్వరానుగ్రహంబున నల్పకాలమున గనుగొంటి నని నుడువ ప్రవరున కాశ్చర్యముచే హాసముజనించినది. అనగా మోము విప్పారిన దనియే యిచట గ్రహింపదగును గాని అపనమ్మకముచే నవ్వుపుట్టిన దన రాదు. "ఈషదంకురిత హసనగ్రసిష్ణుగండయుగళుం" డనుటలో ప్రవరునకు అపనమ్మకము నంటగట్టి పెద్దలయెడ నవినయదోష మాపాదింప జనదు. అట్లు జనించిన ఆశ్చర్యహాసానుగుణముగా

"తెలియక మీ కొనర్తు నొక విన్నపమిట్టివి యొల్ల జూచిరా
నెలకలుగట్టుకొన్న మఱి యేండ్లును బూండ్లును బట్టుబ్రాయపుం
జెలుతతనంబు మీ మొగము చెప్పక చెప్పదు నద్దిరయ్య మా
కెఱుంగ దరంబె మీమహిమ లీర యెఱుంగుదు రేమి చెప్పుదున్."

అనెను ప్రవరుడు. భక్తిచే వెరపు గలుగుట సహజము. పెద్దలతో మాటలాడునపుడు చనువు [illegible] ంచండి'



Excuse me అను ఉపోద్ఘాతపదములతో ప్రారంభించుట నేటికిని ఆచారముగ నున్నదియేకదా అటులనే వెఱవక యను పదమునకు భావము గ్రహింపవలయును వెఱవక యొనర్చునది ప్రశ్న కాదు విన్నపము అవిశ్వాసముతో జేయు ప్రశ్న కాదు జిజ్ఞాసతో జేయు 'విజ్ఞాపన తన మాటయందు అవినయగంధ మున్నదని సిద్ధుడు శంకించునేమో యని యది వాయుటకై యవియెల్ల దన్మహిమలుగా జెప్పి యబ్బురపడినాడు కొందఱిందు మఱొక యర్థమున్న దందురు సిద్ధుని మాటలయందు ప్రవరున కపనమ్మకము గలిగిన దనియు అందుచే అద్దిరయ్య మా కెఱుగ తలంచె మీమహిమ లీర యెఱుంగుదు రేమి సెప్పుదున్' అనుటలో ప్రవరుని ముఖమున నెక్కిరింత స్ఫురించె నని యనుకొనవలయునట మీమహిమలు మీకే తెలియవలయు మా కేమి తెలియుననుటలో 'నేను నీమాటలు నమ్మను, నీవు గప్పాలు గొట్టుచున్నావు' అను అర్థ మున్న దందురు అద్దిరయ్య' అన్నప్పుడు ప్రవరుని ముఖములోని యాక్షేపణము సిద్ధునకు పూర్తిగ తెలిసెనట సిద్ధుడా అపహాస్యమును గ్రహించియు దేశదిమ్మరిగాన గ్రహించనటుల మాటలాడి బహుశః ఇంకొకపూట భోజన మాసించి కాబోలు–తన మాటయం దవిశ్వాసము జూపిన ప్రవరుని వంచింప బూనియే పసరు అతని పాదముల నిడి దాని మంచిచెడ్డలు చెప్పకయే వెడలెనట అట్టిచో ఆ సిద్ధుడు విశ్వాసహీనుడు తిన్నతిండి అరుగకమునుపే అన్నము పెట్టిన చేతిని కఱచునంతటి కపట సన్న్యాసియైయుండవలయును తనకు జరిగిన అతిథిసత్కారాదులన్నియు మఱచి మాటమాత్రమున ప్రతీకారపరు డగునంతటి దుష్టుడు కావలయును ఇది అసహజము అందును "మీ దివ్యప్రభావం బెఱుంగని నా ప్రల్లదముల్ గుఱించి మునిలోకగ్రామణీ, సత్కృపన్ నను మీ శిష్యుని దీర్ఘయాత్రవలనన్ ధన్యాత్ముగా జేయరే" అని వినయోద్వేలంబుగ ప్రార్థింపబడియు, సిద్ధునకుప్రవరుని మోసము చేయవలయు నని బలవత్తరమైన కక్ష వహింప

వలసిన కారణము గనపడదు దానివలన తనకు గలుగు లాభము లేదు కాన నిటుల సిద్ధునకు దురుద్దేశములు దౌష్ట్యము, మోసము ఆపాదించుట సహృదయ లక్షణము కాదు ఈ కాలమున కపటులగు సిద్ధు లుండవచ్చును వారి వంచనకు లోబడిన వా రుండవచ్చును కాని అటుల మోసగించబడుట ప్రవరునంతటి లోకజ్ఞుడగు పండితునకు సహజము కాదు ఇట్టి సిద్ధులను పరివ్రాజికులను తోడ్తెచ్చి యతిథిసత్కారములు చేయుట యతనికి పరిపాటియేకదా ఇట్టివారి నెందఱినో చూచియుండును

స్వారోచిచరిత్ర ఒక ప్రత్యేక కథగా రూపొందుటకు మనోరమయే కారణ మనవలయును వరూధిని కుమారుడు విశ్వకర్మ నిర్మితపురము రాజధానిగా ఆటవికులకు ప్రభువుగా నుండెను సప్తవ్యసనములలో నొకటియైనను రాజులకు ధర్మముగాన వేటకు వెడలును ఇట వేటవర్ణనమంతయు స్వాభావికముగ నున్నది వర్ణనాత్మకమైన ఈ ఘట్టము ఇంపుగనున్నను కథనడవడికి దోడ్పడక మాంద్యము కలిగించినది ఎంత ఆలంకారిక శైలిలో నున్నను కథను కుంటువడజేయుచున్న సమయమున మనోరమ పాత్ర ప్రవేశము కథకు పునర్జీవనము గలిగించెను. మనోరమ పాత్రయే లేనియెడల స్వారోచిపాత్ర సామాన్యముగ నుండెడిది మనోరమ వాని జీవితము నంతను మార్చినది మనోరమపాత్రను ప్రవేశపెట్టుటలో కవి యొక్క రమణీయదృశ్యము గల్పించినాడు ఆ సుందరవనాంతరమా రంగస్థలమునకు రంగాలంకారముగ నొప్పినది రంగస్థలిని సజ్యకార్ముకుడై స్వారోచియున్నాడు 'విపినాంతరంబున "హా వనిత ననాథ నబల నార్త విన్నపంగావవే" అని నేపథ్యమునుండి వినబడినది రంగస్థలమున నున్న స్వారోచి అయ్యో యే మానిసి కేమి యయ్యెనో యను నుత్కంఠతో వీక్షించుచుండును అప్పుడు మట్టెల్ మ్రోయగ గబ్బిచన్నుగవ గంపంబంద వేణీభరం బట్టిట్టై కటి జిమ్మచీకటులుగా నశ్రువవ్రజంబోడి కల్గట్టం జూపులు చిమ్మ రేగి దివి గోలంబాలి

గల్పింపగా దీనాకృతితో భయశోకముల వెక్కుచు మెయిగల విలాసవిభ్రమాదిచేష్టలు లేకుండుట ఒక యొప్పిదముగా దోచు చుండ స్వరోచి యెదుటకు వచ్చి

కం॥ పలుచని వాతెఱమెఱుగున
బలు మెఱుగులు సందడింప బాపటపై నం
జలి జేర్చి జలజాక్షుల
బలుకుల బులకండ మొలక బలికెం గలకన్

ఎంతటి సుందరదృశ్యము నాటకీయరచన యన వేఱుగ నుండునా? ఈ రసవత్తరప్రవేశముతో కథకు కదలిక కలిగినది అంగరసములుగా పోషితములైన వీర రౌద్రభీభత్స భయానకరస ముల కుద్దీపనము లనదగు సందర్భములకు నవకాశము లేర్పడినవి మనోరమ తానెవరో చెప్పినది తనచెలికత్తె లెవరో చెప్పినది తన దీనావస్థ నెఱిగించినది దానికి కారణము జెప్పినది రాక్ష సుని బాధనుండి రక్షింపుమని ప్రార్థించినది తనకు గురుపరంప రగా లభ్యమయిన అస్త్రహృదయ విద్యను తననుండి స్వీకరించి తనను మ్రింగవచ్చు రక్కసుని పరిమార్చు మనినది స్వరోచి మారుమాట చెప్పలేదు అస్త్రహృదయ విద్యను స్వీకరించినాడు రక్కసునితో ఘోరరణ మొనర్చినాడు వానిని తన దివ్యశరా ర్చిని దగ్ధముజేయుటలో శాపోపహతుడైన ఇందీవరాక్షుడు శాప విముక్తుడయినాడు అతడు తన మేనమామయని ఎఱిగి స్వరోచి యాశ్చర్యమందినాడు

మనోరమా స్వరోచుల సంభాషణ సుదీర్ఘమనిపించును ఆప దలోనుండి రక్కసునిచే తఱుమబడుచు భయకంపితయైనస్త్రీయంత సావధానముగ తన వృత్తాంతములు చెలికత్తెల వృత్తాంతమును చెప్పుటఅసహజము వెంటతఱుముచున్నరక్కసుడు ఈసంభాషణ జరుగునంతవఱకు రాకయుంటయు అసహజము ఇట్టి సందర్భమునే పింగళి సూరన తన కళాపూర్ణోదయ కావ్యమున కల్పించినాడు అభినవకౌముదిని శల్యాసురుడు వెంటాడును ఆమె భీతచేతస్కయై

భృగుపాతయత్నమున నున్న మణికంధరుని జేరి రాక్షసుని దును మాడు మని ఒక కత్తిని అతని చేతిలో పెట్టును. తా నెవరో చెప్పదు. ఆ కన్య యెవరో మణికంధరు డెఱుగడు. ఆ వచ్చు దైత్యు డెవరో తెలియదు. తెలిసికొన యత్నింపడు. శరణాగతరక్షణము శూరధర్మ మని భావించి శల్యాసురుని మార్కొని వానిని సంహరించి వానిచే మరణించును. ఇందు ఔచిత్య మున్నది. కథ నడకకు మాంద్యము కలుగలేదు. ఇచట మనోరమ సుదీర్ఘముగ తన చరిత్రను చెప్పుటవలన కథాకథనమునకు మాంద్యము ఘటిల్లుటయే కాక, ఈ కథయంతయు వినునంతవఱకు నార్తరక్షణమున కుద్యమింపమిచే స్వరోచిశౌర్య మంతగా శోభించి నదియు కాదు.

మనోరమవలన అస్త్రహృదయవిద్య గ్రహించిన స్వరోచి తనచే శాపవిముక్తుడైన మేనమామవలన ఆయుర్వేదశాస్త్రము వరణముగా గ్రహించి మనోరమను భార్యగా స్వీకరించినాడు. మనోరమ ప్రేరణమున ఆపెకోర్కెను మన్నించి, ఆ పె చెలిక త్తెలగు విభావసీకళావతుల రాజయక్ష్మరోగ బాధావిముక్తుల జేయుటయే గాక వారు తెచ్చిన విద్యలను కట్నములుగా వారిని వివాహ మాడినాడు. తన భార్యల మువ్వురరయం దిష్టభోగరతుల ననుభవించి పుత్రుల గాంచినాడు. వారి వలన వచ్చిన విద్యల వలన పునీతుడైనాడు. వీని కన్నిటికి మూలహేతువు మనోరమ. సర్వకళలందు రమించుటచే మనోరమ యని సార్థకనామము దాల్చిన ఆ యువతి హేతువున స్వరోచి సర్వశాస్త్రకుశలుడయి పునీతుడగుటకు మార్గమేర్పడినది. మనోరమ వృత్తాంతము దీర్ఘముగ చెప్పబడినటులున్నను, అది వర్ణనావైచిత్రి మెఱయ మృదుమధురశైలి నుండి వివిధ రసాన్వితమగుట పఠితల నింపుగూర్చునేగాని విసువు గలిగింపదు. పాత్రిలసృజించి, పోషించి యవసరమునుబట్టి పాత్రైక్యము నంది పెద్దన తన కావ్యమును రసవత్తరము చేయుటలో నప్రతిమాన ప్రతిభావిశేషము జూపినాడు.

మనుసంభవకావ్యమున వాదప్రతివాదములకు మూలమైనది యొక విశేషముగలదు అది సిద్ధాగమనము అతడు కుతపకాలమున వచ్చెను కుతపకాల మనగా పగటివేళ పదునైదవ పదునాఱవ ఘడియల కాలము ఆ కాలమున వచ్చినవాడే అతిథి బ్రాహ్మణ కులస్థు లా కాలమువఱకు మధ్యాహ్నభోజనము చేయరు రెండు ఝాములకు మాధ్యాహ్నికానుష్ఠాన హోమాదులుచేసి కొందఱు అతిథి అభ్యాగతు లెవరైన వత్తురేమో యని కొంత నిరీక్షించు టయు గలదు అట్టి కాలమున సిద్ధుడు వచ్చినాడు సిద్ధుడు భోజనాదులు ముగించినాడు ఆ పూటనే ప్రవరునకు పాదలేపన మిడియుండునని కొందఱు భావించి హిమవంతము చూచుటకు ప్రవరుడాపూటనే పోయియుండునని నిర్ణయించిరి హిమవంతమును జూచిన తరువాత నలినీబాంధవ భానుతప్తరవికాంతస్యందినీహార కందళ చూతార్క పరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నమున్ తెల్పెడిన్' అనుట సందర్భవిరోధమని తల తురు మాయాప్రవ రుని వర్ణించుటలో అర్ధచంద్రుని తేట నవఘళించు లలాటపట్టి దీర్చిన గంగమట్టితోడ'' అనిన పెద్దనగారి మాటల ననుసరించి ప్రవరుడట్టి బొట్టుతోనే వరూధినికి కనబడియుండునని నిర్ధారణ జేయుదురు అంత సందేహముల వెలిబుత్తురు ప్రవరుడు పాద లేపనము ధరించిన తరువాత స్నానము చేయలేదా? చేసినను కాలికి గాయము గలవానివలె కాళ్లు తడియకుండ జేసెనా? స్నానము జేయనియెడల గంగమట్టి లలాటమున నేల ధరించి యుండును? స్నానము చేసినపుడు పాదలేపనము పోయియుండదా? అపుడు పోనిది మంచునీటిచే నెటుల పోయినది? ఈ ధర్మసందేహ ముల వెలువరించి యది యొక ముడియనియు శాస్త్రమర్యాదల తెలిసిన ఒక్క పెద్దనగారికే యా ముడిరహస్యము తెలియుననియు అందుచేతనే దైవకృతమున కిలనసాధ్యంబుగలదె'' అనివ్రాయు టలో చమత్కార మున్నదనియు నందురు వీరు ఇటుల తలంచు టకు ముఖ్యకారణము సిద్ధుడు వచ్చిన పూటనే అనగా ఆ సాయం

కాలమే ప్రవరుడు బయలు దేరియుండునని భ్రమపడుటయే హేతువు. అటుల బయలు దేఱుట సాధ్యమా! బయలు దేరినవాఁ డా రాత్రి యంతయు నెచటనుండెనని యాలోచింపవలయును. ఆంగ్ల భాషా వాసనాలబ్ధ విమర్శకబుద్ధితో నిచట కాలనిర్ణయము చేయుటకు బ్రయత్నింపరాదు. ఆంగ్లకావ్యవిమర్శనమున Unity of Time, Unity of place and Unity of Action అనునవి చర్చించి ఒక దానికి మఱొకదానికి గల పరస్పరసంబంధమును నిరూపింతురు. అది మనసునం దిడుకొని కాబోలు ప్రవరసిద్ధుల సంభావణ మచిర కాలములో జరిగియుండునని భావించియుందురు. భవిష్యత్కాల మున నిట్టి ప్రశ్నలు వేయువారుందురని పెద్దన ఆనాడు భావించి యుండడు. ఈ కాలములో కవులు కొందఱు ఈ కాలనిర్ణయ సిద్ధాంతమును మనసునం దిడుకొని, దీర్ఘకాల సూచకములుగ దీర్ఘసమాసయుత సుదీర్ఘపద్యములనో, ఎక్కువ పద్యములనో వ్రాయుదు మనియు, పరిమితకాలమును సూచించుటకు పొట్టి పొట్టి పద్యముల వ్రాయుదు మనియు, పద్యముల పరిమాణమును బట్టి కాలనిరూపణ మేర్పడుననియు చెప్పుదురు.

వారు ఈ విధముగ తాము తికమకపడి యితరులను తిక మక పెట్టుదురు. అట్టివారు స్వారోచిషసంభవకావ్యమునకు మూల మైన సంస్కృతమందలి మార్కండేయ పురాణమును మారనకృత మార్కండేయ పురాణమునొక మాఱు మఱల జూచుట లెస్స. ప్రవరు డాపూటనే బయలు దేఱుట అసంభవము. కుతప కాలమున వచ్చిన సిద్ధుడు, స్నానభోజనాదులను పూర్తిజేయుటకు కొంత కాలము పట్టును. భోజనానంతరము కొంత విశ్రమించుటయు సహజము. తరువాత నెమ్మదిగ దరిజేరి ప్రవరుడు సిద్ధుని 'యిద్ధర గల్గు వసధిపర్వతసరిత్తీర్థ మహాత్మ్యముల్' దెలియ నడిగి అవి యెంతదూరమో, మార్గమెటులనో చూచుట కెంత కాలము పట్టునో మొదలగు వివరముల నడిగియుండును. అటుల అడుగుట ప్రవరున కలవాటని పెద్దనయే చెప్పెనుగదా. ఇది యంతయు

స్వల్పకాలములో జరుగుట యసంభవము ఒక్కొక్క తీర్థ మహాత్మ్యము వర్ణించి చెప్పుటకు కొంతకాలముపట్టును సిద్ధుడు చాల క్షేత్రములను తీర్థములను వాక్రుచ్చినాడు అట్టిచో క్షేత్రాదుల మహాత్మ్యవర్ణన నేల పెద్దన జేయలేదు అని శంకింతురు కాబోలు వర్ణనాప్రియు డయి సందర్భము తెలియని కవి యటుల జేయునేమో కాని ఔచితి తెలిసిన కవి చేయడు ఈ ప్రబంధము పాండురంగమహాత్మ్యము కాళహస్తిమహాత్మ్యముల వలె తీర్థక్షేత్రమాహాత్మ్యముల చెప్పుట కుద్దేశింపబడినది కాదు ప్రధానమగు విషయము వేఱయున్నదికదా పెద్దన యీ సందర్భమున క్లుప్తముగ వ్రాసినటులున్నను సిద్ధునితో సంభాషణ ఆ రాత్రికూడ చాలవఱకు సాగియుండును సిద్ధు డారాత్రి యచట నే గడపియుండును నిర్మలనిత్యధర్మకర్మదీక్షాపరు డగు ప్రవరుడు ప్రత్యూషపవనాంకురములు పైకొనువేళ లేచి అఘమర్షణ స్నానాది నిత్యకర్మలు జేసినతరువాతనే సిద్ధుడు పాదలేపన మిడి యుంటయు, ప్రవరుడు వెళ్లుటయు సంభవము అందుచేత పాద లేపనము స్నానమువలన పోవుటకాని కాళ్లు తడియునని భయమున పాదములను పైకెత్తి స్నానము చేసియుండునా యను సందేహాము కాని కలుగుటకు ఆస్కారము లేదు కావ్యనిర్మాణమున కాలనిర్ణయ పట్టికయందు వలె ప్రతివిషయము కాలనియమితము చేయుట అసంగతము ప్రాతఃకాలమున స్నానాదులు పూర్తి జేసికొనిన ప్రవరుని లలాటమందలి బొట్టు చెరగలేదు మంచునీటిచే పాదలేపనము కరిగినది

ఈ విషయము మార్కండేయపురాణమునం దెటులున్నదో చూతము అందు ప్రవరుడు సహస్రయోజనానాంహి దినార్ధేవ ప్రజామియల్ ఆయాస్యామీతి సంచిన్త్య తదర్ధేనాపరేణహి'' ఒకదినార్థము సహస్రయోజనములు పోయి యపరదినార్థమునకు దిరిగివచ్చెదనని తలంచి పాదలేపనము పూసికొనిపోయినాడు మారనయు ' నరుడేగు యోజనసహస్రము సాబగలింటిలోపలన్ ''

అని చెప్పినాడు. అందుచే పైన చెప్పినటుల ఆ ప్రవరుడా రాత్రి యంతయు సిద్ధునితో తీర్థయాత్రాప్రసంగమున గడపి మఱునాడు మొదటి పూటనే మంచుకొండ జూచుటకు పోయియుండు నను టయే సహేతుకముగ నున్నది. అటుగాక సిద్ధుడు వచ్చిన పూటనే ప్రవరుడు బయలుదేఱెననుట మూలమునకు విరుద్ధము. ఈ మహా ప్రబంధమునకు ఆంధ్రకవితాపితామహుని ప్రతిభావ్యుత్పత్తులకు, సమయజ్ఞతకుకళంకాపాదనమగును. ధ్వని, కావ్యమునకు ప్రాణము. పాఠకులు కవికృతమగు పద్యముల తఱచిభావము నూహించి గ్రహించవలసినది యుండును. అంతమాత్రమున కొందఱు పెడ దారుల నూహించి కవిహృదయమును సరిగ గ్రహింపక వాదించిన ప్రయోజన మావంతయు నుండదు. అట్టి వితండవాదము ప్రాజ్ఞులను భ్రమపెట్టజాలదు.

ఆంధ్రప్రబంధములకు పండితులచే నిర్ణీతములైన లక్షణము లెంతవఱకు మనుసంభవకావ్యమునకు సమన్వితములైనవో స్థూల ముగ చర్చించితిమి. ఈకావ్యమున వస్త్వైక్యము సిద్ధింపలేద నియు, ఇది ఏకనాయకాశ్రయము కాదనియు, శృంగారరసప్రధాన కావ్యము కాదనియు ఋజువయినది. అయినను మనుసంభవ కావ్యమును ప్రబంధరాజ మనుటకును, నాటినుండి నేటివఱకు, పండితులచే, కవులచే, విమర్శకులచే, మెప్పుబడయుచు, ఆంధ్ర పంచమహాకావ్యములలో ప్రథమస్థాన మాక్రమించుటకు కార ణము, దానియందలి వైశిష్ట్య మేమి? అనునది యాలోచింపదగి నది. వర్ణనావైచిత్రిని, పాత్రచిత్రణపోషణమునను, శైలీమాధు ర్యమునను, ఆలంకారికమైనరీతిని భావవైశిష్ట్యమున గీర్వాణాంధ్ర భాషాపదప్రయోగకుశలతను, ప్రసాదగుణభూయిష్ఠమైన రసవత్తర మహాకావ్య మగుటయే హేతువనవలయును. ప్రబంధములు వర్ణనాప్రధానము లయినవి. మనుచరిత్ర కావ్యమందలి వర్ణనా సంపదను కొంతవఱకు పరిశీలించితిమి. పెద్దనార్యుని ప్రతిభా వైభవము, అనన్యకల్పనాశిల్పము, చతుర్విధ కవితావిలాసము

గమనించితిమి. ఇచట పెద్దన కవితామత మేదియో విచారించుట కొంత యవసరము. సారస్వతప్రియుఁడగు రాయల సభలో "ముద్దుగ గండపెండెరమును, గీర్వాణాంధ్రముల రసవత్తరముగ కవిత చెప్పగలవారికొఱకు నిర్దేశించి పృచ్ఛ చేయగా పెద్దన బోలు పండితులు పృథ్విని లేరని నీ వెఱుంగవే! పెద్దన కీదలంచినను పేరిమి నాఁడు కృష్ణరాడ్ప్రభూ" అని ఆశువుగా 'పూతమెఱుంగులున్ బసిడిపూతబెడంగులు చూపునట్టి వాకైతలు' అని ఎదురు ప్రశ్న వేసికొని కవిత్వమెటు లుండవలసినదియు మాలికగా పెద్దన తన కవితామతమును విపులీకరించినాడు. ఆ మాలికవలన కవితకుండవలసినది కాంతి యనియు, ప్రసన్నత యనియు తేలినది. "రాతిరియున్ బవలు మఱపురాని చెలియార జంపునిద్దాతరితీపులం బలెను దారసిలన్ వలె లోఁదలంచినన్" అని అనుటలో కవిత మఱచిపోదగినదిగాక గాటముగ హృదయమున నాటుకొని, ఆలోచనామృతమై రాత్రింబవళ్ళు కన్నులకుం గట్టినట్లుండవలయు నని పెద్దన యభిప్రాయ మయినటుల గన్పట్టును. ఇటులనే యీ మాలిక కంతకు అర్థము చెప్పుకొనిన పెద్దనమతముప్రకారము కవితయందు మాధుర్య ముండవలయు ననియు తేలును. ఈ పద్య పాదముల జూడుడు.

"డాతొడ నున్న యన్నుల మిఠారపుముద్దులగుమ్మ కమ్మనా
వాతెఱ దొండపండువలె వాచవికావలె బంట నూదినన్.

సంస్కృతమునగూడ "జల్లున జల్లవలెన్ మనోహర ద్యోతక గోస్తనీఫలమధుద్రవ గోఘృతపాయసప్రసారారుచిర ప్రతిమంబుగ సారెసారె." కనుక తెనుగు కవితయందేమి సంస్కృతకవితయందేమి మాధుర్యము గుణముగ నుండవలయు నని తేలుచున్నది. ఇటులనే పెద్దన శ్రావ్యతకు గూడ ప్రాధాన్య మొసగినటుల ఆ మాలిక వలననే ధ్రువమగును. ఈ భావములో శ్రావ్యమాధుర్యసూచక మగు కవిబ్రహ్మవాక్యమును గవితాదర్శముగా నిడుకొనె ననియు భావింపవచ్చును. తిక్కనరచన ఆంధ్రకవిత్వమునకు విజ్ఞానసర్వ

స్వముకహా పెద్దన యటుల తన కవితామృతమును పండితామోద ముగ జెప్పి రాయలచే గండపెండేరము బహుకృతినంది, ఆంధ్ర కవితాపితామహ యని సంబోధింపబడి అష్టదిగ్గజములలో పెద్దన యను సార్థకనామము వహించెను తరువాతనే రాయలు కృతి భర్తగా మనుసంభవ కావ్యము వెలయించి ఆంధ్రసారస్వతమున తన ప్రభువు నామము చిరస్థాయిగ నెలకొల్పి ప్రబంధకవుల కాదర్శపాత్రుడు డయినాడు

పెద్దన స్వారోచిపాత్రను రాయల అనన్యపరాక్రమ శౌర్య ధైర్యాదుల మననమునం దిడుకొని చిత్రించినా డనిపించెను రాయలయందు స్వారోచిరూపమును, శౌర్యము, నౌదార్యమును గాంచెను

ప్రబంధపదమునకు సంస్కృతాలంకారికుల మతము ప్రకారము అర్థము చెప్పుకొనవలయునేకాని ఆంధ్రలాక్షణికుల జాడ జూచిన సరిపడదు



# 5

# పారిజాతాపహరణము

[ నంది తిమ్మన ]

రాయలాస్థానమున ఆంధ్రకవితాపితామహుని సరసగూరుచుండదగినవాడు నంది తిమ్మనామాత్యుడు. అల్లసానివాని అల్లిక బిగివలె ముక్కుతిమ్మనార్య ముద్దుపలుకు పండితామోద మంది కవులకు శిరోధార్యమైనది. ఈ కవి రాయల దేవేరియగు చిన్నాదేవితో వచ్చిన అరణపుగవి యని చెప్పుదురు. అందుచే రాయల ప్రత్యేకాభిమానమునకు బాత్రుడై చనువు గలిగియుండె నందురు. ఈతని ముక్కు తిమ్మన యని చెప్పుటయే పరిపాటియయినది. అటుల బిలచుటకు గారణమయినది యీ కవి కృతమని చెప్పబడు ఈ పద్యము.

శా॥ నానాసూనవితానవాసనల నానందించు సారంగమే
లా నన్నొల్ల దటంచు గంధఫలి బల్కాకం దపంబంది యో
షానాసాకృతి బూని సర్వ సుమనస్సౌరభ్య సంవాసియై
పూనెం బ్రేక్షణమాలికామధుకరీపుంజంబు లిర్వంకలన్.

ఈ పద్యమునే భట్టుమూర్తి విలిచి తన గ్రంథమున వాడుకొని నను వాదుగ గలదు. కాని యది విశ్వాసార్హము కాదు. కాని ముక్కుతిమ్మనార్య 'ముద్దు పలుకు' అను పద్యపాదము

తిమ్మన కవితాప్రాగల్భ్యమును దెల్పు గీటురాయిగా నున్నది. పారిజాతాపహరణ ప్రబంధమును రాయలకే కృతియిచ్చి ఈ కవి యనేకాగ్రహారముల బొందినాడు పెద్దనయెడ గౌరవము గల రాయలకు తిమ్మనయెడ నభిమాన మెక్కుడు

ఈ గ్రంథమున కితివృత్తమగు గాథను సంస్కృత హరివంశ ద్వితీయపర్వమగు విష్ణుపర్వమునుండి స్వీకరించినాడు. ఆ గాథకు కావ్యోచితమైన చిఱుమార్పుల జేసి తిమ్మన తన కృతిని ఒక స్వతంత్రమధురకావ్యముగ రూపొందించినాడు అటుల జేసిన మార్పులలో సత్యభామయొక్క మానక్రోధముల వర్ణించుట శ్రేష్ఠతరమైన మార్పు ఈ భాగమే కవీశ్వరుని యపారమైన రసభావపరిజ్ఞానమునకు జక్కని నిదర్శనము. ఈ గ్రంథము సంస్కృతగ్రంథమున కనువాదము కాదు కేవలము కల్పిత కథయుకాదు ఇది యేకనాయకాశ్రయము. శ్రీకృష్ణుడు కథానాయకుడు సత్యభామ కథానాయిక వస్త్వైక్యము నిందు సిద్ధించినది గాథయంతయు పారిజాతమునకు సంబంధించినదే వీర రస మంగముగా శృంగారరస ప్రధానమైన కావ్యము శృంగార రసపు వివిధావస్థలు సందర్భానుసారముగ కథయందు వర్ణితములైనవి ఇతరరసములంతగ పరిపోషితము కావనినను దోసము కాదు. లోపమును గనబడదు

ఈ మహాకవి కృతిభర్తయగు శ్రీకృష్ణరాయల వర్ణనముననే కథను ధ్వనిమాత్రముగ సూచించినాడు పారిజాతము నాసబడి పట్టితెచ్చుట " సత్యభామాభోగసక్తి నాడును నేడు నా కల్పమవని నింపార నిలిపి' అనునవి కథాసూచకము లని భావింపదగును. శైలి యన్ననో మృదుమధురమై ద్రాక్షాపాకమున చవులూరుచుండును మెత్తని యలతియలతి పలుకులతో సున్నితమైన భావములతో నలంకారములతో రసవత్తరమై అమృతగుళిక లనందగిన పద్యములతో నిండారిన దీ సుకుమార కావ్యము. భావగాంభీర్యమును, శబ్దసౌష్ఠవమును ఒకదాని నొకటి యంటి

పెట్టుకొని యుండును ప్రతిపదము ప్రతియలంకారము కథాగమనమున రసస్ఫూర్తి ఘటించుచు తూచి వాడినటు లుండును

అలతియలతి పలుకులతో భావవిస్ఫురణము చేయుట తిక్కయజ్వను జెప్పి యితనిని చెప్పవలయును సమాసములు తేలికగ, విడివిడి యర్థవంతములగు పదములతో నింపుగ గూర్పబడినవేగాని సందర్భరహితమై దుర్భేద్యము, దుర్గ్రాహ్యము దూరాన్వయము, అనన్వితము మున్నగు కావ్యదోషములతో రసజ్ఞులకు విరక్తి గల్గించునవి కావు గంభీరమైన భావములు చిన్నిచిన్ని లలిత పదజాలములలో నిమిడ్చి భావవస్తువర్ణనానైపుణ్యము మెఱయ భావనాశక్తిప్రాగల్భ్య [illegible] విన్నాణ మొప్ప జెప్పుట యీ కవి సొమ్ము కథాకథనమున నేకాగ్రత మెండు అంతమాత్రమున ప్రబంధములకు ప్రధానలక్షణ మనదగిన వర్ణనావైభవము లోపించిన దనవలదు వర్ణనాబాహుళ్యము లేకుండుటయు నకుంఠితముగ కథసాగించుటయు ప్రధానములుగ నీతడు భావించినటుల దోచును తిమ్మన మిక్కిలి స్వతంత్రుడు పాత్రచిత్రణ, పోషణములందు, తత్ప్రవేశనిష్క్రమణల ఘటించుటయందు కృతహస్తుడు కథానాయికయగు సత్యభామను విస్పష్టరేఖలతో మన మనోనేత్రముల ముందు నిల్పినాడు పాత్రల మానసిక పరివర్తనములు, లోతులు పరీక్షించి చూపుటలో పెద్దనకన్న మేలుచేయి యందురు వర్ణనలు స్థిరపదార్థవర్ణన, చరపదార్థవర్ణన, ప్రాణుల మానసికపరివర్తనవర్ణన అని త్రివిధము లనియు, అవి యొకదానికన్న ఇంకొకటి కష్టతర మనియు జెప్పియుంటిమి ఈ త్రివిధముల వర్ణన నైపుణ్యమునందు తిమ్మన సమర్థుడు వస్తుప్రధానమైన వర్ణనావైదగ్ధ్యము చూడుడు.

సీ॥ సరిగమపదనిసప్రజ్ఞ స్వరంబుల
మహతి నభోవాయునిహతి మొరయ
భాగీరథీపయఃపరిపూర్ణ మణికమం
డలువు హస్తంబున జెలువుమిగుల

ప్రణతమంత్రిత్రిపావనస్ఫటికాక్ష
వలయంబు కర్ణకష్పాలిక గ్రేల్ల
సమరసృతోచితచమరవాలంబును
... సత్త్రప్రాలయము భుజాగ్రమున మెఱయ

గీ దేహకాంతులకాలచంద్రికల నీన
జడలు మెఱుగుద్రుమపల్లవశంక సేయ
గగనమునసుండి వచ్చె నాకస్మికముగ
నారివేరంపు దపసి దైత్యారికడకు

వస్తుప్రధాన వర్ణనాత్మకమగు నీ పద్యమువలన నొక విస్ఫుటాకారమును మనయెదుట సాక్షాత్కరింప జేసినాడు—

చ అన విని మానినీ తిలక మప్పుడు మేయ్యుఱదోప నిక్కి వీ
డిన కచపంక్తి బల్లుఱు ముడి స్వేదబోవుచు బై చెఱంగు గ్రి
క్కున జనుదోయి జేర్చుచు మొగంబున లే జెమరింప జం
కెన నాతిచూపు జూచి పలికెం జలితాధరపల్లవాగ్రయై

ఈ పద్యమందలి వర్ణనావైచిత్ర్యము సహృదయుల కోపమూర్తికిగూడ నెంతటి యందము కోపావేశచిహ్నములగు చేష్టలెంత సహజముగ వర్ణితములు ఇటులనే శోకమూర్తివర్ణనము కూడ దిలకింపుడు

ఉ ఈసున బుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబు చే
గానిలి రేచెచ్చ ప్రాణవిభు కట్టెదుట న్లలితాంగి పంకజ
శ్రీసఖమైన మోముపయి జేల చెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠకలకంఠవధూకలకాకలీధ్వనిన్.

సత్కావి చేతిలో శోకముగూడ నానందప్రదముగనే రూపొందెను ఇంత ముద్దుముద్దుగ సత్యచే నేడ్పించి పరిహాసప్రియుడగు రామకృష్ణునిచే "ముక్కుతిమ్మన ముద్దుముద్దుగ నేడ్చె" నని యనిపించుకొనెనట మఱియు మేరుపర్వతనందనోద్యానవర్ణన లెంతయు భావగంభీరములు.

మ. మహిభద్రైదివసాంతసీమమున బద్మాజానిసత్యావధూ
సహితుండై యని మెచ్చ వారవనితాసందోహము ల్గొల్వగా
విహరింపం జనుదెంచినా డనుచు సేవింపంగ వర్షాశర
ద్విహిమాసీత వసంత ఘర్మ ఋతువు ల్వెంచెం దదుద్యానమున్

సర్వలోకాధీశుడు సర్వమయుడు నగు పరాత్పరుని యానందమునకు ప్రకృతి యుద్యానవనలక్ష్మిరూపమున, ఆయా ఋతుధర్మముల ననుసరించి తా దాల్చు సుందరరూపముల నొకసారి సేవించినదని యనుటలో నెంతయు సొంపు భాసిల్లుచున్నది సామాన్యుడగు కవి యేవసంతమునో యూహించి తన యిచ్చ మెచ్చు పెక్కు పద్యముల రచించి విసువు గలిగించియుండును అలతియలతి పలుకులతో బహుళార్థము స్ఫురింపజేయుట యేకదా శిల్పవిశేషము శ్రీకృష్ణుని మానసికావస్థ నెటుల చిత్రించెనో గనుడు

చ. అరదము నెక్కి కేతనపటాంచలచంచలమైన కాల్మితో
దురగజవంబు మున్నడవ ద్రోచి కడంగెడు తత్తరంబుతోఁ
దిరిగెడు బండికండ్లపగిదిన్ భ్రమియించు మనంబుతోడ
హరి సనుదెంచె సత్యసముదంచిత కాంచన సౌధవీథికిన్

ఉపమానోపమేయముల నతిశయోక్తి లేకుండ కవి సమయములని, కవిసమ్మతములని తెచ్చిపెట్టుకొన్నవి కాక ప్రత్యక్షముగనున్న పరికరములతో చెప్పబడిన దీపద్యము అట్టి కాంచన సౌధమందలి "గోపసదనంబునకున్ జనియె లతాంగి హరిచందన కోటరమునకు నాగతరుణియుబోలెన్" హరిచందనతరువు కల్పవృక్షములలో నొకటి పారిజాతవృక్షము సరస నిలువదగినది చందనతరువు నాశ్రయించి దేవతాసర్పము లుండుటయు సహజము అందును కోటరము అంధకారమయము కోపగృహము దీపికాశూన్యము మానక్రోధముల నుస్సునుస్సురనుచున్న సత్య బుస్సుబుస్సుమను నాగతరుణి ఎంతటి చక్కని కల్పన కోపగృహమున జలదాంత చంద్ర రేఖాసదృశాంగియై పొరలె గాఢమనోజ విషాదవేదనన్' ఆహా ఎంతభావగంభీరము కోపగృహము మేఘ

సదృశము  సత్యతనుకాంతి మెఱుపుసదృశమ్ము  సత్యయందము వేఱుగ జెప్పనక్కర లేదు  ఈ మాటయం దది ధ్వనించుచున్నది దుఃఖమున పొర్లుట్లు మెరపువలె నాగతరుణి మెలికలు తిరుగుట. అవయవమున కరువది పద్మములు చెప్పు కవులవలెగాక సత్యగత సత్యతనూ కాంతిని  అందమును స్ఫురింపజేయుట విశేషము  ఇటులనే కృష్ణుని నిర్దేశించి కవి వాడిన 'కుహనాగోపాలుడు' 'జగన్నాటక సూత్రధారి' మొదలగు పదప్రయోగముల సందర్భశుద్ధియు గమనార్హము  కృష్ణుడు మాయ యచ్చుపడంగ సౌధము ప్రవేశించెను  ఈ లలితాంగి చంద మొకయించుగ చూచెదనంచు ధూర్తగోపాలుడు'' ఇట్టిమాటల వాడుటలో కవి యుద్దేశమేమి? శ్రీకృష్ణుడు సత్యనాటకమంతయు నెఱుగుననియు చిన్నపిల్లలను పెద్దలు లాలించినటుల నాటకమాడుచుండెనా యనియు సందేహించుట కవకాశము కలదు

ఈ పద్యమందలి సొగసు సహృదయానందకరము

ఉ. ఓర్పొకయింత లేని వికచోత్పలలోచన చిత్తవీథి జ
ల్లార్పగ నీలనీరదశుభాంగుడు కే సనుదెంచె నంచు గం
దర్పహుతాశను న్వెలికి దార్చ సఖుండనుబోలె వేడి ని
ట్టూర్పు దళంబుగా నిగిడె నున్నమితావరణాంశుకాంతమై

నీలనీరదము వర్షించును  వర్షపాతమున నగ్నిచల్లార్చును. నీలనీరదశుభాంగుడగు శ్రీకృష్ణుడు వలపువర్షముకురిపించినహుతాశనబాధను మించిన కందర్పబాధకు తావులేదు  వేడినిట్టూర్పుల రూపమున వెడలును

చ. వనిత కుచద్వయంబుపయి వ్రాసిన కుంకుమపత్త్రభంగము
ల్జనితనితాంత ఘర్మకణజాలముచేత గరంగి మెల్ల మె
ల్లన వెలిపట్టుపయ్యెద కలంకల జాఱుట యొప్పె మానసం
బున నెలకొన్న క్రోధరసము న్వెడబెట్టుచునున్న కైవడిన్

ఇటులనే సరసాలంకార భావగర్భిత పదప్రయోగవిలసనము రసజ్ఞలోకము మెచ్చునటుల కావ్యమునందెల్లెడ వెల్లివిరియు

చున్నది చదివి యానందింపవలయు ననిన ప్రతిపద్యము నుదాహరణీయమే కొందఱీప్రబంధమున వర్ణనలు కొన్నియెడల నతిదీర్ఘములయి కథాగమనమునకు విలంబము గల్పించుచున్న వందురు కాని యది సత్యదూరము వర్ణనలను తిమ్మన నిగ్రహముతో జేసె ననియే యనవలయును మఱికొందఱు పుణ్యకవ్రత మనవసర మనియు నది యతికించినటులున్న దనియు నందురు కాని యా వ్రతముకూడ కొంత ప్రయోజనము నూహించియే చేర్చబడినది. పారిజాతాపహరణమునకు మూలకారణము సత్యస్వభావము, ఈర్ష్య మానక్రోధములు పట్టుదల, సవతులయెడ అసహనము "చక్కనిదాన నంచు నెలజవ్వని నంచు జగంబులోన జేరెక్కిన దాన నంచు బతి యెంతయు నా కనురక్తుడంచు దా నిక్కుచు విఱ్ఱవీగుచు గణింపదు కాంతల" అట్టి సత్యస్వాధీనపతిక అహంకారిణి భర్తను గాటముగ ప్రేమించినది భర్తృప్రేమనుబదులు పంచుకొనుట సహింపదు రుక్మిణియెడగల ఈర్ష్యచే పారిజాతము కావలయునని పట్టుబట్టినదే కాని నిజమున నా పుష్పమం దంతగ వాంఛ యుండియుండకపోవచ్చును ఆ ఈర్ష్యచేతనే రుక్మిణి కన్న తానే యధికురాలనని నిరూపించుకొనుటకు దేవలోకముపై భర్తతో దండెత్తి పారిజాతమును సంపాదించినది అటుల కష్టపడి సంపాదించిన పారిజాత తరువునుసహితము భర్తృప్రేమను తానే గుత్తకొనుటకు నారదునకు దానమిచ్చినది తన భర్త ఎముక్తికి నారదుడు కోరినటుల తన సర్వాభరణములను సంపత్తును ధారవోసినది వ్రతారంభమున నారదుడు చెప్పినమాటల గమనింపుడు.

చ కువలయనేత్రి తొంటి తన కోపము గర్వము మత్సరంబు మా
ని వినయము ప్రమోదమును నిండి తొలంకెడు నెమ్మనంబున
న్సవతుల యిండ్లకెల్ల దొలునాడు క్రమంబుగ నేగి తద్వ్రతో
త్సవమున కామతించి యతిసంభ్రమలీలల దోడితేరగన్

చ. దినదిన మిట్లు తత్పరమతిం బదివేవురు పేరటాండ్రక
ర్చన లొనరించి సారఘనసారసుగంధము లున్విచిత్ర నూ
తనపటురత్న భూషణవితానము లిచ్చుచు .. ..

ఒక నెల వ్రతము చేయవలయును. పరిచారకులు పిలువ గూడదు. తా నంతవఱకు నిరసించుచున్న సవతుల స్వయముగ బిలువవలయును, పూజింపవలయును, సత్కరింపవలయును. సత్య తన మానుషమును జంపుకొని, ఆ విప్రమంత్రానుష్ఠానమునకు సమకట్టినది. సత్యకు భర్తయెడ గల ప్రేమకు ఇది పరీక్ష. స్థూలముగ లోపములుగ దోచు సత్యచేష్టలకు మూలహేతు వేది? అవిచ్ఛిన్నమైన భర్తృప్రేమ. దానిని బొందుట కెట్టి సాహసమైన త్యాగమైన జేయుటకు సత్యయెంతసంసిద్ధురాలో ఋజువయినది. పవిత్రప్రేమకు చిహ్నము త్యాగమేకదా. ఈ వ్రతవిధానమున సత్యప్రేమ పునీతమని నిరూపితమయినది. భర్తఅనురాగమునకు మిన్న సత్యదృష్టిలో నేదియు లేదు.

కం. కలకాల మొక్కగతిబూ
సలలో దారంబుమాడ్కి సతిమదిలోనన్
మెలగెడు పురుషులు గలుగుట
తొలిజన్మము నోముఫలము ..

అని భావించినది. అదియే ప్రేమపరమావధి. దాని నందుటకు అభిజాత్యాహంకారములను ఈర్ష్యాద్వేషములను పారిజాతవాంఛను, సర్వమును తృణప్రాయముగ త్యజింపగలిగిన పరమ పతివ్రత యని యీవ్రతవిధానమువలన ఋజువయినది. తిమ్మనార్యుడే పుణ్యకవ్రతమును కథాభాగముగ జేసి సత్యపాత్రకు ఔన్నత్యము గూర్చినాడు. పవిత్రమైన దంపతుల ప్రేమతత్త్వ మెట్టిదియో, భర్తృప్రేమ బొందుటకు భార్య యెంత త్యాగము జేయునో లోకమునకు జాటినాడు. పారిజాతసంపాదనము, ఈర్ష్యా క్రోధాదులు క్షణభంగురములు. దంపతుల పవిత్రప్రేమ శాశ్వతము. సత్య ప్రేమపరమావధి నందుటకు తన సహజగుణముల

లోపముల నధిగమించిన ధీరురాలు చిన్నతనముననో, అజ్ఞానవశముననో పొరబడుచున్న సత్యను సక్రమమార్గమునద్రిప్పుటకు ఆపె పేమతత్త్వమును లోకమునకు జాటుటకు జగన్నాటకసూత్రధారి యగు కృష్ణుడు నారదునిసాయమున బన్నిన పన్నాగము భార్యను దిద్దుట ధర్తవిధి ఈ పరమసత్యమును వనితాలోకమునకు పరోక్షముగ తిమ్మన్న బోధించినాడు పుణ్యకవ్రతప్రయోజన మిది పారిజాతవృక్షము దవర్షి పరమగుట దేవలోకమునకు జెరినటు లెంచవచ్చును

పారిజాతాపహరణము స్వయంసంపూర్ణమైన వస్త్వైక్యము కలిగి పరోక్షముగ ధర్మప్రతిపాదనలజేయు ఉత్తమ ప్రబంధ మన దగిన కావ్యము ఈ ప్రబంధమును మనుచరిత్రతో బోల్చి దాని కంటె నిదిమిన్నయను విమర్శకులు గలరు జిహ్వాకొక రుచి ఇది యెటులున్నను పరిమాణమున చిన్నదయినను వయసున ఇది మనుచరిత్రకు జ్యేష్ఠమని విమర్శకుల యభిప్రాయము నవీనులకీ కావ్యము రుచించుటలో యబ్బురము లేదు ఈ కాలపు జిన్ని చిన్ని మధురకావ్యముల కొజ్జరికము జేయు శృంగారకావ్య మిది అమలినశృంగారమున కాటపట్టుతిమ్మనకవిత్వముమురళీనినాదము హృదయాంతరముల జొచ్చి హృదయతంత్రుల మేళవించి సాత్వికానంద మొనగూర్చు మధురగీతి

ఈ ప్రబంధమున కొన్నివిశేషములు గలవు కృతికర్త కృత్యాదిని తన వంశాదులనుగాని, పూర్వకవి ప్రశంసగాని కుకవి నిరసనగాని చేయలేదు కవులలో కొందఱివలె తన కవితామతమును సూచింపలేదు దేవతాస్తుతిలో చంద్రునిగూడ స్తుతించినాడు ఇందు విశేషముకలదు శ్రీకృష్ణదేవరాయలు చంద్రవంశజుడు శ్రీకృష్ణుడు పారిజాతాపహరణ ప్రబంధనాయకుడు చంద్రవంశజుడు శ్రీకృష్ణరాయలందు శ్రీకృష్ణుని దర్శించి యభేదప్రతిపత్తి గలిగించిన కవి యీ చంద్రస్తుతి చేయుటలో నెంతేని యౌచిత్యమునది ఈ కవి యే యాడంబరము లేక

కథాకథనమున నేకాగ్రత గలిగి ముద్దుముద్దుగ స్వయంసంపూర్ణమైన ప్రబంధరచన జేసి మధురకుసుమార కావ్యములకు వరవడి బెట్టినాడు

కాని చంద్రునిలో మచ్చవలె ఒక్కడమాత్ర మనౌచిత్య దోషమునకు తిమ్మన పాల్పడినాడని భావింపవలయును పారిజాత పుష్పమహిమ గొనియాడునపుడు "నీవు నీ పతి రహస్యక్రీడ వర్తించువేళ లతాంతాయుధ సంగరంబునకు నుల్లాసంబుగల్పించు" అని దేవర్షియగు నారదునిచే రుక్మిణితో ననిపించుట సరసముగ లేదు అనౌచిత్యదోషమున వచ్చును. కవికులగురుడగు కాళిదాసుని "ఏకోహిదోషో" అను సూక్తితో దృష్టిజెందెదము



# 6

# ఆముక్తమాల్యద

## [ శ్రీకృష్ణదేవరాయలు ]

సాహితీసమరాంగణసవ్యసాచి యగు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమున గల ప్రఖ్యాత కవులను కొందఱిని కొంతవఱకు వారి కావ్యములను పరిశీలించితిమి. ఇతర కవులను, వారి కావ్యములనుగూడ స్థూలముగ నైన పరిశీలించుటకు ముందు ఆ కవుల కందఱకు దావలంబగు రాయల స్వీయరచనలగూడ పరామర్శించుట సమంజసము. రాయలు బహుభాషలను కూలంకషముగ నేర్చిన పండితుడు. గీర్వాణాంధ్రకర్ణాటభాషలందు కవిత్వము చెప్పగల దిట్ట. బహుగ్రంథకర్త. దేశభాషలందు తెలుగు లెస్స యని ఆంధ్రభాషను అభిమానించిన రసజ్ఞుడు. అట్టి రాయల సాహిత్యకీర్తికి ధ్వజప్రాయమైనది ఆముక్తమాల్యద. అది యత్యుత్తమప్రౌఢకావ్యము. సంస్కృతమున నంతకుబూర్వమే గ్రంథరచన జేసిన రాయలు తనరాజ్యము సర్వథాసంపన్నము, సుభిక్షము, నిరుపద్రవమునైన తరువాతనే యీగ్రంథము రచించి యుండును. రాయలు కత్తి నావల బెట్టిన తరువాతనే కలమును జేపట్టి కృతికర్తకూడ నాయెను.

ఆముక్తమాల్యదకు విష్ణుచిత్తీయ మనియు నామము గలదు ఇందు గోదాదేవి శ్రీరంగేశుల ప్రణయము చిత్రితము గోదాదేవి విష్ణుచిత్తునకు దైవదత్తయగు పుత్రిక విష్ణుచిత్తుడు విష్ణుభక్తుడు ఆ పుత్రికయు నట్టిదియే గోదాదేవి పుష్పమాలలను తాను ముందుగ ధరించి తరువాత నే శ్రీరంగేశుని వానితో నలంకరించెడిదట అందుచే 'ఆముక్తమాల్యద'గ ప్రసిద్ధి జెందినది భక్తులయెడ కృపాసింధువగు శ్రీమన్నారాయణుడు భక్తులేమి యొసగినను సంతసమున స్వీకరించునుగదా ప్రధానము భక్తియే కాని కానుక కాదు శబరీభుక్తశేషములగు ఫలములను శ్రీరామచంద్రుడు స్వీకరింపలేదా ? గోదాదేవీ శ్రీరంగేశుల ప్రణయగాథయు నిట్టిదియే ఈ గాథ కావ్యపూర్వాపరభాగముల నాక్రమించినది గోదాదేవి యువతిగావున తద్భక్తి శృంగారభావము దాల్చినది ఆ భక్తురాలు చివఱకు రంగశాయితో సాయుజ్యము నందుటచే మధురభక్తికే సిద్ధి కలిగినది

ప్రాసంగికముగ నిందు ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యానము, యామునాచార్యచరిత్ర, మాలదాసరికథ మొదలగునవి కావ్యమధ్యమున వివరింపబడినవి రాయలు వైష్ణవుడు విశిష్టాద్వైతమునం దభిమానముచే దాని ప్రచారమునకు గేలూత యిచ్చినాడు తన్మతపారిశస్త్యమును లోకమునకు చాట సంకల్పించి యీ గాథల నన్నిటిని తన గ్రంథమున గుది గూర్చినాడు ప్రధానప్రతిపాద్యమగు విష్ణుభక్తికి బోషకముగా నక్కఱకు వచ్చునని కవి వీని కెట్లో స్థానమును కల్పించి తనగ్రంథమున నతికినాడు అటులనే యామునాచార్యునిచే కుమారునకు జెప్పించిన రాజనీతి ప్రస్తావనచేతను, అతి దీర్ఘములైన ఋతువర్ణనలచేతను కావ్యస్వరూపమునకు సౌష్ఠవము లోపించిన దనవలయును ఈ ఘట్టమున రాయల రాజనీతిజ్ఞత యెంతయూ వెల్లడియగును పినవీరభద్రుని శృంగారశాకుంతలమున భరతునికి జేయబడిన రాజనీతిబోధ స్ఫురణకు వచ్చును ఈ యుపాఖ్యానములే లేకున్నచో చక్కని

హైక్యము కుదిరియుండెడిది ప్రధాన కథను మించినవి ప్రాసంగిక ములగు నీ యుపాఖ్యానములు కాన ప్రబంధములకు బ్రధాన లక్షణమైన వస్త్వైక్య మీ కావ్యమునకు సిద్ధింపలేదు ఇది యొక చిన్న విష్ణుపురాణ మనదగియున్నది

వైష్ణవులకు భక్తియందు ప్రవృత్తిప్రధానము భక్తి పేరిట ఆ భావము చక్కగ పోషింపబడినది విష్ణుచిత్తు డీశ్వరానుజ్ఞను శిరసావహించి పాండ్యరాజాస్థానమునకు బోవుటాది తన పుత్రికను శ్రీరంగేశున కుపాయనముగ నర్పించుట లోనగు విషయములు ఈ ప్రపత్తిభావచిహ్నములు ఉపాఖ్యానములు రచించుటలో ప్రత్యేకప్రయోజనము లేకపోలేదు వానిని రచించుటలో రాయలు గొప్ప నేర్పు ప్రదర్శించెను ఈ కావ్యమున వివేకని రూఢమైన జ్ఞానమువలె వివేకరహితమైన భక్తియు భక్తి సహిత సంకీర్తనయు భగవదనుగ్రహమునకు మార్గములే యని నిరూపించు టకే ఈ కథలు ప్రాసంగికముగ జేర్పబడినవి యామునాచా ర్యుని చరిత్ర విష్ణుచిత్తుని కథ మాలదాసరి వృత్తాంతము, ఈ సిద్ధాంతమున కుదాహరణములు యామునాచార్యునిది వివేక నిరూఢమైన జ్ఞానము విష్ణుచిత్తుడు వివేకరహితుడగు భక్తుడు మాలదాసరి భక్తిసహితసంకీర్తనపరుడు మూవురు ముక్తిలంగుల గమించిరి అయినను మూవురకు సమానపదము లభించినది ఒక దృష్టితో జూచిన మాలదాసరి భక్తిసంకీర్తనమే వీనిలో నుత్తమమార్గమేమో యని తోచును తాను తరించుటయేగాక సంకీర్తనశ్రవణమాత్రమున నితరులును తరించిరి, 'కలౌసంకీర్తనం' అనిగదా పెద్దల మతము వైష్ణవతేజ మొక్కటియయ్యు యధి కార తారతమ్యవశమున భిన్నమై యెల్లెడ వ్యాపించి ధ్వాంత నాశనము చేయుచున్న దను సత్యమును కవి వివిధోపాఖ్యానరూప మున స్థిరీకరించినాడు అందుచే నీకావ్యము తత్త్వజిజ్ఞాసువుల కెక్కువగ ప్రయోజనకారి అయినను యీకథలన్నియు కథాశిల్ప

మున, పాత్రచిత్రణమున సంభాషణనైపుణ్యమున నతిమనోహారము లనదగియున్నవి

ఈ గ్రంథరచనయందు రాయలు తనకుగల యుపనిషద్భాష్యాదిపరమార్థజ్ఞానము యోగశాస్త్రపరిజ్ఞానము, బహుశాస్త్రపరిచయము నిరూపించెను ఇది విష్ణుచిత్తుడు పాండ్యరాజు కొలువున జేసిన పరమతనిరసనము స్వమతస్థాపనమను మహాకావ్యమున విదితము దీనియందు శ్రుతివాక్యము లెన్నియేని కలవు ఇటులనే ఖాండిక్య కేశిధ్వజసంవాదములో యోగశాస్త్రపరిజ్ఞానము కనబడును రాయలు వైష్ణవమత రహస్యముల నెఱుగుటకై ప్రస్థానత్రయమును క్షుణ్ణముగా పరించియుండును ఆ యా సందర్భముల రాయలు ప్రదర్శించిన శాస్త్రజ్ఞానము, పురాణకథా పరిజ్ఞానము అసదృశములు

ఈతని భావ మతితీక్ష్ణమైనది కూలంకషముగ జూచునే గాని స్థూలదర్శనముచే దృప్తి జెందదు భావము లెంత దీక్ష్ణములో భాషయు నంత క్లిష్టము ఒక్కొకయెడ నెంతో సరళముగ నున్నను పెక్కుచోటుల పద్యము లతిక్లిష్టములై యప్రతీతార్థములై క్లిష్టాన్వయములతో నలరారుచుండును మొత్తము మీద జూచినచో నీ కవి భావుకుడుగాన, తన తీక్ష్ణమైన భావములకు సులభముగ వ్యక్తీకరణము కుదరక యంతర్వేదన పొందువానివలె గన్పట్టును. ఈయనను తెనుగుకవి యనుటకన్న సంస్కృతకవి యనుటయే సమంజసముగ గన్పడుచున్నది రాయలకు సంస్కృతపదభూయిష్ఠ దీర్ఘ సమాసములు వాడుటయందు ప్రీతి మెండు

మ మదనస్యందనాతాస్వవృత్తి జలిపెం బాటీరభూభృద్వల
న్మృదువాతం బతిపక్వపాదపలతాన్వంతావళీ మూలరం
ధ్రదళత్పంకజకర్ణికాగణ హారిద్రాభంగ బాభాసుర
చ్ఛదనచ్ఛద్మ వివర్తికాంచనకనచ్ఛత్రచ్ఛటా ఛీత్కృతిన్

శా. అద్దావాగ్విబుధమ్మహో వచనక వ్యాహారమహో వచ
స్సిద్ధమ్మాః కృతశాంగతః కలికితి శ్రీసూక్తి విద్యాధర
మ్మిద్ద ద్ధత్యమగాల్లయం హిశధియామిత్థం వరత్వి న్నర
మ్మద్ధీరాగ్రణి గెల్పుటుత్సవమునందయ్యె న్నభంబంతయుక్

వాక్యయోజనయందును సంస్కృతభాషా సాంప్రదాయమునే యనుసరించుటచే రచన క్లిష్టముగనుండును సమాసఘటనమంతకంటె కష్టతరము అందందు వాడబడు ద్రావిడపదములు అప్రచురశబ్దములు వీని శైలి క్లిష్టతమ మగుటకు కారణభూతములయినవి చిన్ని సమాసములలో గంభీరభావముల ప్రదర్శింప యత్నించిన చోటులునుగలవు ఈయనరచన పండితైకవేద్యము రాయల కవిత్వమునందు శ్రావ్యత లేదు. ప్రసన్నత లేదు వర్ణనలు సముచితస్థానమున లేవు ఈ విషయముల పెద్దనకు జాలడు భావుకత్వమున పెద్దనను మించిన ప్రబంధమున వర్ణన లుండవలయునను తలంపుతో గాబోలు ఒకతటి మూడుఋతువుల అతిగ వర్ణించెను ప్రౌఢపాకమున వెలసిన ఈ కావ్యమందు మధ్య మధ్య ప్రసన్నతామాధుర్యముల కాలవాల మనదగిన పద్యములు లేకపో లేదు నందితిమ్మన పెద్దనల రచనలను పోలిన పద్యములు గలవు అవి వారే రచించియుందు రనియు వారల ప్రీతుల జేయుటకు రాయలు తనగ్రంథమున ఆపద్యములను జేర్చియుండుననియు ననుట అసంభావ్యముకాదు ఇట్టి పద్యములవలన పెద్దనయే ఆముక్తమాల్యదను రాయలపేరిట రచించెనను అపప్రథ గలిగినది మనుసంభవ ఆముక్తకావ్యముల సూక్ష్మముగా బరిశీలించినవారు అపప్రథను త్రోసిపుత్తురు శైలీభేద మెంతేనికలదు సంస్కృతపదభూయిష్ఠము, సమాసభరితమునగు నీ కావ్యమునందందు దేశీయములగు మాటల లోకోక్తులు లేకపో లేదు నాటి ప్రజాజీవితమును ప్రతిబింబించు వర్ణనలును గలవు

ఈకావ్యమున ప్రధానవస్తువు గోదాదేవి శ్రీరంగేశుల ప్రణయగాథ యనిగదా యంటిమి అది శృంగారరసమయగాథ యయి

నను భక్తిభావమున పర్యవసించినది ఇందలి యుపాఖ్యానము లన్నియు వైష్ణవమత ప్రాశస్త్యమును చాటుట కుపకరించినవే ధూర్జటి తన కాళహస్తి మహాత్మ్యమున శివైక్యము నందుటకు వివిధమార్గముల నిరూపించినటుల ఆముక్తమాల్యదయందు రాయ లువిశిష్టాద్వైత సాంప్రదాయానుసారము జ్ఞానభక్తి సంకీర్తన సేవా మార్గముల విష్ణుసాయుజ్యము గాంచి తరించవచ్చునసునది ప్రబోధించినాడు వర్ణనాదు లున్నంతమాత్రమున నీకావ్యము ప్రబంధ మనజనదు ఇది యొక మతగ్రంథము కాళహస్తి మహాత్మ్యమువంటిది పారిజాతాపహరణము వంటిది కాదు

పాండిత్యప్రకర్షకు, భావుకత్వమునకు విశిష్టాద్వైతమత పరిజ్ఞానమునకు అన్వయకాఠిన్యము కలదైనను అలంకారశోభితము లగు పద్యములకు నాటపట్టు ఆముక్తమాల్యద ప్రౌఢకవితాప్రియం భావుకులగు తత్త్వజిజ్ఞాసువులకు నుపకరించు కావ్యము సంస్కృత సమాసఘటనయందేమి,సీసపద్య రచనావిధానమునందేమి శ్రీనాథు ననుకరించిన జాడలు కలవు

సీ. స్యందనస్థిత బిడౌజః స్తుత్యజాడ్య కృ
జ్జంఝామరుద్ధర ఝాత్కృతములు
క్రవ్యాశిరాగ్రాత్రికనదసృగ్గాహన
స్ఫుటశల్య హవ్యభుఘ్భూత్కృతములు
యోధవర్మిత హృత్పుటోత్క్రాంత నిజపాత
సాలశ్మకృత ముహుస్సాత్కృతములు
పతితోగ్రరక్షః కబంధభార భృశార్తి
భుగ్నభోగఫణీంద్ర ఫూత్కృతములు

క్రాంతరథ్యనిరంతరచ్ఛాయదములు
దివ్యతాపక కార్ష్ణ్యశోత్రీవరితములు
కలుషము లడంచుగాత లంకాపురాగం
తాంబరచరత్ప్రలంబ కదంబకములు

ఆముక్తమాల్యదకు యౌవన మంకురించుట నెటుల వర్ణించెనో గమనింపుడు—

సీ. వాతెఱ తొంటి కెవడి మాటలాడదు
కుటిలవృత్తి వహించె కుంతలంబు
అక్షులు వర్తులురా నలగంట గనుగొనె
నాడించె బొమగొని యాననంబు
ననుగొమ లెన్నగయ వక్షము పేక్ష గడకొత్తె
బాణిపాదము లెఱ్ఱవాఱదొడగె
సారెకు మధ్యంబు దారిద్ర్యముల జెప్పె
లోచోర్వకిటు లోగ జొచ్చె మేను
వట్టి గాంభీర్య మెక్కుడు వెట్టుకొనియె
నాభి నానాటి కిగతి నాటిప్రియము
చవుకయైనట్టి యిచ్చట జనదు నిలువ
ననుచు జారినకరణి బాల్యంబు జాఱె

ఈ పద్యము శ్రీనాధుని దమయంతివర్ణనను మనసున్నం దిడుకొని రచించినటులున్నది శ్రీనాథు ననుకరించి సీసపద్య రచనను, సంస్కృత సమాన ఘటనను చేసినను, ఆ యందము శయ్యాసౌష్ఠవము రాయల కవిత్వమున గానరావు ఓజోగుణ భూయిష్ఠములగు పద్యములనేకము లీగ్రంథమున గలవు మొత్తము మీద నివియే యెక్కుడనవచ్చును. ఈ పద్యముల జూడుడు పండితులకు కూడ కొఱుకుడుపడవు

శా. ప్రాతర్వేళల నట్టివెట్ట సొగసై పాటిల్లె గుంభోంభనో
ద్భూతాంబుధ్వనివాద్యమై మరుదథః పుంజీభవత్పాటల
వ్రాతామ్రేడిత నిక్తభూసురభి శారామాంబుకుల్యా బహు
స్రోతస్సంధుల నంధు యంత్రనతిక ప్రోద్గీత గేయౌఘముల్

శా. కాంచె న్వైష్ణవు డర్ధయోజన జటాఘాటోత్థ శాఖోపశా
ఖాంచద్ఘాట చరన్మరుద్ర్పియదవీయః ప్రేషితోద్యచ్ఛదో
దంచత్కూటకృతవ్రణచ్ఛల పలిప్రాప్యాసాదితాధ్వన్యని
ష్పంచారాత్తమహాఫలోపమ ఫలస్ఫాయద్వటత్క్ష్మాజమున్

పద్యముల అన్వయము మాట యటులుండ శ్రవణసుఖము గూడ గోలువడినది. అందందు ప్రసాదగుణముగల పద్యరచనయు లేకపోలేదు. అట్టి పద్యములే రాయల కర్తృత్వమును శంకించుటకు కారణములయిన వంటివిమికదా. అట్టి పద్యములుండుటకు కూడ కారణము లూహించితిమి. కావ్యమంతయు ఓజోగుణప్రధానమై యుండుట అసహజము.

ఉ. మలయపు గాలి కేలు వనమాలి విమానపతాకఘల్లు మం
చులియ బసిండి మువ్వగమి నొక్కొకమాటు గదల్పనుల్కి మి
న్నలము తదీయ హేమవరణాంచల చంపకశాఖలందు ప
క్షులు రొద సేయ వేగెనని కూడుదు రల్కలు దీరి దంపతుల్

ఉ. ఎవ్వని చూడ్కి చేసి జనియించు జగంబు వసించు నిజ్జగం
బెవ్వనియందు డిందు మరి యెవ్వనియం దిది, యట్టివిష్ణుతో
నివ్వల నొక్క వేల్పు గణియించిన పాతకి నాదు నేడ నే
నెవ్విధియైన నిన్నదియనేని యనన్విని బంధ మూడ్చినన్.

ఈ పద్యపు ఎత్తుగడ భాగవతమున పోతన పద్యపు టెత్తుగడవలెనున్నది. మనుచరిత్రాది ప్రబంధముల లేని పుష్పలావికా వర్ణనము వారినర్మగర్భోక్తుల సొగసు రాయలు వర్ణించినాడు.

సీ. వెలది యీసీదండ వెలయెంత? నాదండ
    తను వెలబెట్ట నెవ్వనితరంబు?
కలువతావులుగాన మల్లికదంబక వేణి
    కలువతావులు వాడకయ కలుగునె?
కడివోదు నా కిమ్ము పడితి యీ గేదంగి
    ననకడివోమి ముందటికి జాడు
జాతులే వంబు జేతుఁగ పద్మినులు సైత
    మును నున్నయెడ జాతులునికి యరుదె?
అనుచు దొలినుడి నభిలాష లెనయమూగి
పలుకతోడనె నర్మగర్భంబుగాగ
నుత్తరము పల్లవశ్రేణి కొసగు చలరు
లమ్ముదురు పుష్పలావిక లప్పురమున

అతిథి సత్కారముల నింపుగ వర్ణించినాడు

శా ఆ నిష్ఠానిధిగేహసీమ నడురే యాలించిన గ్రోల్మియు నెం
తే సాగ్నేంద్రశయాను పుణ్యకథలున్ దివ్యప్రబంధానుసం
ధానధ్యానము సాత్త్వికాళబహుతా స్వాత్త్విష్ణతా స్వాస్త్యపూ
పో వాస్త్యోదనసౌష్ఠవంచ కృపయా భోక్తవ్య మన్నాటలున్
తెలిస్తులివెచ్చప్రియోగిరము దియ్యనిచారులు దిమ్మనంబులున్
బలుచని యంబళు ల్చెఱకుపాలెడనీళ్లు రసావళు ల్ఫలం
బులును సుగంధిశీతజలము ల్వడ పిండెలు నీరు జల్లురయు
న్వొలయగ బెట్టు భోజనము వేసవి చందనచర్చ మున్నుగన్

హృద్యమగు భావము పద్యమునకు ప్రాణము హృదయ
గమమగు నీ పద్యముల గమనింపుడు

శా స్వామీనన్ను నితఃపూరాపరిత శాస్త్రగ్రంథ జాత్యందు నా
రామ త్మ్మాఖనన క్రియాఖరఖనిత్ర గ్రాహితోద్యత్కిణా
స్తోమాన్విగ్ధకరున్భవద్భవనదాసు న్వాదిగా బంపుచో
భూమీభృత్సభ నోటరైన నయశంబు ల్కొఱ గాకుండునే

పురవర్ణనము గమనింపుడు—

మ లలితోద్యాన పరంపరా పికశుకాలాప ప్రతిధ్వానము
ల్వలభీనీలహరిన్మణీ పికశుకస్వానభ్రమం బూన్పమి
న్నలతో రాయు సువర్ణసౌధముల నొందుంజూడ జెన్నొంది
శ్రీవిలిబుత్తూరు వెలుంగు పాండ్యనగరోర్వీరత్న సీమంతమై.

సాహిత్యదృష్టిలో రాయలు మనకు చిరస్మరణీయుడు
కవులు ప్రపంచశాసనకర్తలు లోకహితమును గోరి లోకపు నడ
తకు సన్మార్గముల రచింతురు రాయలేదో సందర్భము జూచు
కొని యాముక్తమాల్యదలో రాజనీతి నుద్ఘాటించెను శ్రీనాథుడు
దేశకాల పాత్రముల ననుసరించి పురవర్ణనాదుల జేసెను కవి
సార్వభౌముని ననుకరించియే రాయలును వర్ణనల జేసెను పుర
వర్ణన నెపమున విద్యానగర వైభవ ముట్టిపడునట్లు వర్ణనచేసినాడు

ఆంధ్ర సాహిత్యములో మిక్కిలి ప్రౌఢమైన గ్రంథములలో నాముక్త మాల్యద యొకటి ఈ కావ్యపు శైలి ద్రావిడాద్య ప్రచురశబ్ద ప్రయోగములమూలమున క్లిష్టతరమైన దని యంటిమి కొన్ని పదములకు నిఘంటువులనైన అర్థములు దొరకుట కష్టము అధ్వ నీన ఉంభితి గనపేర్లాకులు ఘుటశాసి దీవెజారికొమ్ము మొదలగు పదము లనేకము లిందు గ్రంథస్థము లయినవి కుంపటిలో దామరలు, పాటువారికి సుద్దులు చెప్పనేల?' మొదలగు నానుడులు రవికరములు చూలుదాల్చును' శరత్తున నగస్త్యార్ఘ్యము' మొదలగు అపురూప సాంప్రదాయపదములు వాడబడినవి కర్ణాట దేశ ప్రాంతీయుడగుట కన్నడపదములు వైష్ణవమత గ్రంథములన్నియు తమిళమున నుండు కారణమునను ఇందలి గాథలు తమిళమునుండి గ్రహించుటచేతను ద్రవిడపదములు నందందు దొరలినవి ఈ కారణమునగూడ కావ్యమున కన్వయకాఠిన్యము గలిగినను, రాయల బహుభాషాపరిజ్ఞానము ధ్రువపడి ప్రౌఢకావ్యము వ్రాయవలయునను సంకల్పమీడేరినది తన యాస్థానమున నున్న వివిధభాషాపండితుల మెప్పు నందు తలంపున తన పాండిత్యప్రకర్ష నంతయు నీ కావ్యమున జూపయత్నించియుండును ఈ కవిశైలి ననుకరించువారుండుట యరుదు

ఆముక్తమాల్యదయందు వివిధశాస్త్రీయ సంప్రదాయము లెన్నియో యెడనెడ జూపబడినవి కవి సమయవిశేషములు, వివిధాలంకారరహస్యములు పెక్కులు విశదమగును రాయలనాటి సామాజిక స్వరూపము అందలి గ్రామీణ జీవనము, ప్రజల ఆచారవ్యవహారములు మొదలగునవి యెన్నియో వర్ణితములు. వర్ణనాబాహుళ్యముచేత నేమి అప్రచురశబ్దప్రయోగాతిశయమున నేమి, పాండిత్య ప్రకర్షకే ప్రాధాన్య మిచ్చుటచేత నేమి ఆముక్త మాల్యద పఠనపాఠనముల కుపకరించు సాహిత్యగ్రంథమని చెప్పవచ్చును

# 7

# కాళహస్తి మహాత్మ్యము

[ ధూర్జటి ]

రాయలనాటి కవితాధోరణి పరిపక్వమై, యనర్గళశైలీ మనోహరమై మృదుమధురోక్తివిలసితమై, శ్రావ్యమై భావప్రధానమై పండితశ్లాఘ్యమై యొప్పిన దనిన రాయల యాస్థాన అష్టదిగ్గజములలో నొకడుగా బరగు ధూర్జటికవితాశయము వేఱుగ జెప్పనక్కఱలేదు. అతడు నవ్యభాషాశతధానిగుంభసరసస్థితినొప్ప దలిర్ప కావ్యసరణిని సాగించి ధన్యుడైన కవిజనమాన్యుడు 'స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కులకేల గల్గెనో యతులిత మాధురీమహిమ'' అని విద్వత్ప్రభువగు రాయలే యాశ్చర్య చకితు లయిరట

ధూర్జటి శైవుడు కాని సోమనాథునివలె వీరశైవుడు కాడు శివపూజాదురంధరుడైన శివాద్వైతి ఈ విషయమున శ్రీనాథునివంటివాడు ఇద్దరూపాకనాటి నియోగులు, భారద్వాజస గోత్రులు భాషాసరళియందును కావ్యరచనాప్రక్రియ యందును ధూర్జటిరచనలు శ్రీనాథుని పోకడలను తలపునకుదెచ్చును కాళహస్తిమాహాత్మ్యము రచించునాటికి శివయోగియై యుండునని

యూహింపవచ్చును కృత్యాదిని తన తలిదండ్రులగాని, కుల
గోత్రములుగాని పేర్కొనలేదు ఇది శైవకవి సాంప్రదాయము,
పాల్కురికి సోమనాథుడును చెప్పుకొనలేదు. వీరశైవులకు మాత,
పిత, సర్వము శివుడే బసవపురాణము జూచినవారి కిది తెల్ల
మగును ధూర్జటి శివకవుల దారిని గమించెనని తలంచవచ్చును
ధూర్జటి కాళహస్తీశ్వరభక్తుడు శ్రీనాథునివలె యోగశాస్త్ర
రహస్యముల నెఱింగినవాడు కాళహస్తిమాహాత్మ్యము తన
యిష్టదైవమగు కాళహస్తీశ్వరున కంకితమిచ్చెను రాయలు
వైష్ణవమతాభిమానియయ్యు ధూర్జటిని తన యాస్థానమున నిడు
కొని పోషించి అతనివలన నేకృతిని పొందకయే గౌరవించెనన
ఆ మహామహుని సాహితీప్రియత్వము సర్వమత సమతాబుద్ధి
వేఱుగ జెప్పనక్కర లేదు

కాళహస్తిమాహాత్మ్య మనగనే భక్తిప్రధానమైన గ్రంథ
మని వేఱుగ జెప్పనక్కర లేదు క్షేత్రమాహాత్మ్యములను తొలు
దొల్త కావ్యవస్తువులుగ స్వీకరించినవాడు శ్రీనాథుడు కాశీ
ఖండము భీమఖండము మొదలగునవి అట్టి కావ్యములే అవి
వాగ్వైభవమునకు, నుదారతకు నెలవులు తెనాలిరామకృష్ణుని
పాండురంగమాహాత్మ్య మీజాతికి జెందిన గ్రంథమే అది రచనా
ప్రౌఢిమమునకు నెలవు కాళహస్తిమాహాత్మ్యము వీనినుండి
వేఱుపడినది. శ్రీనాథరామకృష్ణుల రచనలు క్షేత్రమహిమ
వ్యాజమున త్రైవర్గికములగు ననేకధర్మములకు రాశీభూతములయి
నవి పతితరక్షకుని క్షేత్రమహిమను నిరూపించుటకు పాపాచరణ
మున బరాకాష్ఠనందిన జీవుల యితివృత్తములు వానియందు వర్ణి
తములు కాళహస్తిమాహాత్మ్య మట్టిది కాదు ఇది యేకాంత
వాసవిలసనము. కైవల్యమార్గమున ప్రయాణించు జీవులకు
నిర్వృతిప్రదము కాళహస్తీశ్వరలింగము విశ్రాంతిభూమి క్షేత్ర
మాహాత్మ్యమును జెప్పుటలోను యోగశాస్త్రజ్ఞానములోను
శ్రీనాథునివలె పండితుడయ్యు కవిసార్వభౌమునివలె బ్రహ్మవిద్యా

వాక్యములను తన రచనయందంతగా పేర్కొనలేదు. వర్ణనల యందు తీక్ష్ణమైన దృష్టియు నంతగలేదు. అందుచే నిందలి కథలన్నియు సూటిగ సందర్భోచితముగ పరిణతస్థితికి గొనిరాబడినవి.

కాళహస్తిమాహాత్మ్యమునందంతటను భక్తుని యావేశము మానసికక్షోభము కాళహస్తియందు వెలసిన భక్తజన పారిజాతమును కైలాసనాథుడు నగు పరమశివునియందచంచల విశ్వాసము గన్పడును. సముచితములగు ప్రకృతివర్ణనలతో, నలంకారములతో సంస్కృతభాషాభూయిష్ఠమై, గంభీరభావసంభృతమై యలరారుచున్న దీకావ్యము. కవి శివభక్తాగ్రేసరుడు తత్కృతిదర్పణమునందు మూర్తీభవించిన శైవభక్తుడుగా గోచరించును. వాని చిత్తము శ్రీ కాళహస్తీశ్వరునియందు తన్మయత్వమునందుటచే ప్రపంచము శివమయమై ధూర్జటికి దోచుచుండును. ఈ చంద్రోదయవర్ణన నెంత వింతగ నున్నదో గమనింపుడు.

మ. ఉదయగ్రావము పానవట్ట మభిషేకోద ప్రవాహంబు వా
రిదరధ్వాంతము ధూపధూమము జ్వలద్దీపప్రభారాశికా
ముది, తారానివహంబులర్పిత సుమంబుల్ గాద మోదూర సా
ఖ్యదమై శీతగభస్తిబింబశివలింగం బొప్పె బ్రాచీదిశన్

మఱియొక సందర్భమున నంధకారము నెటుల వర్ణించెనో చూడుడు.

కం. పంకేరుహ ప్రతిబింబము
గ్రుంకగ దిమిరం బజాండగోళము నిండెన్
శంకాతమః పరంపర
శంకరవిద్రోహితమానసంబునుబోలెన్

కమలాకరము కవికి పరబ్రహ్మస్వరూపమున గానవచ్చినది.

గీ. హంసనసంసదభీష్టవిహారహేతు
వై బహూదకవ్యాద్యమై యప్రతర్క్య
మగుచు నద్వంద్వమై పంకజాకరంబు
పొలిచె బ్రహ్మంబు తెఱగున బూర్ణమగుచు

ధూర్జటి యెంతటి శివభక్తుడైనను విష్ణునామశ్రవణాభావుడైన వీరశైవుడు కాడనియు, శివపూజాధురంధరుడగు అద్వైతియయియుండుననియుగదా యంటిమి. అద్వైతియయి శివకేశవులయం దభేదప్రతిపత్తి గలవాడయ్యు తన యిష్టదైవమైన శివమూర్తినే యారాధించి తరించె ననవలయును. శివకేశభేదభావ మీకవికి లేదనుటకీ పద్యము జూడుడు

మ. సకలాపూర్ణుడు నీలవర్ణుడనుటల్ సత్యంబుగా దెల్పు పో
ల్కి కరం బెంతకటినిండ దారకలు వోలెన్ నిర్జరాధీశ్వరా
దిక అర్పించిన పువ్వులట్ల శివుడద్దేవుండు భేదంబుగా
మికి దెల్లంబుగ నల్పుదెల్పుగ ధరన్ మించెన్ శశాంకాకృతిన్

భక్తిప్రధానమైన క్షేత్రమాహాత్మ్యమును కవి కావ్యసరణిని రచించుటచే తన యిచ్చవచ్చినటుల కథలమార్పుట సహజము. ఈ మార్పులు కూర్పులలో కవిప్రతిభ గన్పడుచున్నది. వివిధ యుగముల భక్తులేవిధముగ శివుని సేవించి తరించినదియు వివరింపబడినది. పూజావిధానము వేఱు. ఎవరి సంస్కారముల బట్టి వారి పూజావిధానముండును. తిన్నని యర్చనావిధానము శ్రుతివ్యవహారేతరము. శివబ్రాహ్మణుని పూజావిధానము వేఱు. వశిష్ఠ అజ లూతా, వాతాశన సామజ ఆటవిక గోత్రాదేవ నత్కీర రాజీవాక్షయుగ యాదవాధవుల కథాసూత్రములు దివ్యలింగ మాలంబముగ నల్లబడినవి. కృతయుగమునాటి సాలెపురుగు, త్రేతాయుగమునాటి సర్పము ద్వాపరయుగమునాటి యేనుగు, కలియుందలి యాటవికుడు సాయుజ్యము చెందుట ఇందు నిరూపితము. అర్చనవిధానము వేఱుకాని గమ్యస్థాన మొక్కటియే

ఈ నాలుగాశ్వాసముల కావ్యములో నున్న కథలలో మూడవ ఆశ్వాసమునందలి తిన్నని కథయు నత్కీరుని కథయు నాల్గవ ఆశ్వాసమునందలి వేశ్యకన్య కథయు మిక్కిలి రమణీయముగ రచింపబడినవి. ఈ కథలయందు కవికి గల సమస్తలోక ప్రవృత్తి పరిజ్ఞానము వ్యక్తమైనది. లోకముతో నింతపరిచయము

గల కవులంతగా లేరు. అందును రాజాస్థానమున కాలముగడపి
నాగరకులగు వారికీ చూపేయుండదు. ధూర్జటి మహానగరవాసి
యయ్యు మహాటవీమధ్యమున నున్న కిరాతుని జీవితచరిత్రము
నంతయు నెఱిగినవాడు. తిన్నని చరిత్రతో నీతడు చిత్రించిన
యాటవికకుటుంబము స్వాభావికమై యథాస్థితికి గొంచెమైన దూర
ముగాక స్వచ్ఛమై యీ కావ్యమునకు వన్నె పెట్టుచున్నది. ఆట
వికుల ఆచారవ్యవహారములు వారు తాల్చు నగలు తినెడు
తిండి, పండించు పంటలు, కొలుచు దేవతలు లోనగు సమస్తవిష
యములును ధూర్జటికి చిరపరిచితములా యనునట్లు వర్ణింపబడినవి.
ఇటులనే వేశ్యకన్యాకథలో వేశ్యాకుటుంబవర్ణన మతిస్వాభావిక
ముగనున్నది. వేశ్యమాత తన సంపాదనార్థము ఆడపిల్లల
బెంచి ధనసంపాదనవిద్యలనే వారికి నేర్పుననియు వంచనాబుద్ధి
వారికి ఉగ్గుపాలతో నలవడుననియు ఋజువర్తనమున వారు చెడి
పోకుండ వేశ్యమాత జాగ్రత్తపడు నను విషయముల నెన్నిటినో
విశదీకరించెను. గణికదారికల చరిత్రవర్ణనలో కవి పూర్వ జీవి
తానుభవము గోచరించునని కొంద ఱందురు.

ధూర్జటి శీలమును గుఱించి పలువురు పలు తెఱగుల బలుకు
దురు. భక్తాగ్రగణ్యుడయ్యు కాళహస్తీశ్వరుని పాదముల జేరు
టకు ముందు స్త్రీలోలుడై యుండవచ్చును. కాళహస్తిమాహా
త్మ్యమునందు సహితము కవి శృంగారరసమున పాఠకులను వ్వెత్తున
నత్తివైచి పుక్కిలిగింతలగునటుల దానియందు ముంచెను. అనేక
పద్యముల నుదాహరణములుగ జేర్కొనవచ్చును. కాళహస్తి
పుర వర్ణనమున శృంగారవర్ణన జూడుడు.

మ. ఎలదోట ల్వనము ల్వధూకుచము లద్రీంద్రంబు లాకంటికి
న్ఫలముల్వాతెరలంగజాగమకళా బంధంబులిచ్ఛాసనం
బులు కోపంబునబాయుటల్ తపము సంభోగంబు కైవల్యమం
దుల లీలారతి నుండు మానవుల కెందుంగాన మీ చిత్రముల్

సరస్వతీచతుర్ముఖుల సంభాషణసందర్భమునుగమనింపుడు

శా. వాచాగోచర మప్రతర్క్యము వినిర్ద్వంద్వం బసాధారణం
బాచోద్యం బతిలోక మప్రతిమపర్యాయంబు వర్ణింపగా
నీ చెల్వం బిది నిక్క మట్లయిన గానీ నాదు నీవంక వాం
ఛాచాపల్యము దీర నేరదు మనోజక్రీడలం గోమలీ

ఉ. అందున కొంతయుం బ్రమదమందుచు బుష్పితవల్లులందు సొం
పింగిర శాబకంబు పువుదేనియ గ్రోలెడురీతి నూర్వరన్
బొంది సుధాధరగ్రహణభూరిసుఖంబుల నొందుచున్ శతా
నందు డనంగ నొప్పెసగె నాడు మొద ల్కథలన్విధాతయున్

కం. తరుణీశతకము బింబా
ధరమాధుర్యంబు లానుతతి దమలోనన్
బరమేష్ఠి నాల్గుమోములు
వరుసలు పెట్టుకొను జెప్పవశమే కూర్మిన్

శివభక్తాగ్రేసరుడగు తిన్నని జన్మకుటూరగు వుడుమూరును వర్ణించుపట్టుల శృంగారప్రసక్తి విపరీతము.

ఉ. మంచెలమీద నెక్కి కటిమండలి జుట్టిన పాఱుటాకులిం
చిఱచుక చంచలించి బయల్పడ జేయ బిట్టలన్
కెంచెర లార్చి బ్రేయుదురు చిత్రముగా నొడిసెల్ల బాహుమూ
లాంచితదీధితు ల్చిఱుతలైన చనుంగవమీద బర్వగన్

శివభక్తాగ్రేసరు డగు తిన్న డున్న భూమివర్ణనయం దీశృంగారప్రసక్తి అవసరమా సమంజసమా

మాణిక్యవల్లీ వృత్తాంత సందర్భమున కొక్కోకశాస్త్ర వివరణము కూచిమారాదుల లక్షణముల ప్రసక్తిగలదు

ఉ. కోకిలవాణి పాడు దన కూరిమిబిడ్డల దొట్లబెట్టి కొ
క్కోకకళావిలాసములకుం గల యర్థము జోలపాటగా
నా కమనీయశైశవమునప్పటినుండియు వారధర్మ వి
ద్యాకళలత్వ మాత్మజల కచ్చుపడన్ వలె నంచు నిచ్చలున్

కం వనిత చతుర్జాతివయో
వనజాక్షుల బంధవైభవము భద్రుని ద
త్తుని కూచిమారు శాంచా
లుని వ్రాయించెన్ గ్రహంబులోపలి గోడన్

సీ "కూచిమారమనోజఘోణికా పుత్రాది
కామిత కామసిద్ధాంతములను"

ఈ కవికి శృంగారరసభూయిష్ఠవర్ణనయం దభిలాష యెక్కుడని ధ్రువపడుచున్నది కాళహస్తీశ్వరశతకములోని పద్యముల వలన కవి యౌవనదశయందు వారవనితాజనతాభోగలాలసుడనియూ వయసుమీఱి ఐహికసుఖములంబు విరక్తుడై పశ్చాత్తప్త హృదయుడై క్షోభించుచు చెప్పిన పద్యముల గనుడు

మ కాయ ల్గాచె వధూనఖాగ్రములచే గాయంబు వక్షోజముల్
రాయ బ్రాపడె బొమ్మ మన్మథవికారక్లేశవిభ్రాంతిచే
బోయెం బ్రాయము బట్టగట్టె దల చెప్పన్ రోత సంసారమే
జేయంజాల విరక్తు జేయగదవే శ్రీ కాళహస్తీశ్వరా

మ॥ కోపింపోయదు కామినీజనుల తారుణ్యోరు సౌఖ్యంబులన్
పాపింపోయదు పుత్రమిత్రజన సంపద్భ్రాంతివాంఛాలతల్
కోపింపోయదు నామనం బకట నీపం ప్రీతిగా సత్క్రియల్
చేసీచేయదు దీని త్రుళ్లణచవే శ్రీ కాళహస్తీశ్వరా

అది కాలమహిమ భోగలాలసులగు రాజులకు, రాజ పురుషులకు, ప్రజలకు నిట్టి శృంగారగాథలే యాదరణీయములయి నవి కవులెంత నిగ్రహము కలవారయినను, కొంతవఱకైన ప్రజలకు ప్రభువులకు ననుకూలముగ రచింపవలయును గదా సంఘమునకు ప్రజలకు చేదుమాత్రలకు జక్కెరపూతపెట్టి సద్బోధ చేయుని కావ్యరచనవలని ప్రయోజన మేమని ధూర్జటి స్వయముగ శృంగారప్రియు డయియుండవచ్చును కామిగాక మోక్షగామి కాడు' అనునట్లు లమొదట రాగభోగాదులకు దాసుడై వానిననుభ

నించి పిమ్మట విరక్తుడై తప్తమానసుడై కాళహస్తీశ్వరశతకము రచించియుండనోపు

ఇది యిటులుండ సర్వభావముల చేతను పరమేశ్వరు నారాధించుట భక్తిలక్షణము పరమభక్తియందు దుచితానుచితముల ప్రసక్తియుండదు అచట భక్తునకు నిష్టదైవమునకు మధ్య అరమరికలు లేవు సర్వము శివమయమైనపుడు లోకమున త్యాజ్యమే యుండదు అందును శివభక్తిపారమ్యము పద్ధతియే వేఱు బసవపురాణమున నిట్టి శృంగారభక్తుల కథలు కొల్లలు ఈశ్వరవిషయమున జుగుప్సాదులకు దావులేదు కాళిదాసు కుమారసంభవమున రత్యాదివర్ణనలు భాగవతమున కృష్ణబాల్య లీలావర్ణనల నెఱిగినవారికి వింత యనిపించదు అదివ్యుల విషయమున నిట్టి శృంగారము జుగుప్సాహేతు వగునుగాని ఈశ్వర విషయమున జుగుప్సాశ్లీలాదుల ప్రసక్తి లేదని యిట్టి రచనలను సమర్థించు మతము గలదు

కాళహస్తీశ్వరశతకము ఉత్తమశతకములలో నుత్తమము సుఖదుఃఖాది ద్వంద్వమునకువశమై పొంగిపొఱలెడుహృదయ వేదన నిర్భయముగ జగద్వంచనయు నాత్మవంచనయు లేక, స్పష్టముగా వ్యక్తము జేయుటయే భావకవిత్వ మయినయెడల నీ శతకమును మించిన భావకావ్యము మన సారస్వతమున లేదని విజ్ఞులు కొందఱందురు. ప్రవృత్తినుండి నివృత్తికి, భోగములనుండి త్యాగమునకు మఱలజూచిన కవి చరితార్థతకై స్వశక్తి చాలక యాత్మబలము ననుగ్రహింపుమని ఈశ్వరుని వేడుకొనుట ఈ శతకమునందలి పరమార్థము ఆత్మకృతదోషములకు గంపించుటయేగాని, లోకమునకు ధర్మబోధకొఱకుగాదీ శతకము కవి రచించినది ఈ పద్యముల జెప్పునప్పు డీశ్వరుని ముఖముదప్ప ప్రపంచమును కవి చూడలేదు తన తప్పులను మున్నె యెఱిగిన సర్వాంతర్యామియైన యాదైవము నెదుట తనతప్పుల నొప్పుకొని ప్రాయశ్చిత్తము వేడుకొనుటకు జంకలేదు ఈ ఋజుభావ వ్యక్తీకరణమున కేకాక,

భాషాప్రయోగదక్షతయందుగూడ నీ కావ్యమున ధూర్జటి యతి స్వతంత్రుడైన కవిగా గన్పట్టును ఈ స్వాతంత్ర్యము నీ హృదయార్పణమును, ఈ రసభావస్ఫూర్తియు వైరాగ్యాభిముఖత్వము కలిసి యీ శతకమున నున్నతస్థాన మొసగినవి పరమశైవుడును భక్తుడునగు ధూర్జటి తన పూర్వజీవితమందలి కల్మషవర్తనము నుండి విముక్తుడై ఐహికవాంఛలందు ఏహ్యభావము గలిగి పశ్చాత్తాపదగ్ధహృదయుడై, కాళహస్తీశ్వరు నారాధించి శివైక్యము నందెను

ప్రబంధయుగమున రచింపబడుటచేతను ప్రబంధోచిత వర్ణనలతో, శృంగారరసగాథలతో కావ్యరూపమున వెలుగొందుటచేతను భావబంధురాలంకారశోభిత మగుటచేతను కాళహస్తి మాహాత్మ్యమును కూడ ప్రబంధములలో జేర్చిరి ఇందలి ప్రధాన వస్తువు క్షేత్రమాహాత్మ్యము పైననుదాహరించినటుల పలువురు పలువిధముల కాళహస్తిక్షేత్రమును జేరి ముక్తులగుటయు నిరూపింపబడినది అంతమాత్రమున వస్త్వైక్యము గలిగినదని భావింతురు ఇటుల సరిపెట్టుకొని యీ కావ్యమును ప్రబంధ మగుటకన్న మాహాత్మ్యమనుటయే లెస్స పురాణయుగములో ప్రబంధములు ప్రబంధయుగములో పురాణములు వెలువడగూడ దను నిబంధన లేదుకదా కాళహస్తిమాహాత్మ్యమునసంసార బంధముల జిక్కి శృంగారలంపటులయి ఐహికసౌఖ్యములకే ప్రాధాన్యమిచ్చు నాటి ప్రజలకు కనువిప్పుగ ప్రబోధము కలిగించుటకు పరలోక చింతన పాపభీతి భగవద్భక్తి పరోక్షముగ బోధింపబడినవి ఆనందోపదేశము లేకదా సారస్వతప్రయోజనములు కాళహస్తి మాహాత్మ్యమునభక్తిభావమును శృంగారరసాచ్ఛాదితము జేసినను చివఱకు భక్తిభావమునందే కథలన్నియు పర్యవసించుటచే శాంతరసమే కావ్యఫలము

# 8

# రాయలనాఁటి యితరకవులు

అష్టదిగ్గజములలో ముఖ్యములయిన పెద్దనాదుల కావ్యముల నించుక పరిశీలించితిమి రాయలకృతమగు నాముక్తమాల్యద నాలోకనము జేసితిమి ఈ మహామహుని కాలముననే యుండి ప్రబంధరచనకు గడగిన ఇతరకవుల కావ్యములగూడ కొంతవఱకైన పరిశీలించినగాని ఆంధ్రప్రబంధపరిణామ స్వరూపము నిరూపితము కాదు

అయ్యలరాజు రామభద్రుడు — అష్టదిగ్గజములలో నొకడని చెప్పబడుచున్న అయ్యలరాజు రామభద్రకవి రాయల చివరి కాలమున నుండినటుల విమర్శకులు నిర్ణయించిరి రాయలు తాను చిన్ననాడు సంస్కృతమున రచించినసకలకథాసారసంగ్రహమ్మును తెనిగింపుమని రామభద్రుని కోరెనట కాని యా యాంధ్రకృత కావ్యమును జూచు భాగ్యము రాయలకు దక్కలేదు ఆ కావ్యమేమయినదో కాని ఈకవి రచించిన రామాభ్యుదయ మను కావ్యముమాత్రము నిలిచియున్నది అది కడపమండలమందలి ఒంటిమెట్టయందు వెలిసిన రఘునాథస్వామి కంకితమీయబడినది

రామాభ్యుదయమును సంక్షిప్తరామాయణ మని చెప్ప వచ్చును ఇది యెనిమిదియాశ్వాసముల కావ్యము మూల

కథను సంక్షేపించుచు నక్కడక్కడ కొన్ని ఘట్టముల దాటి వైచెను. ఈ గ్రంథమున సుందరకాండ మొక్కటియే రసవంత మైన భాగము. ప్రథమాశ్వాసమున బురవర్ణనాదులన్నియు జొప్పింపబడినవి. అయినను రసవంత మనదగిన దనరాదు. ఇందు పురవర్ణనాదు లన్నియు జొప్పింపబడినవి. వృద్ధరాజుజలక్రీడాదులు, భోగములు విపులముగా వర్ణింపబడినవి. అష్టాదశవర్ణనలు చేయ వలయునను సంకల్పమేకాని ప్రధానకథకు యెంతవఱ కవసరమో యను చింతయుండునటుల దోచదు. కథాప్రారంభమని పేరేగాని యీ యాశ్వాసమున కథయే లేదు. శ్రీమద్రామాయణము వేద సమ్మతము. వేదమే యిట్లు శ్రీమద్రామాయణరూపమున సాక్షాత్కరించిన దని భావింపవలయును.

"వేద వేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజె,
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షాద్రామాయణాత్మనా"

అటుల నాదికవి రచించిన రామాయణమధురకావ్యమును ఆంధ్రమున నాడును నేడును నెందఱెందఱో రచించినను కృత కృత్యులైనట్లు కన్పించదు. అందును పాండిత్యాది ప్రకర్ష కా కావ్యమునందు బొత్తిగా చోటు లేదేమో. అయినను దాని యందలి విషయవైలక్షణ్యము కవులను ప్రలోభుల జేసినది. కనుక నే కంకంటి పాపరాజు.

"వరుసన్ దిక్కనయజ్వ నిర్వచనకావ్యంబై రహిన్ జేసె న
తరరామాయణ మందులన్ దగ ప్రబంధం బూని నిర్మించు టే
సరసత్వంబని ప్రాజ్ఞులార నిరసించబోకుడీ రాఘవే
శ్వరు చారిత్రము నెంద ఱెన్నిగతులన్ వర్ణించినన్ జాలదే."

అని విషయము వైలక్షణ్యమును అత్యంతసరళముగాజెప్పి నాడు. ఈతని కవిత్వము రసవంత మనుటకన్న చిత్రకవితయనుట మేలు. కరుణరసప్రధానమగు ఘట్టములగూడ సీతని చిత్రకవితాభి లాష తలసూపి దానిని నీరసముగ జేసినది. ఈ యభిలాషయే కొన్ని యెడల ననౌచిత్యమునకు గారణభూత మయినది. గుణముల

కన్న దోషముల్లే యెక్కుడగుటచే ఆకాలమున బుట్టిన ఇతర కావ్యములతో నిది దీటుకాలేదు. ఇతని కవిత్వము సరసమేకాని శబ్దాలంకార ప్రీతిచే నీతడు చిత్రకవితావైభవమును సాధించెను. యమకానుప్రాసాదియుతమై శ్లేషాలంకార గుంభితమై శబ్దమాధుర్యము గలిగి స్వతంత్రములగు పోకడలతో చెలువొందుచున్నను రామాభ్యుదయ ముత్తమ ప్రబంధము కానేరదు

రాధామాధవకవి· అష్టదిగ్గజములలో నొక డనబడు చింతలపూడి యెల్లనామాత్యుడు రాధామాధవ బిరుదాంకితుడు. ప్రతిభావ్యుత్పత్తులు గల కవి రాధామాధవ మను శృంగార ప్రబంధ మతని కృతి ఇది రుక్మిణీకళ్యాణమును బోలియుండును భాగవతాదులయందు నిరూపింపబడిన మధుర భక్తిభావమువలె కాక ఈ కావ్యమున రాధాకృష్ణులకు వివాహము కల్పింపబడినది. దీనికి మూలమగు పురాణగాథ లేదు కేవలము కల్పితము కొందఱు దీనిని జూచియే పింగళిసూరన ప్రభావతీ ప్రద్యుమ్న కావ్యరచన జేసె నందురు అది సరికాదు ప్రభావతీ ప్రద్యుమ్నమునకు ఉషా పరిణయమునకు బోలికలు కలవు ఎల్లనార్యుడు తన కావ్యమును శృంగారరసప్రభావమును జేయ సంకల్పించి యీకల్పన జేసియుండ వచ్చును కవి యీకావ్యమును తన యౌవనదశయందే రచించె నని తోచును అయినను దీనియందు భవిష్యత్సూచకమగు భావు కవిత్వము ద్యోతకమగును ఈకవి విష్ణుమాయా విలాసమను నాటకమును ప్రబంధముగా రచించెను ఈ ప్రక్రియచే పినవీర భద్రుని ప్రబోధచంద్రోదయ కర్తలగు జంటకవులను అనుసరించె ననవలయును

మాదయగారిమల్లన - ఈతడు అష్టదిగ్గజములలోనొకడై రాయల యభిమానమునకు బాత్రుడైనకవి ఒక కావ్యమును రచించి రాయలకు కృతియిచ్చెనని చెప్పుదురు కాని యాకావ్యము లభ్యము కాదు రాయలంతటి రసజ్ఞ శేఖరుడు కృతినందెనన అది

యుత్తమకావ్యమై యుండవలయును అది లభ్యము కాకపోవుట ఆంధ్ర సారస్వతమున నొక యమూల్యరత్నము పోయినటుల భావింపవలయును ఈ కవికృతమగు రాజశేఖర చరిత్ర మను మధుర కావ్యము మూడాశ్వాసముల ప్రబంధము ఇతివృత్తము కల్పితమందురు శ్రీనాథుని హరివంశమునందువలె శివలీల లిందు వర్ణితములు ఈ కవి శైవమతాభిమానియయియుండును కాంతిమతీ రాజశేఖరుల వివాహము ఇందలి యితివృత్తము పరిమాణమున చిన్నదయినను గుణమున పెద్దగ్రంథములలో జేర్పదగిన చక్కని ప్రబంధము శృంగారరసము నిగ్రహముతో పోషింపబడినది సంయమపూర్వకమైన శృంగార రసపోషణ అమలినమై కావ్యమున కమూల్యాలంకారముగ బొసగినది చక్కని శైలిలో ధారావాహినిగా కవితసాగినది కవితాదృష్టితో జూచిన నుత్తమ జాతికి చెందిన ప్రబంధమని విమర్శకుల మతము

ఈతని కవితానియమము

చెప్పదగుఁ గవిత రసముల్
చిప్పిల నప్పప్ప బళిబళీయన లేదా
యెప్పుడు చేయకయుండుట
యొప్పునుమీ సుకవి యెంత యుచితజ్ఞుడోకో

ప్రాణకళ యొప్పుచున్న యీ పద్యము జూడుడు

'చందురువంటి నెమ్మొగము చక్కటి దూలగఁబుట్టు వెండ్రుకల్
కెందలిరాకుపాదములు గీల్కొనజేసిన యట్టి చిన్నపై
డందెలు గల్లుగల్లురననాడుచు నల్లన చేరవచ్చి నా
ముందర నాడునెన్నడొకో ముద్దియ ముద్దుకుమారు గాంచుటల్

ప్రభావతీప్రద్యుమ్నులకు రాయబారముజరిపిన శుచిముఖి ఒజ్జ యనందగు రాజిల్క కాంతిమతీ రాజశేఖరులమధ్య రాయబారము నెఱపినది అది తనను గూర్చి సగర్వముగా నిటు జెప్పుకొనినది

"వాదింతున్ బహువేదశాస్త్రకలనాపైయాత్య సంసిద్ధ న
వ్వేదవ్యాసులతోడనైన మదిసంవీక్షించి యెచ్చోటు నే
గాదన్నన్ మతి నిర్వహింపగ నశక్యంబేరి కస్మద్వచ
శ్రీదాంపత్యము నాక నాక యనుచో సిగ్గయ్యెడున్ భూవరా"

సంకుసాల నృసింహకవి — రాయల కాలముననుండియు ఆస్థానమును జేరక అష్టదిగ్గజములలో నొకడుగా నుండదగిన ప్రతిభాశాలి సంకుసాల నృసింహకవి రఘువంశీయుడగు మాంధాత విమలాంగిని వివాహమాడుట అను స్వల్పవిషయమును కథావస్తువుగ స్వీకరించి ఆఱాశ్వాసముల బృహద్గ్రంథముగ వర్ణనా వైదగ్ధ్యము మెఱయ వెలయించినాడు ఈ వర్ణనలలో శృంగార భావమునకు ఆధారములయిన వర్ణనలన్నియు గలవు మొదటి నాలుగాశ్వాసములు అష్టాదశవర్ణనాత్మకములు శృంగారరస ప్రధానములు అయిదాఱాశ్వాసము లన్ననో వైరాగ్య ప్రబోధకములు ఇతడు శృంగార వైరాగ్యముల సమముగ పోషించినకవి

గీ యతి విటుడు కాకపోవు టెట్లస్మదీయ
కావ్యశృంగార వర్ణనాకర్ణనమున?
విటుడు యతిగాకపోవు టెట్లస్మదీయ
కావ్య వైరాగ్యవర్ణనా కర్ణనమున?

అని సగర్వముగా జెప్పుకొనినటులున్నను అది స్వభావోక్తియే కాని అతిశయోక్తి కాదు ఈ కావ్యము చదువునపుడు తత్పూర్వప్రబంధములు స్ఫురణకువచ్చును. ఆ యా గ్రంథముల యెడ గౌరవమునగాని వానికన్న మిన్నగ వ్రాయవలయునను తలంపునగాని కవి యట్టి రచనలు చేసియుండవచ్చును ఈ కావ్యమునందలి రాజనీత్యుపదేశము విష్ణుచిత్తీయమున యామునాచార్యుడు తన పుత్రునకు రాజనీతిబోధించిన ఘట్టమును స్ఫురింప జేయును నాల్గవ ఆశ్వాసమునందలి వర్ణనలు నన్నెచోడుని కుమారసంభవమందలి వర్ణనల బోలియున్నవి ఈ కావ్యపూర్వ భాగమునందలి వేశ్యావర్ణనయు పానక్రీడాదివర్ణనలు ధూర్జటి

కాళహస్తిమహాత్మ్యమునందలి వర్ణనల బోలియున్నవి నాచన సోముని భావముల పలుకుబడుల బోలినవిగలవు ఈ కావ్యమునందలి వేదాంత విషయములైన వర్ణన లింత విపులముగానే ప్రబంధమునందును వర్ణితమునుగావు దీనినిబట్టియే యీ కవి బ్రహ్మవిద్యావేత్తయని రూఢిగ జెప్పనగును ఈ కావ్యమునందలి వర్ణనలు సందర్భోచితములు వర్ణనకొఱకే చేయబడినవిగా కనబడవు కవిసమయ శృంఖలాబద్ధముగాక స్వతంత్రమై వినూత్నమై వర్ణన లొప్పుచుండును వీనియందు కవి సూక్ష్మాతి సూక్ష్మపరిశీలనాశక్తి ప్రకృతివర్ణనల భావప్రకాశము గన్పడును ఈతనికి స్వాతిశయము మెండయియుండవచ్చును స్వశక్తియం దాత్మవిశ్వాసము గలుగుట దీనికి హేతువై యుండును అందుచే నితరకవులయెడ నిరసనభావముకూడ నుండునేమో ఇతర కవులతో జేరక కవిత గల్గిన సామ్రాజ్యకాంతు యేల''యని ఏ ప్రభువును ఆశ్రయింపదగినవానినిగా భావింపలేదేమో లేక మరే కారణమునగాని పండితులను కవుల నాదరించి పోషించు సారస్వతాభిమాని విద్వత్ప్రభువగు రాయలచే సన్మానమందు భాగ్యమునకు నోచకొనలేదు అయిననేమి స్వతంత్రుడై ఆంధ్ర సారస్వతమున తన పేరు చిరస్థాయిగా నొనర్చుకొనెను పూర్వభాగమున ఎంత శృంగార రసపోషక వర్ణన లున్నను ఉత్తరభాగమందలి వైరాగ్య బోధ ఆ విషయము లన్నియు నిరర్థకములని ఋజువుచేయుటచే శాంతము నందే యీ కావ్యము పరిసమాప్తి జెందినది ఇతరుల ఆదరాభిమానములకై దేవులాడక ప్రభువుల ధనవంతుల నాశ్రయింపక సాటి కవుల మెప్పునకై అనునయించక స్వతఃప్రతిభచే ఈ కవివలె నిలువగల కవులు పెక్కురు లేరు



# 9

# ప్రభావతీ ప్రద్యుమ్నము

[పింగళి సూరన]

రాయల యుగమని వాకొనబడు ప్రబంధ యుగమందలి కవులను రెండు వర్గములుగ విభజింపవచ్చును రాయల కాలము నుండి యావిద్వత్ప్రభువు ఆస్థానమున పూజితులైనవారొక వర్గము. రాయల మరణానంతరము కావ్యములను రచించి విఖ్యాతులైన వారు రెండవ వర్గము మొదటివర్గమునకు నందితిమ్మన, పెద్దన, ధూర్జటుల బోలినవారు ప్రతినిధులు రెండవ వర్గమునకు పింగళి సూరనామాత్యుడు, రామరాజభూషణుడు, తెనాలి రామకృష్ణుడు ప్రతినిధులు పారిజాతాపహరణమును బోలినది ప్రభావతీప్రద్యుమ్నము మనుచరిత్రను బోలినది వసుచరిత్రము, కాళహస్తి మాహాత్మ్యమువంటిది పాండురంగమాహాత్మ్యము తిమ్మన తన పారిజాతాపహరణప్రబంధమున కేతివృత్తమును హరివంశమునుండి గ్రహించెను ఆ హరివంశ ఖనినుండియే సూరనయు ప్రభావతీ ప్రద్యుమ్నమునకు మూలకథను త్రవ్వియెత్తి సానలుదీరిన జాతి రత్నముగ రూపొందించినాడు తిమ్మన ఆంధ్రసారసత్వమునకు పారిజాతాపహరణ నిర్మాణమువలన జేసిన మేలును మించి సూర

నకు హరివంశ మను గనిని జూపి మేలు జేసినాడు రెండును సర్వలక్షణసముపేతములగు మధుర ప్రబంధములు ఆ యుగ పూర్వభాగమున రచింపబడిన పారిజాతాపహరణము నాటకలక్షణములను సంతరించుకొన్నది ఉత్తరభాగమున రచింపబడిన ప్రభావతీప్రద్యుమ్న ప్రబంధము నాటకీయరచనలం దగ్రగణ్యము పెద్దనవలె రామరాజభూషణుడు తన వసుచరిత్రను కొంతవఱకు నాటకీయముగనే దిద్దినాడు కాని యతని ప్రయత్నము సంపూర్ణముగ సఫలమైన దనజనదు ఆ గ్రంథమునందలి పాత్రలు నిర్జీవములు పాత్రచిత్రణాదులును అంత జయప్రదములుగావు

తన కృతులను గూర్చి

మ. జనము మెచ్చగ మున్రచించితి సుదంచద్ద్వ్యర్థిరిం గారుడం
బును శ్రీ రాఘవపాండవీయము, గళాపూర్ణోదయంబు న్మతి
ద్దనుగుం గబ్బము లెన్నియేనియును మత్పిత్రాదివంశాభి వ
ర్ణన లేమిం బరితుష్టి నా కవి యొనర్పంజాల నత్యంతమున్

అని సూరనయే ప్రభావతీ ప్రద్యుమ్న ప్రబంధావతారికయందు జెప్పినాడు అందు రాఘవపాండవీయము కళాపూర్ణోదయము ప్రభావతీ ప్రద్యుమ్నములు మాత్రమే ప్రచారములోనున్నవి మిగిలినవి కాలగర్భమున అదృశ్యమైనవి ఇతడు 'నిఖలసూరి లోకాంగీకారతరంగిత కవిత్వచాతుర్యధుర్యుండు' ఈ మహాకవి గ్రంథములను పరామర్శించుటకు పూర్వము, అతని కవితామతమును గ్రహించుటయు నవసరము సూరన పెద్దనగారి మనుమరాలిని వివాహమాడెనను కథమాట యెటులున్నను సూరన రాయల కాలమున రామకృష్ణునివలె బాలుడనియు రాయల ఆస్థానమున లేడనియు నూహించుటకు బనికివచ్చును ఈ కథకనుకూలముగనే ఈతని ద్వ్యర్థికావ్యరచనగూడనున్నది రాఘవపాండవీయ రచనయందు తన యుభయ భాషాపాండిత్యమున కే ప్రాధాన్య మిచ్చినటుల తోచును వేఱొక సంకల్పమున్నటుల గన్పడదు ఆనాటి యాతని కవితామతము జూడుడు

సీ. ఆంధ్రభాషాసంస్కృతాఖ్య భాషాశ్లేష
  యొక్కొక్కచోట, నొక్కొక్కచోట
నుచితశబ్దశ్లేష యొక్కొక్కచోట న
  ర్థశ్లేష యొక్కొక్క తఱిని ముఖ్య
గౌణవృత్తిశ్లేషఘటన యొక్కొక్కతఱి
  నర్థాన్వయము వేఱె యగుచునునికి
శబ్దాన్వయావిభేదసంగతి యొక్కొక్క
  తఱి నివి యొక్కొక్కతఱిని రెండు

గీ. మూఁడు గూడుట్రయును నవసముజ్జ్వలముగ
నాఁట దోఁచినగతి బెక్కు పోక లమర
రామభారతకథలు పర్యాయదృష్టిఁ
జూచువారల కేర్పడ నాచరించు

ఈ గ్రంథమును సూరన తన యౌవనదశయందే రచించి యుండును ఈ గ్రంథరచనానంతరము కవి తన కవితామతమును మార్చుకొనినటుల గన్పట్టును భారతకవులవలెనే తన కావ్యము జనసామాన్యులకుగూడ ప్రయోజనకారి కావలయు నని భావించి నటుల దోఁచును, కేవలము పాండిత్య ప్రకర్షయేకాక భావనా శక్తి నుద్దీపింపజేయునట్టిదియు, కవితా వైదుష్యము వెల్లడించు నట్టిదియు నై సకల లక్షణలక్షితంబై కావ్యముండవలయు నని తలంచినటుల భావించవలయును తన కవితామతమును మార్చు కొనె ననుట కాధారములు కలవు

సీ. విశ్రామ విహతి గావింపక సారస
  త్సాహిత్య సౌమనస్యంబు లెఱిఁగి
సమయంబు దప్పక శ్రవణకఠోరంబు
  లైన శబ్దముల నత్యాపలాత్మ
చేయక సత్పరిచితనుతమాత వా
  క్సరళితాభిప్రాయిగా నొనర్చి
పదబంధశిథిలత వాటిల్లగానీక
  యేచ్ఛందసులయందు నేమఱిక

ఆ. వె. పరగ కవియు దోషాకరుడును యశము దు
గ్ధమును బడయునటుల గానివాడు
కృతిదురాప మొదవు కీర్తియు శాలునీ
కంటగాదు హాస్యయోగ్య చేయు

కవితంగూర్చి చెప్పిన కవులలో నింత చమత్కారముగ జెప్పినవారు లేరు ద్వ్యర్థికావ్యకవి యనిపించినాడు తన కవితా తత్త్వమునుగూర్చిన తన హృదయవికాసమును గథాసందర్భముల నవకాశము గల్పించుకొని సూచించుచునే యున్నాడు

సీ. పొసగ ముత్యపుసరుల్ పోహళించినలీల
దమలోన దొరయు శబ్దముల గూర్చి
అర్థంబు వాచ్యలక్ష్యవ్యంగ్య భేదంబు
లెఱిగి నిర్దోషత నెసగ జేసి
రసభావములకు సర్వాంబగు వైదర్భి
మొదలగు రీతు లిమ్ముగ నమర్చి
రీతుల కుచితంబులై తనరారెడు
ప్రాణంబు లిమ్ముగా బాదుకొల్పి

గీ. యమర నుపమాదులును యమకాదులు నగు
నట్టి యర్థశబ్దాలం క్రియలు ఘటించి
కవిత చెప్పంగ నేర్చు సత్కవివరునకు
వాంఛితార్థంబు లీయనివారు గలరె?

కళాపూర్ణోదయరచనా డీభావములు గల సూరన ప్రభావతీప్రద్యుమ్నము రచించునాటికి తన కవితామతమును మార్చుకొనినటుల గన్పడును

సీ. శబ్దసంస్కార మెచ్చటను జారగనీక
పదమైత్రి యర్థసంపదల పొదల
దల పెల్ల నక్లిష్టతను బ్రతిపంపగా
బునరుక్తిదోషంబు పొంతబోక

యాకాంక్షితవ్యాప్తియా చరించుచును శా
ఖాచక్రమక్రియ గడవజనక
ప్రకృతార్థభావంబు పాదుకో నడుపుచు
నుపపత్తి యొందు నతర్క్యార్జితముగ

గీ నొకట బూర్వోత్తరవిరోధ మొందకుండ
దత్తదవయవవాక్యతాత్పర్యభేద
ములు మహాకావ్యతాత్పర్యమునకు నొనర
బలుక నేర్చుట బహుతపః ఫలము గాదె

## 2

ఈ కవి రచించిన తొలికావ్యము రాఘవపాండవీయ మని గదా యంటిమి ఇది ద్వ్యర్థికావ్యము ఆ కావ్యరచనకు కవి నిర్ణయించుకొనిన రీతులను కవియే తన గ్రంథావతారికయందు విశదీకరించినాడు ఇది ఆంధ్రభాషయందు తొలి ద్వ్యర్థికావ్యమనవలయును భీమన తొల్లి రచించెనను మాట కలదు కాని యాగ్రంథ మెచటను గానరాదు ముందు గనబడు ననుటకు నాధారములు లేవు ఇది తరువాతి ద్వ్యర్థిత్ర్యర్థికావ్యముల కొజ్జయై మార్గదర్శకమైనది సూరనపాండిత్యప్రకర్ష కవితానైపుణ్యము ఈ పద్యముల గమనింపదగును

మ తలఁపం జొప్పడి యొప్పె నప్పుడు తదుద్యజ్జైత్రయాత్రాసము
త్కలికారింఖదసంఖ్య జయవత్కంఖాణరింఖాతి శృం
ఖల సంఘాతధరాపరాగ పటలాక్రాంతంబు మిన్నేరన
ర్గళభేరీరవనిర్దళద్గగన రేఖాలేప పంకాకృతిన్

మ అసమామ్నాయ నయాధ్వరక్షణ విఘాతాపాదిరై మించు రా
క్షసకర్మంబునకుం దలంకక సమగ్రస్థైర్యధారేయ మా
నసులై డెందములోన ధర్మపతి మందద్భీమ సేనాంగ ద
ర్పస ముద్రేకము రూపుమాప గణితప్రారంభులై రంతయున్

" రాఘవపాండవీయము క్లిష్టార్థములు లేకుండమృదుమధుర సులభ పదములతో రామాయణభారతార్థములు వచ్చునట్లు రచింపబడిన శ్లేషకావ్యము ఇంతటి సులభ శైలిలో సంపూర్ణశ్లేష కావ్యమును రచించుట మఱొకరికి సాధ్యముకాదు తిక్కన సోమయాజి తరువాత నింత ప్రౌఢముగా గవిత్వము చెప్పిన తెనుగు కవి మఱియొకడు లేడు " అని కందుకూరి వీరేశలింగంపంతులు గారి భావమెంతయు సమంజసము

సూరన కాలమునాటికే విజయనగరసామ్రాజ్య వైభవము క్షీణింపసాగినది రాయలకాలమున కవిపండితులయెడ రాజుల కున్న గౌరవభావ మంతగ గన్పడుటలేదు. ఆ స్థానము నాశ్రయించుకొని కవులుండిరిగాక మహారాజుల పోషణ ఆదరణల నుండి సాహిత్యపోషణము మండలాధిపుల మంత్రిసత్తముల, సారస్వతాభిమానుల యండ జేరినది మొదటినుండియు ప్రభువులతో పాటు వారి యమాత్యులును సాహిత్యపోషకులే, సాహితీపరులే వారిలోను ప్రఖ్యాతులగు కవులు గలరు ' కవిపండితులకు ' ఈయగల, ఇప్పించగల యయ్య' లని కీర్తిగాంచిరీ యామాత్యశేఖరులు రాఘవపాండవీయము పురాణము ఆకివీడుప్రభువగు పెద వేంకటాద్రి కంకితమీయబడినది పురాణమైనను అది వెలువడిన కాలము ప్రబంధయుగము

ప్రభువులు భోగులు సుఖలాలసులు ప్రజలును అంతియ్యే, వారికి కాంతాసమ్మితములగు కావ్యములందున్న అభిలాష పురాణములందు లేదు ప్రబంధరచన మన సూరనకవీంద్రు నాకర్షించుటయే కాదు, ప్రబంధరచన కాతడుద్యుక్తుడైనాడు అతని తొల్లిప్రబంధము కళాపూర్ణోదయము పురాణాంతర్గతములైన యుపాఖ్యానములు స్వీకరించి వానిని ప్రబంధోచితవర్ణనాద్యలంకృతులతో నొక స్వతంత్రకావ్యముగ రచనసేయుట ప్రబంధ శాఖకు ముఖ్యలక్షణము ప్రబంధకవులు ఉపాఖ్యానములకొఱకు పురాణముల వెదకసాగిరి ఎల్లరకు శృంగారరసప్రధానములైన

కథలు కావలసివచ్చెను అవి దొరకుట కష్టమాయెను దొరకిన కథలయందు సహితము కథాప్రవర్తనకు హేతుభూతములైన పాత్రలు దొరకలేదు కవులలో చాలమంది పాత్రల వర్ణింపగలరే కాని చిత్రించలేరు వేత్తయు, భావుకుడు నగు కవి కేవలము కథాకథనముతో దృప్తినందడు అతడు ప్రత్యక్షలోక పరిశీలనవలన తాను దర్శించిన జీవితరహస్యములను వ్యంగ్యముగా కావ్యమున ధ్వనింపజేయును తన అనుభవమునకును తాను ప్రతిపాదింపదలచిన జీవితధర్మములకు ననుకూలములైన ఉపాఖ్యానములు పురాణములలో పూర్వగాథలలో లభింపనప్పుడు తన కథాప్రపంచమును తానే సృజించుకొనును ప్రబంధరచనయందు మనసునిలిపి క్రొత్తపోకడలతో సూరన కళాపూర్ణోదయమును రచించుటకు కారణము నీయవియే యయియుండును ఆ కాలపు వారి కీ క్రొత్తపోకడ నచ్చలేదు ఈకాలమునగూడ కొందఱట్టివారుండవచ్చును కాని వారు అల్పసంఖ్యాకులు ఈకావ్యము ఆకాలపువారికి నచ్చకపోవుటకు గల కారణముల నరయుదము ఇతివృత్తము పురాణాంతర్గతగాథ కాదు కేవలము కల్పితము నాయకుడుగాని నాయికగాని ప్రఖ్యాతులుగారు కథాకథనము కాలభ్రమణగతముగాక కార్యకారణసంబంధియై వక్రమార్గమున నడచినది వేశ్యయగు కలభాషిణి ప్రధానపాత్రగ కథ నడచినది శృంగారరసపోషణ సమయసిద్ధమై, అలంకారికులు నిర్ణయించిన హద్దులలో పోషింపబడలేదు అలంకారశాస్త్ర నిర్దేశములుమాత్రమే శరణ్యములుగా దలచు పండితులకు నచ్చలేదు వారిచుట్టు హద్దులు నిర్ణయించుకొనిరి పరిమితపరిధిలో నున్నవారి కీ నూతనస్వతంత్రసృష్టి నచ్చలేదు వారు దానిని సహింపరు సర్వప్రబంధసాధారణమై శాస్త్రనిర్దిష్టస్వరూపము గల దానిని మాత్రమే వా రంగీకరింతురు కాని ప్రత్యక్షలోక దృష్టమై సహజమైనదానిని భావింపజాలరు భావించిన వారి మెచ్చజాలరు

3

ప్రబంధరచనయందు మనసు నిలిపి క్రొత్తపోకడలతో రచింపబడి సర్వకాలములవారికి నానంద మొనగూర్చు నవరసపూరపూరితమగు మహాకావ్యము కళాపూర్ణోదయము ఆ కావ్యమందలి కథాకథనవిధానముతో ఈ కాలమున ప్రఖ్యాతి గన్న కాల్పనిక ఆఖ్యాయిక లేవియు సాటిరావు కథ కేవలము కల్పితమయినను, కథాకథన మడుగడుగునకు విలసిల్లు క్రొత్తందనముతో అల్లిబిల్లిగ నల్లబడి చదువరులకు కొన్ని యెడల కథాగమన మనుసరించుటలో చిక్కులు గల్గించును ఇంకను చదువవలయు నను ఆకాంక్ష గలిగించుచుండును ఈకావ్య మనేకరీతులగు నర్థములు గలది సాధారణ దృష్టితో జూచిన కథ ఒక దృష్టితో జూచిన కేవల మూహాపేతమయినది మఱొకవంక వేదాంతదృష్టితో చదువదగినది ఇటుల బహువిధ రచనానైపుణ్యముతో నొప్పు నీ గ్రంథమును విమర్శనాత్మకమగు దృష్టితో భావపుష్టి గల పదములతో రసస్ఫోరకముగ సాగించినాడు ఈ కావ్య మపూర్వమగుటకు కవి పాత్రలమూలమున తన కథను తానే అటనట విమర్శించుకొనుటయు కథాచమత్కృతికి నుత్కంఠ బెంచుటయు సాధనములు నాటకరీతిని సంభాషణాదులచే వృత్తముల బ్రకటించుటలో నీ గ్రంథ మసదృశము కథాప్రారంభముననే యెన్ని పాత్రలనో ప్రవేశపెట్టినాడు ఆపాత్రలన్నియు ప్రధానభూమికలే. వర్ణనలు సముచితములు ప్రత్యేక ప్రయోజనముల నిర్దేశించి చేయబడినవి అన్నియు రమ్యములు పద్యములు భావగాంభీర్యయుతములై యుండి భవిష్యత్కథాసూచకములు

మ. తమి బూదీగెల తూగుటుయ్యెలల బంతాలాడుచుం దూగు నా
కొమరుం బ్రాయపు గబ్బిగుబ్బెతల యందంబుల్ చక్కగా జాగి మిం
ట చెంగంబై చనుదెంచు తీవి గనుగొంటే దివ్యమౌనీంద్ర నా
కమృగీనేత్రలమీద గయ్యమున వంగాల్పాచు లా గొప్పెడున్

మ బళిరా సత్కవి వౌదు నిక్కము తగన్ భావింప నీవన్న యా
యొల ప్రాయంపు మిటారికత్తెల బెడంగే నెందునుం గాన వా
రల డోలాచలనోచ్చలచ్చరణముల్ త్రైవిష్టప స్త్రీల యా
దల దన్నంజనునట్లు మించె ననిషం దప్పేమి యొప్పే యగున్."

కం నినుబోలు వనిత నీవను
వనజముఖీయితని బోలువా డితనికిన్ నెం
దును గల్గికలచునో యి
ట్టి నిగాఢపు మదను సొంపు రీవుల్ చనుసే

గీ కామ్యమున్న నీ వాత్మలో గోరినట్టి
కాంతు రంభామనోహరాకారు డగుచు
మెఱయు వానిని గూడి రమింపగలవు
నమ్ముమా మ్మిక నీభవనమున కనియె

ఇందు ప్రతిపదము తూచి వాడినాడు ప్రతిదియు భవిష్య
థకు సూచకమే కథాకల్పనా చమత్కృతి పాత్రచిత్రణవశం
వదమైన కథావికాసము, పాత్రోన్మీలనము పాత్రల స్వభావాను
గతమైన భాషారచన లోనగు సారస్వతశిల్పధర్మముల కన్నిటికి
కళాపూర్ణోదయమే నిలయము ఇందు కావ్యకళ పరిపూర్ణవిరామ
మందినది

విశ్వవిలాసకారణ మగు ప్రణయభావ మధికారి తారతమ్య
ములబట్టి ఎన్నివిధముల వర్తించుచుండునో ఎట్టి రూపాంతరములు
బొందుచుండునో విచారించి చూపుటయు, బ్రహ్మసంకల్పమున
నర్థము చెప్పుటయు కళాపూర్ణోదయ కావ్యప్రధానోద్దేశములు
ఈకథకు మూలబీజము సరస్వతీచతుర్ముఖుల ప్రణయకలహము.
అది యీకథాభారమునకు గర్భస్థాన మాక్రమించినది పూర్వో
త్తరగాథలన్నియు దానిమీద నాధారపడి యున్నవి ఇది యపూ
ర్వకథాసంవిధాన వైచిత్రీమహనీయంబును శృంగారరస ప్రాయం
బును పుణ్యవస్తువర్ణనాకర్ణనీయంబునగు కావ్యము ఈకావ్యమున
నాలుగువిధములగు శృంగారము నాలుగుకథలలో కలదు అది

సరస్వతీ చతుర్ముఖ రహస్యకేళీ విలసనము, కలభాషిణి మనోహర గాథ సుగాత్రీశాలీనుల విచిత్ర చరిత్ర, అభినవకౌముది శల్యాసురుల రసాభాసప్రణయము. అన్నియు రసోపేతముగ మేళవింపబడినవి కళాపూర్ణోదయము సూరన నూతనకావ్యసృష్టికి బాటలు దీర్చి రసప్రపంచమున స్థిరనివాస మేర్పఱచుకొనినది అయినను నలంకారికుడగు రామరాజభూషణుడు తాను ప్రవచించిన సిద్ధాంతముల పరిధిని దాటజాలక కళాపూర్ణోదయమును 'కేవలకల్పనా కథలు కృత్రిమరత్నములు' అని అవహేళన జేసినను జేయుగాక కీ॥ శే॥ కట్టమంచి రామలింగారెడ్డివంటి ధీశాలురగు విమర్శకుల పొగడ్తగన్నది అభినవవాగనుశాసనులు మహామహోపాధ్యాయులు, బహుగ్రంథకర్తలు కవులు అయిన బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారివంటి పండితప్రకాండులమహామహుల ప్రశంసల నందినది వారేమనిరో గమనింపుడు

ఉ॥ కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము లన్నమాట వా
గ్దేవి గణింపకుండగ దదీయవిలాసమె యూహచేసి మే [illegible]
ధానిధి కల్పితాద్భుతకథామణిహార మొనర్చి యిచ్చె స
ద్భావుడు సూరనార్యుడు సెబాసని యామె గ్రహించి మెచ్చగన్

కం॥ అదియె కళాపూర్ణోదయ
మది పొందలుగ నింతదనుక నంతకు మున్ని
ట్టిది పుట్టలేదు తెల్గున
విదితం బది వివిధకావ్యవిజ్ఞాతులకున్

ఈ కావ్యమందలి మఱియొక పద్యమును జూడుడు

మ॥ తనకంటెన్ బ్రియ సీత లేదు తన సౌందర్యంబె సౌందర్యమం
చును గర్వించుచునున్న రంభమదమున్ జూడంగ లేకిట్టిదా
నిని నీవే సృజియించితో, యదియ తా నీతోడ గ్రీడింపగా
తన మేనొక్కటి చాలదంచు గడకన్ ద్వైరూప్యముల్ దాల్చెనో

రంభమాయారంభల అవతరణకు నారదు డనిన కా
ణము విని భవిష్యకథను సూచించు నీ పద్యముల జూడుడు క

భాషిణికి రంభకు సవతునిజేయ సంకల్పించి నారదుడు కలభాషిణి నెటుల ప్రోత్సహించుచున్నాడో—

కం సవతియని నింకనొక తెన్
భువిలోపల వేఱ వెదకబోవలయునె యో
నవకాంక్షి నీవ కానే
నవ దైవనియుతి గొంత పాప్తిగలిగినన్.

అనుమానించుచున్న కలభాషిణితో 'రంభ మొదలైన యే యచ్చరలకునైన దక్కవే నీదు రూప సౌందర్య మహిమ లెక్కడేగాక'' అని నారదు డుబ్బించినాడు భక్తుని రూపవర్ణనము జూడుడు

ఉ అక్కజమైన భక్తి తనరార నతం డనయంబు కృష్ణునిం
దక్కగ యాత్మ జూచి ప్రమదంబుక పొంగుచు తెంగలించుచున్
జొక్కుచు మ్రొక్కుచుం బొగడుచుం బులకించుచు
కన్ను మోడ్చుచున్
మిక్కిలి చోద్యమందుచును మెచ్చుచు పాడుచు నాట్యమాడుచున్.

కం కేవలము నతిప్రేమ ర
సావేశవశంవదాత్ముడై తద్గుణముల్
భావించుచుం నొకరీతిం
ద్రోవగనుచు నేగె నారదుండు నిజేచ్ఛన్

4

ఈ కవి రచించిన మూడవ కావ్యము ప్రభావతీ ప్రద్యుమ్నము ఇది ప్రబంధలక్షణముల నన్నిటిని దృప్తిపఱచిన ఆదర్శ ప్రబంధము తనను అవహేళన జేసినవారికి సమాధానముగ తన ప్రజ్ఞావిశేషమును బ్రదర్శింప రచించిన ఆదర్శ కావ్యము. ఈ యుగములో ప్రబంధ లక్షణములకు గట్టుబడిన మధురకావ్యములు పారిజాతాపహరణము ప్రభావతీప్రద్యుమ్నములే ప్రభావతీ ప్రద్యుమ్నము సాక్షాత్తు శ్రవ్య కావ్యరూపము దాల్చిన దృశ్యకావ్యము తెలుగు ప్రబంధములలో సాధారణముగ

గన్పడు కథావిస్తృతియో, వర్ణనాధిక్యమో అనావశ్యకప్రాసంగిక కథనమో, కథైక్యరాహిత్యమో పాత్రనిర్జీవత్వమో ఏదో ఒక లోప ముండును' అను ఆచార్య పింగళి లక్ష్మీకాంత బుధవర్యుల పలుకు లెంతయు యథార్థములు ఈ కావ్యమున నట్టి కొఱత లేమియు గానరాక సర్వలక్షణములు సంపన్నములైనవి ఈ గ్రంథరచననాటికి సూరన తన కవితామతమును మార్చుకొనె నని యిదివఱకే గ్రహించితిమి కీ॥ శే॥ రామలింగారెడ్డిగా రని నటుల ప్రభావతీప్రద్యుమ్నములో నలంకారశాస్త్రమును గూర్చి విచారచిహ్నము లేవియు లేవు శబ్దాలంకారముల గూర్చి కవి యుపేక్షింపక పోవుటయేగాదు అర్థాలంకారములనైన ధ్యానించి నటుల గన్పడదు భావములు, అర్థములు తాత్పర్యములు, అవయవసంయోగము మొదలగు తలంపులతో జేరిన లక్షణముల మీద నేకాగ్రమైన దృష్టినిలుపుట మేలని యెంచెనేమో' అంత మాత్రమున అలంకారరహితమై సారహీనమైన కావ్యముకాదిది ప్రభావతీప్రద్యుమ్నము మృదుమధుర శైలిని రచింపబడినది అలంకారములు సరసములై, యుచితములై కావ్యశోభను ఇనుమ డించుచున్నవి ధ్వనిప్రధానమై భావగర్భితమగు రచన యెల్లెడ సాగినది ఇదియుంగాక కళాపూర్ణోదయ రచనానంతరము ప్రభావతీప్రద్యుమ్న కావ్యరచనదశయందు గవిత దేవతారాధనకు సాధనమను తలపు తిక్కనాదులకుబలె సూరనకును గలిగియుండు నని భావించవలయును దానంజేసి తన కవిత్వమును పరాంకిత ముగా వినియోగింపక కవితయందు పవిత్రభావమును వరించి తన్మూలమున బిత్రు దేవతారాధన గావింప నిశ్చయించుకొనినటుల సూరన దగు నీ పద్యమువలన దెలియనగును

కం ఏనుం బిత్రుపూజన నా
చేసైన న్లొట్టిదియైన జేయగవలయుం
గాన కృతియిచ్చి మేదిని
పై నిలిపెద నతని కీర్తి బరమేశు కృపన్

దేవతా పితృదేవతారాధనములకు మహోత్కృష్టమైన మార్గమై తన్మూలమున నాముష్మికసుఖోన్నతిని బ్రసాదించుటయే గాక యైహికవైభవోన్నతికిగూడ గవిత్వ ముత్తమసాధనమని కవుల మతము

ప్రభావతీప్రద్యుమ్న కావ్యమునకు మూలమైన ఇతివృత్తము హరివంశమునుండి గ్రహించబడిన దంటిమి. ఇది ఉషాఅనిరుద్ధుల ప్రణయగాథను బోలియున్నది కాని కథానాయకు లిరువురు మధ్య భేద మెంతేని గలదు అనిరుద్ధుడు సుందరరూపుడు కావచ్చును కాని కథానాయకున కుండవలసిన లక్షణములుగాని సామర్థ్యముగాని గన్పడదు తనను తాను రక్షించుకొను నంతటి శక్తివంతుడు కాడు తాతగారగు శ్రీకృష్ణుడు వానిని చెఱనుండి విముక్తుని చేయవలసివచ్చెను అతడు అతినీరసుడుగ గన్పడును బాణాసురసంహారమునకు అనిరుద్ధుడు నిమిత్తమాత్రము అతని శౌర్యపరాక్రమాదుల ప్రసక్తియే లేదు ఏ విధమైన ప్రత్యేక ప్రతిభయు గాన్పించదు అందులకే ఆ కథను ఉషాపరిణయమని యనిరేగాని ప్రభావతీ ప్రద్యుమ్నమునందువలె నాయికా నాయకుల నామసూచితమగు పేరు గ్రంథమున కిడలేదు ప్రద్యుమ్నుడటుగాదు సర్వవిద్యలయందును కుశలుడు దైత్యులను గూడి మాయలం గెలువజాలిన మాయచతురుడు శుచిముఖితో కృష్ణు డనుమాటలు ఆలకింపుడు

చ బలవిభవాభిశోభితు డభంగురశౌర్యధురంధరుండు కా
వలసిన మాయలు న్దివిజవైరులకంటె గరంబు నేర్చు నీ
పలుకుల చందమారయ ప్రభావతికిం బతి గాగలాడు ని
చ్చలముగ రుక్మిణీసుతుడు చంపు నవశ్యము వజ్రనాభునిన్

'నే నెంతటి పగనైనను దీర్పలేనా' యని ప్రశ్నించిన బలశాలి మరుత్కంటకు బీచమడంపవలె నన్న నన్నొక్కని బంపిన జాలదే' యని నేరవైన బంటుతన ముట్టిపడ బలికిన శౌర్యశాలి, వివిధాస్త్రవేది సమయము వచ్చిన తండ్రికి జేదోడుగా నుండదగిన

మేటి పరాక్రమశాలి దైనకార్యము సాధించుటకు దగినవాడని నియమింపబడిసర్వదేవతాభయంకరుడును వరప్రసాదియునగు వజ్రనాభుని సంహరించిన ఏకైకవీరుడు కథానాయకున కుండవలసిన సర్వలక్షణము లతనియందు మూర్తీభవించినవి కథనంతయునాక్రమించి ప్రభావతిని వివాహమాడి కావ్యఫలము నందెను ప్రభావతీ ప్రద్యుమ్నుల శృంగారరసాత్మకమగు ప్రణయగాథ ఈ కావ్యమునకు ప్రధానవస్తువు అందుచేత వస్త్వైక్యము సిద్ధించినది ఈప్రబంధము ఏకనాయకాశ్రయము అలంకారశోభిత వర్ణనాత్మకము

సూరన పాత్రచిత్రణము పోషించుటలో సిద్ధహస్తుడు ప్రద్యుమ్నుని పాత్ర నెంత బాగుగ జిత్రించెనో అటులనే శుచిముఖపాత్రను కూడ సృష్టించి పోషించెను ఇట్టిపాత్ర కావ్యము లనభూతో నభవిష్యతి ఇట్టిదియేయగు హంసపాత్ర శృంగార నైషధమందు గలదు కాని యీ రెండు పాత్రలు నిర్వర్తించి కార్యసాఫల్యము గావించుటలో నెంతేని వ్యత్యాసము గలదు రెండు కావ్యములందును రాజహంసపాత్రలు స్వయంప్రతిభ గలవిగనే వర్ణింపబడినవి శృంగార నైషధమందలి రాజహంస తనగొప్పతనమును తన వంశమును ఎటుల జెప్పుకొనెనో చూడుడు

సీ వలినసంభవు సాహిణుల వారువంబులు
కులము సాములు మాకు కువలయాక్షి
చదపేటి బంగారు జలరుహంబుల తూండ్లు
భోజనంబుల మాకు పువ్వుబోడి
సత్యలోకముదాక సకలలోకంబులు
నాటపట్టులు మాకు నబ్జవదన
మధురాక్షరములైన మా మాటలు వినంగ
నమృతాంధసులె యోగ్య లనుపమాంగి

గీ భారతీదేవి ముంజేతి పలుకుజిలుక
సమదగజయాన సబ్రహ్మచారి మాకు
వేదశాస్త్ర పురాణాది విద్యలెల్ల
దరుణి నీయాన ఘంటాపథంబు మాకు

ఇటుల తన సామర్థ్యమును జాటి నలదమయంతీ సంధాన మునకు తనకుగల ప్రజ్ఞ సూచించి నమ్మించినది. ప్రభావతీప్రద్యుమ్నమునందలి శుచిముఖియను రాజహంస రెండాకు లెక్కువ చదివినది ఇదియు "పద్మజుని దేరుదివుచు సారంగరాఖ్యుఁ డగు మరాళవిభుని బిడ్డ నేను వాణి పెనుపంగ బెరిగి తద్విమలశిక్ష గంటి విద్యలెల్ల" అని చెప్పుచు "మమ శ్రీశక్తి యనరా దతి వాఙ్మహిమాధ్యల్ నేను మాయమ్మ సరస్వతీసతి తనంతటిదానిగ నన్ను దిద్దుటన్" అని తన కళలవిద్యలుం గరతలామలకంబగు టయు జెప్పి తన ముఖంబు శబ్దసంస్కారపూతం బను బుద్ధి నద్దేవి శుచిముఖ యని పేరిడియె ననియు,

చ నలినజు రాణివాస మొక నాకు ననుం దన చేతి ప్రోది రా
చిలుకను వాదుకుం గవిత చెప్పగ దా నియమించి యందు నా
పలుకుల గొంత వాసిగని భావమునం గడు మెచ్చుచున్న ఖాం
చలమున నాదుఱెక్క నులిచక్కగ దువ్వుచు గారవించుచున్.

చ॥ ప్రబలములైన కౌతుకకృపా రసవత్సలతా దరంబులన్
శబలితచిత్తయై యపుడు నా కపమాతిశయోక్తి కామధే
ను బిరెద మిచ్చి తల్లిఖితనూపుర ము న్భువనైకమాత య
య్యబల మదంఘ్రి దా దొడిగె నా బిరుదం బిది చూడు మేర్పడన్.

అని ప్రద్యుమ్నునితో తన ప్రజ్ఞాసామర్థ్యముల జెప్పినది. ఆ సందర్భమున అటుల జెప్పుటయు నవసరమే కాని స్వోత్కర్ష కానేరదు శృంగారనైషధమందలి రాజహంసమునకొక్క ప్రయోజనముమాత్రమే కలదు అది నలదమయంతులయెడల పరస్పర ప్రేమాంకురముల నాటి ప్రోదిసేయుట ఇది పరిమితమైనది అటులగాక ప్రభావతీప్రద్యుమ్నమునందలి హంసీపాత్ర బహుళప్రయోజనములుగలది ప్రభావతీప్రద్యుమ్నుల ప్రణయగాథా నిర్వహణ మొక్కటియేకాదు దైవకార్య నిర్వహణము కూడ గలదు. దానిని సాధించుట సామాన్యుల కలవికాదు శుచిముఖపాత్రము నందు సంస్తుతిపాత్రములైన విషయములను కవియిటులవర్ణించెను

శుచిముఖి యంద్రు దానిని వచోనిపుణత్వమునందు సత్కథా
రచనలయందు నీతివిదురత్వమునందు బహుశ్రవోవలో
కచణతయందు నెందు సరిగానము దానికి వేయునేల దా
ని చతురతావిశేషములు నీవ కనన్వలయున్ మహాత్మకా

ఇందలి ప్రతిగుణమునకు గ్రంథమునందు దృష్టాంతముల జూపవచ్చును మహామంత్రుల కుండవలసిన లక్షణము లన్నియు నున్నవి ఇంద్రోపేంద్రులు సహితము వజ్రనాభవధమార్గాన్వేషణమున తబ్బిబ్బగుచుండ వారికి సలహానిచ్చి కార్యసాఫల్యముసాధించిన ధీశాలియది దాని రాజకార్యనిర్వహణధౌరంధర్యము సమయోచితసంభాషణా చాతుర్యము, కార్యసంధానవిధానతత్పరత స్వామిభక్తి ఆత్మకార్యసంధాన సదుపాయము మొదలగుగుణము లన్నియు రాజకీయధూర్వముకుల కుండవలసిన లక్షణములు శుచిముఖికి గల సమయస్ఫురణము, మాటలాడు నేర్పు మఱొకరికి లేదు ఎచట నెవరితో నెంతవఱకు మాటలాడవలయునో అను విచక్షణజ్ఞానము గలిగి తన మనోగతాభిప్రాయముల నితరుల కెరుకరానీయక, పరుల మనోగతాభిప్రాయముల గ్రహించి తదనుగుణముగ వర్తించి తానుసంకల్పించిన కార్యసిద్ధికి వానినివినియోగించుకొను నేర్పు శుచిముఖికే గలదు కొన్నియెడల వచనవక్రత కొన్నియెడల మర్మరహితసంభాషణము కొన్నియెడల గంభీరభాషణములు కొన్నియెడల సూచ్యార్థసూచనలు మొదలగు గడుసుపోకడులకు నాలవాలము దీని మాటల వైఖరి ఎంతటి వారినైనను నిమిషములో వశముజేసికొను వాగ్వైఖరి గలది మాటలలో దానిని గెలుచువారు లేరు ఎవరెంత మాటలాడిన తానును వారితో నంతమాత్రమే మాటలాడును ఎనయగ నెవ్వరెంత మనసిచ్చి వచించిరి వారితో బనువడ నంతమాత్ర ప్రతిభాషణ మాడుట యుక్త'' మని తలంచునది కార్యనిర్వహణ మెంత దుష్కరమైనను దానిని సాధింప వెనుకాడని స్థితప్రజ్ఞ ఇతరుల రహస్యముల జేతబట్టి తన కార్యసాధనమునకు

వారిని వినియోగించుకొనగల దిట్ట రాజతంత్రజ్ఞురాలగు శుచిముఖి ప్రభావతితో చనువుగనుండి యాపె యారవప్రాణమాయనుసంతగ నుండి ప్రభావతీప్రద్యుమ్నుల పరస్పరానురాగమునకు కృషి జేయుచున్నను, తన దౌత్యవిషయైక రహస్యకృత్యముల నామెకు దెలియనీయలేదు ప్రభావతియందు ప్రద్యుమ్నున కాకాంక్ష రేకెత్తించినది వారి పరస్పర ప్రేమవల్లరి బలీయమై పుష్పించి వికసించి సత్ఫలమందుటకు కావలసిన దోహదము తయు జేసినది ఈ ప్రణయమును వజ్రనాభుని వధ కాయుధముగ నుపయోగించినది

శుచిముఖి సమయోచితముగ మాటలాడగల చతురురాలు. ఔచిత్య మెఱిగిన సరసురాలు 'తన తనయుడు రాక్షసుపై జనియెడు నని రుక్మిణికి ససమ్మతమగునేమో' నని కృష్ణునితో నేకాంతపుమాట కల దనినది ప్రద్యుమ్నుడు విమనటుల నతేనిని జూచినపుడు 'అల్లయాత డితండు కావలయు'నని పల్కి యాతని చేతనే ఆహ్వానింపబడి మాటలాగునది ఇటులనే ప్రభావతీ రాగ వల్లరులు చిత్రఫలకమునందలి ప్రద్యుమ్నుని రూపమును జూచుచుండ తత్సమీపంబునం దనురూపగతి సంచరించుచున్న శుచిముఖి ప్రభావతి చెలిమికలిమి హత్తించుకొనుట కనువగు సమయమిదియే యని యూహించి యల్లనల్లన తిరుగుచు, సవిమర్శకదృష్టితో పలుమాఱు మఱలిమఱలి చిత్రఫలకము జూడ యత్నించుచు ప్రభావతీ రాగవల్లరుల దృష్టి నాకర్షించి వారిచే సంబోధింపబడి, వారి పరిచయము చనువు సంపాదించినది పరుల పరిచయము వారి యభిమానము నందుటలో నెంతయేని సమయజ్ఞత జూపినది. చిలుకవలన గదసాంబుల వలచిన చంద్రవతీ గుణవతుల వృత్తాంతము గ్రహించినది కాని యారహస్యమును ప్రభావతికి వెంటనే ఎఱుకపరచలేదు సమయమరసి యా విషయమును వినియోగించినది చిలుకవృత్తాంతము విని 'నీ పత్రికా ప్రసంగము నిస్సారంబుగా బోనాడి ప్రసంగాంతరంబున మఱపించి విడిచెద' నని హంస చిలుకతో నిట్లనియె

ఆ. పక్షి పేర వ్రాసి పత్రిక యని పెదు
నట్టివాడు భ్రాంతుడగుట నిజము
నా కతం డనిపిన యాకమ్మ యెట్టుండె
నేమి మిగుల నొరసి యేల యడుగ

నవనిధానములును తవిలి యిచ్చినను మెడలమీద కత్తి యిడిననైన యేలినవారి రహస్యభంగము జేయని అనఘచరితుల కోవలో జేరినదీ రాజహంసి ఇటుల శుచిముఖ ప్రతిభావిశేషముల నిరూపింప నిట్టివి యెన్నేని జూపవచ్చును

ఇందు ప్రభావతివలపు కనుకలి, ప్రద్యుమ్నునిది వినుకలి స్వప్నమున శివ కనబడి ప్రద్యుమ్నుడు భర్తకాగలడని చెప్పి ప్రభావతికి చిత్రఫలకము బ్రసాదించినది శాంకరి వరప్రసాద జనితయగు ప్రభావతి యా తల్లి మాటల వలని విశ్వాసమున చిత్ర పట సందర్శనమున ప్రద్యుమ్నునియం దనురాగబద్ధ మైనది ప్రద్యుమ్నున కన్నన్నో ప్రభావతి యనియెడు అన్నులమిన్న యున్నదనియే తెలియదు వజ్రనాభవధానిర్వహణ మెట్టులాయని విచారించుచు ప్రద్యుమ్నుడే యా పనికి సమర్థుడను శ్రీకృష్ణుని నిర్ణయము వినిన శుచిముఖి ప్రద్యుమ్నుని హృదయమున ప్రభావతియెడ ననురాగాంకురము నాటవలయును అంత నేర్పరితన మేరికిగలదు ఉపమాతిశయోక్తి కామధేను బిరుదాంకితయగు శుచిముఖికక్క? ప్రభావతి యందచందములకు నవయవసౌష్ఠవము నకు నుపమింపదగిన వస్తువులు సృష్టియందు లేవని చెప్పుచునే ప్రభావతి రూపసౌందర్యమును ప్రద్యుమ్నుని మనసునందు హత్తుకొను నటుల జేసిన చతుర యాపె విమర్శకులు కొంద ఱతిదీర్ఘమగు నిచటి ప్రత్యంగవర్ణనము నీసడింతురు కాని అన్యమనస్కుడై యున్న ప్రద్యుమ్నుని హృదయమును ప్రభావతీరూపమును లగ్న మొనర్పనెంచి శుచిముఖి తన వచోవిభవమెల్ల పెక్కు తెరంగుల ప్రదర్శించినదని గ్రహింపవలసియుండును ప్రభావతి సుందరాంగము లొక్కటొక్కటిగా ప్రద్యుమ్నుని మనసున అతనికి తెలియ

కుండగనే నాటుకొని నవియెల్ల మెల్లగా ఒక్కటియై తుదకు ప్రభావతీ విరహమున నాతని ముంచియెత్తుటయే శుచిముఖి వాక్షైపుణికి తార్కాణము అంతియేకాదు ప్రభావతీ రుచిరరూపమును బ్రహ్మమునుగా శుచిముఖివాక్కులను ఉపనిషద్వాక్యములుగా నుపమించి ప్రద్యుమ్నుని ఆ రూపసాక్షాత్కారమునందు మననశీలునిగా చెప్పి శృంగారమునకు భక్తికి అభేదమును గల్పించిన సూరనప్రజ్ఞ నిచట నపురూపమని చెప్పనొప్పును

ఇటులనే యీ ప్రబంధమునందలి పాత్రలన్నియు చక్కగ జితి్రింపబడి పోషింపబడినవి పాత్రచిత్రణపోషణలో సూరన అనుసరించిన మార్గము ప్రతిఘటనసంయోగము By contrast ) ఇది మహాశిల్పులయినవారికే సాధ్యము ఈ ప్రయోగ సన్నివేశమే పాత్రలకు జెడగు నాపాదించుచున్నది ప్రభావతీ ప్రద్యుమ్నమున శుచిముఖికి రాగవల్లరి చిలుకలు ప్రతియోగములు ఈ ప్రతియోగపాత్రలే లేనియెడల హంసప్రతిభాతిశయము అంతగా ప్రస్ఫుటింపదు ప్రభావతికి అపెచెల్లెండ్రు ప్రతియోగపాత్రలు , ప్రద్యుమ్నునకు గదసాంబులు ప్రతియోగపాత్రలు ఒకచోనననేల కళాపూర్ణోదయమునను ప్రభావతీ ప్రద్యుమ్నమునందువలె నిటులనే చిత్రించి పోషించినాడు

ఈ ప్రబంధమునందలి వర్ణనలన్నియు సముచితములు , సముచితస్థానముల నున్నవి వర్ణనల ఘట్టముల పాత్రపోషణమున ఔచిత్యమంతయు బోషింపబడినది ఒకరు త్రొక్కిన మార్గమును సూరన త్రొక్కడు అతని మార్గమున ఒరు లడుగిడజాలరు సకల ప్రబంధసామాన్యమైన పురవర్ణనమునగూడ అతడు నాటకపక్కి ననుసరించెను అంతటితోపోక, ఆ ద్వారకానగరమును అంబరచారదృష్టినే చూచి చెప్పిన సూరనార్యుని అనన్యశక్తి నెంతని కొనియాడగలము ? సరిక్రొత్తయగు ఈ వర్ణనపద్ధతి యటులుండ ఆ వర్ణననుగూడ అవసరమును సార్థకతను కల్పించినాడు తీరి కూర్చుండి చేసిన పురవర్ణనము కాదిది అపహ్నుత

స్వర్గరాజ్యవిభవుడైన దేవేంద్రునకు వినోదకుతూహలముల గూర్చుటకును మనఃఖేదమును మాన్పి ప్రత్యాశ కల్పించుటకును చేసిన వర్ణమిది. ఇంతకు దీనిని వర్ణన మనరాదు. ఆ నగరదర్శనముచే మాతలి దేవేంద్రులు తమలో దా మనుకొన్న మాట లివి. ఆ నగరసౌందర్య సందర్శనముచే నింద్రుడు 'దూరధూతసకలవ్యథ చిత్తుడై యథాపురాకారత దోచె నట. ఔరౌరా ఏమి గడుసుదన మిది. సూరన తన కావ్యనిర్మాణశక్తిని ప్రతిభను ఇట్లు పాత్రల ముఖమున నడుగడుగున ప్రశంసించుచునే యుండును. ప్రభావతీవర్ణనాఘట్టమున అనౌచిత్యదోష మారోపింతురని సూరనయే శంకించుకొని.

‘‘అటు గాకద్భుతరామణీయకగుణాఢ్యం బైన సద్వస్తువుం
బటువాచారసిక ప్రసంగమయినం జారంబు మట్టం దరసో
త్కటతం జెప్పక మానజాల

రను పద్యములో సమాధానమును చెప్పినాడు.

ప్రభావతీప్రద్యుమ్న కావ్యమున నుద్దేశింపబడిన ప్రత్యేక ప్రయోజన మేది యనునది వివాదగ్రస్తము. వజ్రనాభుని వధ యను దుష్టసంహారమును ప్రభావతీప్రద్యుమ్నుల వివాహము రెండును ప్రధానగాథలుగ గన్పడును. వజ్రనాభుని వధ జరుగుటకు ప్రభావతీప్రద్యుమ్నుల వివాహము దైవనిర్ణీతము. శాంకరి యీ యిరువుర దాంపత్యము నిర్ణయించినది. శ్రీకృష్ణుడు స్థిరీకరించినాడు. శుచిముఖి కార్యాచరణకు గడంగినది. వజ్రనాభుడు మరణింపనిది యీ వివాహము సంభవముకాదు. ఇది సంఘటిల్లినగాని వజ్రనాభుడు మరణింపడు. ఈ రెండు కథలకు నవినాభావసంబంధము గలదు. విడదీయరాని రీతిని మేళవింపబడినవి. వజ్రనాభుని వధయే ప్రధాన మనువారు ఈ కావ్యము వీరరసప్రధాన మందురు. కాని యా కథ నిమిత్తమాత్రమే యనియు అది ప్రభావతీప్రద్యుమ్నుల వివాహమునకు నడ్డుగాకుండుటకు జరిగిన దనియు, నాయికానాయకుల పరస్పరానురాగపోషణమగు కావ్యమగుటశృంగారరసప్రధాన

కావ్యమని రెండవ వర్గమువా రందురు ఇదియే సముచితము శృంగారరసపోషణయే విపులముగ నిందు జరిగినది లోకోక్తులు సామెతలు మొదలగునవియేగాక ఇతర కావ్యగుణము లటులుండ సజీవరూపచిత్రిణమున సూరన కొరవలు సాటిరారు

కలకల నవ్వినట్లు తెలికన్నుల నిక్కము చూచినట్లు తో
బలుక గడంగినట్లు కడు భావగభీరత లబ్బినట్లు పెం పొల
య దనర్చి చిత్రకళ యుట్టిపడగ

చిత్రరచన చేయవలెనని యీతని మతము ఈ సజీవ చిత్రణమును బరికింపుడు ప్రద్యుమ్నుని అశ్వారోహణాకౌశల్యము చిత్రణ జూడుడు

చ తన హృదయంబు వెంబడిన తప్పక ఘోటక మంతనంతనే
పనుపడ నిల్చి ముందఱను బాఱి కెలంకులకుం దొలంగి దా
వెనుకకు నేగుదెంచి కడువేడ్క యొనర్పగ బంతిరూడ నె
మ్మిని గనకంబుగోల నడిమింట నెత్రిమ్మర దారికొట్టుచున్

మండలగతుల నతులంబుగా దురంగంబు దోలి యాడు ప్పుడు.

సీ తోలుదొల్త నయ్యేక తురగంబుమండల
గతిచారి యగుచు నిక్కంబు తోచె
నావెనుకను సరూపాశ్వాలి చెదరక
చక్రాకృతిని బర్వు సరణి తోచె
నంతట నతితిస్ఫుటావయవంబుగా
నెనసి యేగాంగ వేష్టనత తోచె
దుది దద్విభూషణద్యుతిరాజిమాత్రంబు
కొఱవిత్రిప్పినరీతి మెఱసి తోచె

గీ నంతకంతకు గతివేగ మగ్గలింప
రాగవాగె యొచ్చరిక పరాకు జియ్య
యను జనులు తిచ్చపడి తమ పని మఱవగ
బరగు నశ్వోన్నతి నెఱకారు ప్రౌఢికతన.

అపుడు గగనసరణి నరిగెడు శుచిముఖి యతని జూచి పరివారముతో ధరణికి డిగ్గిన తెఱంగరయుడు.

సీ॥ మరుదశ్వగతి మెచ్చి సురలు వైచిన పైడి
 ప్రాతక్రొమ్ముడుఁగుదువ్వలుల యనఁగ
దర్పణసెలఁ గౌతుకమున పేర్మికిఁగ్రమ్ము
 కొనుపతేజఃకిత్రిఘనము లనఁగ
హయఫేనధావళ్య యాచ్నార్థమై వ్రాలు
 తటిదనుగతసితాబ్దంబు లనఁగ
వాజి విభ్రమడిత్తావర్తతి దోలకది
 వ్యుల రేటి సాబ్జరేణూర్మ్యు లనఁగ

గీ॥ కనకరేఖలతోడి ఱెక్కల బెండగు
చూపఱకు గనుపండువై సొంపుమీఱ
జలదపథమునుండి భూస్థలికి డిగ్గు
హంసమాలం వర్ణనాసీమ నతికరించె.

ఇక నౌచితీనిర్వహణమున సూరనకు బెట్టినది పేరు. ప్రద్యుమ్నుడు వ్రాసిన లేఖను కొంతవఱకు జదివి వినిపించి "ఇక చదువదగదు ఇంతనుండి మిక్కిలిన్ బచ్చిగా వలపు తేటపఱచి వ్రాసినాడని" ప్రద్యుమ్నుని ప్రణయలేఖను శుచిముఖి ప్రభావతి కిచ్చుటలోని యౌచిత్య మెంతయు గొనియాడదగినది. కావ్యమందంతట నిటులనే యౌచితీమహిమ యొప్పారుచుండును.

ఈగ్రంథప్రాశస్త్యము తరచినకొలది బుద్ధిచాకచక్యమును బట్టి బోధపడును. కవియే "నీటికొలది తామరసుమిమ్మ" యని చెప్పినాడుగదా!

# 10

# వసుచరిత్ర

[రామరాజభూషణుడు]

శ్రీకృష్ణ దేవరాయల భువనవిజయమహాసభయం దష్టదిగ్గజములలో నొకడుగా నాసీనుడై యుండుటకు, విద్వత్ప్రభుసమ్మాన మందిటకు నోచుకొన కుండినను విజయనగర రాజాస్థానము నే యాశ్రయించి ప్రభువుల మన్నన లందిన మహాకవి రామరాజ భూషణ బిరుదాంకుడగు భట్టుమూర్తి ఈతడు ప్రథమశ్రేణి ప్రబంధకవులలో జేరదగినవాడు ఆంధ్రపంచమహాకావ్యములలో నీ వసుచరిత్ర సాహిత్యనిధాన మని చెప్పదగును.

శ్రీకృష్ణదేవరాయలు తన యాస్థానమునందలి పెద్దనాది కవులను సమ్మానితుల జేయుటయేకాక గౌరవభక్తిప్రవృత్తులతో బూజించెను దీనికి తార్కాణము పెద్దన ''యెదురైనచో తన మదకరీంద్రముడిగ్గి'' అను సీసపద్యము. భట్టుమూర్తి రాయల కాలమున, సూరన, రామకృష్ణులవలె బాల్యదశయం దుండి యీ కవిపూజాదిసమ్మానముల జూచియుండును తరువాత రాయల అల్లుడైన రామరాజు పాలనమున, ఆ ప్రభునాస్థానము నలంకరించి సమ్మానపాత్రు డయ్యె ననునది రామరాజభూషణ బిరుదమువ

ననే ద్యోతక మగుచున్నది అయినను రాయల ఆస్థాన మర్యా
దలకు లొజ్జని కొంద అందరు అది సత్యదూరము కాదు
ప్రభువు లెంత సాహిత్యప్రియులయినను ఆశ్రిత పక్షపాతులైనను
సారస్వతపోషణమున శ్రీకృష్ణదేవరాయలకు సములు గాజాలరు
కదా రామరాజభూషణుడు భట్టుకులజుడు పెద్దనశిష్యుడని
కాకుమానుగ్రామమును అగ్రహారముగ బొంది కాకుమానురాయు
డయినటుల చెప్పుదురు

ఆంధ్రవిద్వత్కవులలో నగ్రశ్రేణికి జెందిన ఈ కవిగ్రంథ
ముల నెల్లెడ నీతిని పాండిత్యప్రకర్ష గన్పడును సంస్కృత సమా
సోపేతమయ్యు, శ్లేషలకు నిధానమయ్యు వసుచరిత్ర కావ్యము గంగా
ప్రవాహమువలె, తాళలయాను గుణముగా నడచుట యబ్బురము
గూర్చును ఈతడు హనుమత్ప్రసాదలబ్ధకవితాయుతుడు, ఘటికా
శతగ్రంథ కల్పనా ధురంధరుడు, సంగీతకళానిధి, చిత్రకవిత్వబంధ
కవిత్వ ఓష్ఠ్యనిరోష్ఠ్యకవితలు చెప్పగల మేటి

ఈ కవికృతులు ప్రఖ్యాతము లయినవి మూడు గలవు
(1) కావ్యాలంకారసంగ్రహము–దీనినే నరసభూపాలీయ మందురు
(2) వసుచరిత్రము (3) హరిశ్చంద్రనలోపాఖ్యాన మను ద్వ్యర్థి
కావ్యము. ఈ మూడు కృతులను తత్పూర్వకవులయెడ స్పర్థచే
వారికన్న మిన్నగా రచింప యత్నించెను విన్నకోట పెద్దన
కావ్యాలంకార చూడామణి యను అలంకారగ్రంథము నదివఱకే
రచించెను దానికన్న తన గ్రంథము మిన్నగ నుండవలయునను
తలంపున సంస్కృతమున విద్యానాథకృతమగు ప్రతాపరుద్రీయ
మను అలంకారశాస్త్రమును కావ్యాలంకారసంగ్రహ డాను పేర
తెనుగునఅనువదించెను అదియు నసంపూర్తిగ్రంథమే సంస్కృత
మున విద్యానాథుని కృతివలె నిదియు శ్లాఘాపాత్రమై యొప్పు
చున్నది ఇందలి లక్ష్యములు మనోహరములు శాస్త్రగ్రంథముల
నింతటి మనోహర కవితాధారతో రచించుట కష్టము. మచ్చున
కీ పద్యముల జూడుడు

ఉ. ఉరమున నున్న కుంకుమ మదుజ్జ్వలరోచకసాయకీర్షణ
స్ఫురదరుణాంశుపుంజమని పొంకిటి కన్గొని కెంపు భాగ్య బం
ధురసమాజారుణత్వ మని నూల్కొ-నవాడిటి వెట్టు దాచె దీ
పరిమళవాసనాళహారి శర్వుడు మేను నృసింహభూవరా

శా. చాలుం జాలు దిసాళిచేతలు పదాబ్జాతంబుపై మాటికిన్
బ్రాలంబోరు భవత్ప్రియానఖవిమిశ్రంబైన నీవక్షమీ
నీలస్థాపితకుట్టిమం బొఱసినన్ వేధించు శేలెమ్ము నీ
బాలాసంగమ సౌఖ్యవైభవము నూపన్ వచ్చితే యిచ్చటన్ !

పెద్దనమనుచరిత్రను మనసునం దిడుకొని దానిని మించిన ప్రబంధము రచింపవలయు నను సంకల్పముతో వసుచరిత్రను రచించెను పింగళి సూరనార్యకృత రాఘవపాండవీయమునకు మిన్నగా రచింపనెంచి హరిశ్చంద్రనలోపాఖ్యాన మను ద్వ్యర్థి కావ్యమును రచించెను విద్యాస్పర్థ యెంతవ్యమే అప్పుడే యుత్తమగ్రంథరచన సాగుటకు కారణమేర్పడును "స్పర్థయా వర్ధతే విద్యా" అనికదా యార్యోక్తి సూరనకృతమగు కళా పూర్ణోదయ మహాకావ్యమును 'కేవల కల్పనాకథలు కృత్రిమ రత్నములు' అని అవహేళనము చేసియు, నాతని రాఘవపాండవీయ మునకు పోటీగా హరిశ్చంద్రనలోపాఖ్యానము నీతడు రచించుటకు వెనుకాడలేదు అయినను ద్వ్యర్థి కావ్యరచనా నైపుణ్యమున ప్రథమస్థానము సూరనకే దక్కినది మనుచరిత్రను అధిగమింప వసుచరిత్ర రచించినను ప్రజాబాహుళ్యములో మనుచరిత్రకు గలిగిన ఆదరణ పొందలేదు వసుచరిత్రము ప్రౌఢతరకావ్యమై, పండితులకుమాత్రమే అర్థమగునటులుండుటయే దీనికి కారణము. ఈ ప్రౌఢకావ్యము పండితుల నాశ్చర్యచకితుల జేయుగాక. ప్రథమస్థాన మెప్పుడును అనుకార్యునిదే.

వసుచరిత్రకు మూలము భారతమునందలి ఉపచరివసువు చరిత్రము ఇతివృత్తము చాల చిన్నదైనను 'అవారితసత్కవి కల్పనా విశేషావహ పూర్వవృత్తములు సానలుదీరిన జాతిరత్న

ముల్' అని కవి చేసిన ప్రతిజ్ఞ వెంబడి నీకథ నతిమాత్రములగు వర్ణనలచే పెంచి రచించెను మూలమందలి కొన్ని యనౌచిత్యములను విడనాడు టటులుండ, నిజప్రతిభా ప్రకర్షచే కల్పనా సామర్థ్యముచే నీతడీ కథను మహాకావ్యముగ నిబంధించిన చొప్పు అద్భుతము గూర్చును మూర్తికవి తన యసమాన విద్యా విశారదత్వమును అప్రతిమాన ప్రతిభను మేళవించి శబ్దార్థశ్లేష వైచిత్ర పూర్వముగ కవితాశిల్పపారమ్యముచే నానాలంకార భూషితముగా నీ కావ్యమును నిర్వహించెను ఈతడు శతలేఖినీ పద్యసంధానధౌరేయు ఘటికాశత గ్రంథకరణధుర్యుడును ఆశా ప్రబంధబంధాభిజ్ఞుడును చిత్రకవిత్వము నోష్ఠ్యనిరోష్ఠ్యకవితల జెప్పగలిగిన దిట్ట' వసుచరిత్ర శ్లేషవ్యంగ్యములకు రాఘవ వర్ణనా చమత్కృతికి, చిత్రకవిత్వ నిపుణతకు గాణాచి కథాశిల్పదృష్టితో జూచినచో నిది నిస్సార మనిపించును కళాదృష్టితో జూచిన ప్రతివర్ణనయు, ప్రతియలంకారము రసోత్పాదకమే అలంకారికు డైన మూర్తికవి నరసభూపాలీయమున దాను చెప్పిన కావ్యలక్షణమునకు లక్ష్యభూతములగు అష్టాదశవర్ణనలచే నలంకారములచే నీ కావ్యమును భూషించెనో యనిపించును ఈతడు వర్ణనల జూపిన నేర్పు కథాకథనమున గానరాదు చక్కని పదముల కూర్పునకు, శాస్త్రప్రపంచమున నిష్ణాతమైన బుద్ధికి, ఊహాప్రపంచమున నోలలాడు తలంపులకు అప్రయత్న సంభవ శ్లేషవ్యంగ్యాదులు లోనగు కావ్యగుణముల కీకావ్యము నెలవు అలంకార్యమగు వస్తువ్వు అలంకారభారముచే నిందు మఱుగు పడినది చెట్టులేకాని యడవి కానరా దన్నటుల ఒడలికి మించిన తొడవులతో నితివృత్తము కప్పువడినది

పద్యరచనయందు భావములందు పూర్వకవుల ననుకరించు స్వభావము కలవాడు అనుకరించినచోటుల గొన్ని యెడల మూలమునకు వన్నె పెట్టినాడు అనుకరణదోష మనజనదు మంచి నెవరైన ననుకరించుట సహజము, న్యాయము శృంగారనైషధ

మును, శృంగార శాకుంతలమును, మనుచరిత్రను అనుకరించిన పట్టులు గలవు కాళిదాసుని అభిజ్ఞానశాకుంతలము ననుసరించి చెలిచే నాయికజన్మ వృత్తాంతమును జెప్పించుటయు, లతాపరివృతుడై నాయకుండుండుటయు నాయికసొబగు జూచి పొక్కుటయు, విరహార్తి గందుటయు మొదలగువానినేగాక శాకుంతల నాటకమందలి సానుమతివలె ఇందు మంజువాణియు తిరస్కరిణీ ప్రభావమున నదృశ్యయై నాయకుని ప్రేమించితావస్థను పరికించుట లోనగు పోలికలు కలవు శ్రీనాథుని సంస్కృత సమాన ఫక్కిని, సీసపద్యరచన విన్యాణమును, పలుకుబడులును అనుకరించెను ఈ వర్ణనల బోలికల జూడుడు మనుచరిత్రలో

వరణాద్వీప కళిత తటాంచలమునన్ వప్రస్థలీ చుంబితాం
బరమై శౌధసుధాప్రభాధవళిత ప్రాలేయ రుఙ్మండలీ
హరిణంబై యరుణాస్పదం బనగ నార్యావర దేశంబునం
బుర మొప్పున్ మహికంఠహార తరళస్ఫూర్తిన్ విడంబించుచున్.

అని పురవర్ణన ఈ పురవర్ణనయే వసుచరిత్రయందున్న తెఱంగు జూడుడు

సీ. వరసుమనోభవ్యతరుల తావాల మ
    త్యలఘుకలాపాలి కలరు ధరణి
సరిలేని తెలిముత్తెసరుల కట్టారు క
    ల్యాణ పరంపరల నోలుదివి
సురచిరమణుల శాకరసీమ శ్రుతిహితి-
    భాషిత ద్విజకోటి పట్టుగొమ్మ
సరసుల తారామసరణి శ్రీరంగ గే
    హక్రోడ వాసిని కాటపట్టు
గీ. వెలయు నావరణాంబు సంవీతహాట
    కాండమోహాదపరిఖా వృతాంఘ్రి వజ్ర
    దంతుర ప్రాంతగంగా నిరంతరాగ్ర
    భూరివరణం బధిష్టాన పురవరంబు.

ఈ పుష్పలాలికల విలాసవర్ణనము జూడుడు

సీ. పొన్నపూవ్రోడి నేల బొదిలితే చెవి యది
పొడమె బల్దివ్పై బొదువ వలదె
చెలువ మాటితి నేల కలువచాలదియు
కప్పగరాదె మిన్నుల చావకడది
మొగద్రత్తమ్ముల నేల మూనితే సతిమూయ
దగదె మానస భూవిధానములవి
తరుణి పూరెమ్మ యొత్తవదేల యది హేమ
శిఖరిదాపుది బయల్ సేయదగునె

తే. యనుచు రసమర్మ సరసోక్తు లాడునట్టి
జట్టికాంద్ర యథోచిత సరసవచన
రచన దేల్చుచు వివిధవిభ్రమము వఱల
విరులు విలుతురు పువ్వులాలికలు వీట

ఈ వర్ణను ఆముక్తమాల్యదయందు విపులముగా జేయ బడిన పువ్వులావికా వర్ణనను జూచి చేవియుండవచ్చును

చం. తరువుల పొంత బొంచి వసుధాధర మిత్రుడు గాంచె నచ్చటం
దరుణి దమోవిలీనకచ దామరసోదర సోదయ పథం
దరళవిలోచనం దతనితంబ దటిన్నిభ గాత్ర వల్లరిం
దరుణి శశాంకపాల్ల నొక తన్వి దరంగవళిం దలోదరిన్

ఈ పద్యము మనుచరిత్రియందలి పద్యమును స్ఫురణకు దెచ్చుచున్నది

మ॥ అత డావాతపరంపరాపరిమళ వ్యాపారలీలన్ జనా
న్వితమిచ్చోటని జేరబోయి కనియెన్ విద్యుల్లతా
శతపత్రేక్షణ జంచరీక చికురం జంద్రాస్య జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొక మరున్నారీ శిరోరత్న

కం. తనువగు శబ్దార్థంబులు
ధ్వని జీవ మలంక్రియావితానము సొమ్ముల్
దనరు గుణంబులు గుణములు
ఘనవృత్తులు వృత్తు లౌర కావ్యేందిరకున్

ఈ లక్షణముల నెల్ల వసుచరిత్రియం దన్వయింప యత్నించెను

శబ్దాలంకారములతో బాటు అర్థాలంకారముల మేళవించు నేర్పుగల యీకవి సంస్కృతపద ఘటిత దీర్ఘసమాసయుతమై, శబ్దాలంకారమువలన మానసికోల్లాసము కలిగించుటయేగాక, అర్థ గాంభీర్యమై తనరారు ప్రౌఢకావ్యరచనవలన తన భావుకత్వమును వెల్లివిరియించెను శబ్దశ్లేషలను అర్థశ్లేషలను చక్కగ నిర్వహించి తరువాతికవులకు వరవడిబెట్టెను కావలసిన రాదగిన స్థలముల శ్లేష ఘటించుట యెంతయు శోభావహము రెండర్థముల పద ములు దొరకినవిగదా యని గ్రంథమున సర్వత్ర శ్లేషింపజూచుట యుచితము కాదు శుక్తిమతికి స్త్రీత్వ మాపాదించి శ్లేషించి చెప్పిన పద్యము లెంతయు నింపుగను నుచితముగను నున్నవి. ఇంత సొంపుగ శ్లేష యన్నియెడల భాసించిన దన వలనుపడదు. శుక్తిమతీనదిని కోలాహలపర్వతమును నాయికానాయకుల గావించి యీ మహాకవి నడపిన శృంగారమును, చేసిన కల్పనలును అద్భు తావహములు మన సాహిత్యముననే కాదు విశ్వసాహిత్యమున గూడ నిట్టి ఘట్ట మపురూపము. మూర్తికవి శ్లేషలును, అలం కారములును ఈ ఘట్టమున సార్థకములై మిగుల రాణించినవి. ఈ ఘట్టమును ప్రత్యేక రసమయప్రబంధముగా గొనియాడ వచ్చును.

వసుచరిత్ర మొక యసామాన్యగ్రంథము. పండితులకుగాని కొరుకుడుపడని పద్యరచన యందందు సాగినను వర్ణనలు కొన్ని యెడల నతిదీర్ఘములై కథాకథనమునకు అడ్డు తగిలినను, అతి స్వాభావికములగు ప్రకృతివర్ణనలచే యమకానుప్రాసాదిశబ్దాలం కారములతో శ్రోత్రపేయమైన కవితాతిశయమున విరాజిల్లు చున్నది ఆంధ్రభాషలోతుపాతుల గ్రహించి పండితులు కాదల చినవారు పఠింపదగిన ఆంధ్రపంచమహాకావ్యములలో నిది మేటి. దీనియం దచేతనపదార్థములకు చేతనము గల్పించి, నిర్జీవవస్తువు లకు జీవము బోసి మన యెదుట నిలిపినాడు. చిత్రచిత్రరచనా కౌశలము చూపినాడు. ఈపద్యముల సొంపు గమనింపుడు.

మ. బలిచూడామణులరదు విష్ణుపదజుల్ పాటించు ధాన్యంపుది
ప్పలు చంద్రామృతసాంద్రసైకతమున బైపై పోసులెత్తంగ ద
త్కలమాంఘ్రీరసపంపు మేయు నెలజింకన్ సొక్కి వారించు వా
రల తోబుట్టువు గంగ పద్మముఖి నిర్వ్యాధ్యంగ నాదార్భటిన్

శా. ఆ జాబిల్లి వెలుంగు వెల్లికల డాయన్ లేక రాకానిశా
రాజశ్రీసఖమైన మోమున బటాగ్రం బొత్తి యొత్తి య్యా
రాజీవానన యేడ్చె గిన్నరవధూరాజత్కరాంభోజకాం
భోజీమేళవిపంచికారవసుధాపూరంబు తోరంబుగన్

రామరాజభూషణుడు సంగీతకళారహస్య వేదియగుట వసుచరిత్రమునందలి పద్యములు శ్రావ్యములై లయతాళముల పాడదగినవిగా నొప్పారినవి తెనుగుసారస్వతమున సంగీతసాహిత్యములకు సన్నిహితత్వము మొందు వివిధములగు వృత్తభేదములు మధురమగు భాషాశ్రావ్యత నినుమడింప జేసినవి మన వృత్తములు సహజముగ లయతాళముల కొదుగును పూర్వకవు లందఱు సంగీతప్రియులే దాని లోతుపాతులు తెలిసినవారే వారందఱు బహుశాస్త్రముల నిష్ణాతులు వారివారి రచనలయందు సంగీతసాహిత్యముల మేళవింపు గన్పడును కాని వీరెవరు తాము సంగీతశాస్త్రమున నిష్ణాతులమని చెప్పుకొనలేదు రామరాజభూషణుడటుల జెప్పుకొనెను అతడు సంగీతకళారహస్యనిధి యనుటలో నసత్యమేమియు లేదు అతని కవితలో గన్పడు నయ్యారపు శిల్పమునకు నతని సంగీతకళానుభవమే మూలము వీరందఱు సారస్వతమునకీసొబగు శబ్దాలంకారముల మూలముననే ఘటించిరి నాచనసోముడు పోతనామాత్యుడు దమ పద్యముల శబ్దాలంకారభూయిష్ఠముల జేయుటచేతనే తమ కావ్యముల శ్రవణపేయము జేసినారు యమకమువలన పద్యమునకు గమ్మత్తు గలుగును అంత్యానుప్రాసమువలన లయతాళములు వనరును భట్టుమూర్తి యీరహస్యమును బాగుగ గుర్తెఱిగిన సిద్ధహస్తుడు అతని పద్యములు శ్రావ్యములు అన్వయకాఠిన్యముండునుగాక అందును సీసపదరచన ప్రత్యేక ప్రశంసకు దగినది

సీ. లలనాజనాపాంగవలనా వసదనంగ
 తులనాభికాభంగదోః ప్రసంగ
మలసానిల విలోల దళసాసవరసాల
 ఫలసాదర శుకాలపన విశాల
మలినీ గరుదనీక మలినీకృతధునీక
 మలినీ సుఖితకోక కులవధూక
మతికాంతసలతాంత అతికాంతరనితాంత
 రతికాంత రణతాంత సుతనుకాంతి

గీ. సుకృతికాహ్లాదక ధురకావికలవశీ
ముఖరిత సకల వసంతప్రమోదచరిత
కలిత కలకంఠకుల కంఠకాకలీవి
భాసురము వొల్చె మధుమాసవాసరంబు.

తలిరుబ్రాయమువాని తలరాజు నలరాజు
 నలరాజు చెగడు సోయగమువాని
బసిడిచాయలవాని బగడంబు జగడంబు
 జగడంబు గల మోవిసొగసువాని
దళుకు చెక్కులవాని దులకింపు పలుకెంపు
 పలుకెంపు లొలయు నవ్వొలయువాని
జికిలిచూపులవాని నిరిమించు దొరయించు
 దొరయించు కాంచనాంబరమువాని.

ఈ పద్యమందలి ముక్తపదగ్రస్తము ముదము గూర్చుచున్నది.

ఈకావ్యమున కథ నాటకరీతిని నడుపబడినది ప్రబంధములందెందును గనబడని నర్మసచివుని పాత్రానుసంధానము నాటక పక్కికి ద్యోతకమగుచున్నది ఇటులనే గిరికావిరహఘట్టముకూడ నాటకీయతను జాటుచున్నది ఈతడు నాటకములకు జీవమన దగిన సంవాదమును నడుపుటయందు కడు నేర్పరి ఈకావ్యమున సజీవపాత్రలు లేవు. పద్యరచనలో వర్ణనాచమత్కృతిలో శ్లేషాలంకారాదుల గూర్చుటలో గల నేర్పు పాత్రచిత్రణమున లేదు. వర్ణనా కుతూహలము కొన్ని యెడల మితిమీరినది. నర్మసఖుడు

కథానాయిక సౌందర్యమును వసురాజునకు వర్ణించి చెప్పుపట్టుల నిగ్రహము కొంత సడలినదని చెప్పవలయును ఎంతవఱకు ఆ వర్ణన యుచితమో విచారణీయము

వసుచరిత్ర తరువాతి కవులమీఁద విపులప్రభావము ప్రదర్శించెను కనుపర్తి యబ్బయామాత్యుఁడు అడిదము సూరకవి, కూచిమంచి తిమ్మకవి మొదలగువారు వసుచరిత్రవరుసదినే పద్యరచన సాగించిరి మూఁడువందల సంవత్సరముల కాలమీ ప్రబంధ ప్రభావ మవిచ్ఛిన్నముగ సాగినది ఇప్పటికిని కొంద ఱాజాడలనే గమింపయత్నించువారును గలరు అటుల ననుకరించినవా రెవరును శక్తిసామర్థ్యముల భట్టుమూర్తిని బోలగలవారు కారు

ప్రబంధయుగములో వెలువడిన నితరప్రబంధములవలె ఏదియేని ధర్మమును ప్రతిపాదించు యత్నమేమియు లేక పండితసేవ్యమై పాండిత్యప్రకర్షా ప్రధానమై యీ కావ్యమొప్పుచున్నది ప్రబంధలక్షణములని నిర్వచింపబడిన వస్త్వైక్యత ఏకనాయకాశ్రయాదులు సిద్ధించినవి వర్ణనాత్మకమై అలంకృతమై యీ ప్రౌఢకావ్యము సంస్కృతములోనికి ననువదింపబడిన దన పండితుల కీ కావ్య మెంత యాదరణీయమయ్యెనో వేఱుగ జెప్ప నక్కర లేదు అందులనే రామరాజభూషణుడు ప్రసిద్ధప్రబాధకవుల సరసను సుఖాసీనుడయి సారస్వతీయులకు గౌరవార్హుడయినాడు

# 11

# పాండురంగ మాహాత్మ్యము

[ తెనాలి రామకృష్ణుడు ]

అష్టదిగ్గజములలో నొకడని సాధారణముగ జెప్పబడువాడును, పరిహాసప్రియుడును, వికటకవియు, విమర్శకుడును, పండితప్రకాండులకు గూడ గుండెబెదరయి 'ఒకని కవిత్వము దెనయు తప్పులు నొప్పులు నాకవిత్వమం దొకనికి దప్పుపట్ట పని యుండదు' అని చెప్పదగిన ఉద్దండకవిమాన్యుండు తెనాలి రామకృష్ణకవి ఈకవికృతము లని అనేక చాటువులు చెప్పబడుచున్నవి. అవి యెన్ని? యెంతవఱకాతడు రచించినవో నిర్ణయించుట దుష్కరము. అం దొకటియని చెప్పబడు పద్యము—

సీ. ప్రౌఢదీర్ఘసమాసపటిమ చేకూర్చి శ్రీ
నాథుండు గూలార్చె నైషధంబు
దానియట్టిద యలసాని పెద్దనముది
మదిదప్పి రచియించె మనుచరిత్ర
నూహించి తెలియరాకుండ చెప్పె సూ
రన కళాపూర్ణోదయ ప్రబంధ
మఘటితశ్లేష శబ్దాళి గవితంపు
బస యడంచె మూర్తి వసుచరిత్ర

గీ. నిట్టి కవులకు నెల్ల వాకట్టుగోలకు
చెప్పవాడ గవిత్వవైచిత్రి మెరయ
బాండురంగ విజయమను బటిమమీఱ
విష్ణు వర్ధిష్ణు డను రామకృష్ణకవి

పాండురంగమాహాత్మ్యమునకు నామాంతర మేమో యనిన అందు నీ పద్యము కానరాదు ఈ పద్యము రామకృష్ణునిది కాకపోయినను, ఒక విషయమును మాత్రము సూచించుచున్నది ఆ యా గ్రంథముల పూర్వాపరములను రూపించుచున్నది సూరనకళాపూర్ణోదయరచన తరువాతనే వసుచరిత్ర రచింపబడిన దని తెలియుచున్నది భట్టుమూర్తి 'కేవల కల్పనాకథలు కృత్రిమరత్నములు' అను పద్యపాదమునూ ఈ యూహనే బలపఱచుచున్నది పాండురంగ మాహాత్మ్యమున ఆముక్తమాల్యద వసుచరిత్రల ప్రస్తావనకలదు ఆ యా ప్రబంధములు వెలువడిన తరువాతనే యది రచింపబడియుండునని నమ్మవచ్చును

ఆంధ్రకవిత్వమునకు విజ్ఞానసర్వస్వ మనదగిన తిక్కనరచనలను రత్నంపురాసుల గొల్లగొనుట ఆంధ్రకవులకు క్రొత్తకాదు

ఉ. కూర్చుట నూత్నరత్నమునకుం గనకంబునకుం దగన్ జనా
భ్యర్జితమైన భారత మపారకృపాపరతంత్రవృత్తిమై
చేర్చిన దేవదేవునకు ప్రీతిగ నిచ్చుట సర్వసిద్ధ నా
నేర్చినభంగి జెప్పి వరణీయుడ నయ్యెద భక్తకోటికిన్ ''

అను తిక్కనార్యుని పద్యమును రామకృష్ణుడు మనసునం దుంచుకొని కవి తన రచనయందు జూపందగు శిల్పచాతుర్యము, కవితయందలి పూజ్యభావమును భగవద్భక్తి మొదలగు వానిని గ్రహించినటుల గన్పట్టును.

సంస్కృతాంధ్ర పదముల కూర్పునందు రామకృష్ణునకు గల నైపుణ్యము ప్రబంధ కవులలో ననేకులయెడ మృగ్యము రాయలోకనాడు ఆస్థానములో ''సంస్కృతసాహితీపటిమ చాలని

వాని కవిత్వము ఏటికిన" అని యాస్థానకవుల బ్రశ్నించెనట. బాలుడగు రామకృష్ణుడు "సంస్కృతి సాహితీపటిమ చాలనివాని కవిత్వము ఏటికిన్" అని గంగలోనికను అర్థము స్ఫురించునటుల మఱల నా చరణమునే ప్రత్యుత్తరముగ జదివెనట. అర్థముగాని దీర్ఘసమాసములును, నూహింపరాని చిక్కుకల్పనలును, గాఢ శ్లేషరచనలును రామకృష్ణుని మతము కాదని తోచుచున్నది. నిగమశర్మ సుశీలల చరిత్రలు చదివిన కవిత్వ మెంత ప్రసన్నమైనదో, రచన ఎంత సరళమైనదియో కన్పడును ఇట్టి మృదుమార్గముల నలవఱచుకొనియు మధ్యమధ్య క్లిష్టగతిని పద్యరచన సాగించినాడు ఇటులగుటకు కారణములుగలవు బహుసంస్కృత పదమధ్యమున తెనుగుమాటను, బహుళాంధ్రపదమధ్య నొక సంస్కృతపదమును టంకమువలె నతికి సువర్ణ పద్యాభరణమును సిద్ధముచేయుటలో స్వర్ణకారతనము జూపినాడు తెనుగుపదముల పద్యము నంతను నడపినను, దానికి సంస్కృత సహజమైన ధ్వని గాంభీర్యము నాపాదించును కవులు ప్రతియోగముచే వస్తుప్రకాశమును జేయవలసి వచ్చినప్పుడు భిన్నభిన్న పద్యములు వ్రాసి యా గుణమును పోషించిరి ఈ కవి యొకపద్యమున పూర్వాపరభాగముల కట్టి ప్రతియోగమును గలిగించినాడు ఈ నైపుణ్యమాతని సీస పద్యముల బరసీమ నందినది

సీ. శ్రోత్రియుండ నీతరముదాక విశుద్ధ
తరమైన వంశంబు దలచవైతి
తత్తిదొక్కయున్న యీ తలిదండ్రుల జాఁ
పఱచవై సంతోషపఱచవైతి
నగ్నిసాక్షిగ బెండ్లియాడిన యిల్లాలి
నిల్లాలికాకార నోల్లవైతి
ధర్మశాస్త్రార్థ విత్తముల విత్తములచే
నలరించి విఖ్యాతి నందవైతి

గీ॥ కల మఖిలంబు నిది పిల్లి కల యనుచు
జదువులని యెల్ల జిల్కల చదువు లనుచు
దోడివారలు నవ్వ నాతోడ యేల
బేలవైతివి యీగుణం బేల నీకు?

రామకృష్ణుడు స్వతంత్రుడైన కవి ప్రబంధకవులలో జాల మంది యనుకరణగోష్ఠమునకు బాల్పడినవారే స్వతంత్రులైన కొలదిమందిలో నీతడొకడు భావములు స్వతంత్రములు శబ్దగుంభనయు స్వతంత్రముగనే యుండును చర్వితచరణము కాకపోవుటచేతనే యీతని భావగతి సుబోధముగాక లోతుగ నాలోచింప వలసినదై యుండును భాషలో స్వతంత్రత, అప్రసిద్ధపదముల ప్రయోగము లోనగునవి యీతని పద్యమునకు కొన్నియెడల క్లిష్టత చేకూర్చినవి సమాసములో నొక పదమర్థము కానియెడల ఆ పద్యమే దుర్బోధకముగ నుండును తఱచిచూచిన గాని యీతని రచనలయందలి యర్థగాంభీర్యము దాని కాధారమైన భావనాపటిమ స్పష్టముగా గన్పడవు బాలగోపాలమూర్తి వర్ణనలో తదంతర్గత భావములలో నొక్కటియు బూర్వకవుల నుండి గైకొనబడినవి కావు అన్నియు స్వతంత్రములు గంభీరములు, జాతీయములను స్వీకరించియు సృజించియు నందంద వాడినాడు. సీసపద్యములన్నియు నొకదాని నొకటి పోలక ప్రత్యేక లక్షణములు గలిగినటుల గాన్పించును శ్రీనాథుని తరువాత సీస పద్యముల వివిధగతుల నింతయందముగా నడపించినవారు లేరు వర్ణనలు స్వాభావసిద్ధములు పాండురంగమాహాత్మ్యము రసోపేతమై నిబ్బరమైన పాండిత్య కవితావైభవోపేతమై పండితజనాహ్లాదకారియై యొప్పుచున్నది . ఈ పద్యముల జూడుడు

శా॥ కాశీహార్యసుతాళినీవికచరాజీవంబు విశ్వేశ్వర
జ్యోతిర్లింగ విశుద్ధరత్నఖని మోక్షోపాయ దుర్గాద్రిశై
లాటీ రావని దుండి నామక గజాలానంబు గంగామృత
స్రోతోనిస్స్రుతి చంద్రగోళమన మించున్ గాశి కాశికయై

శా. గంగాసంగమ మిచ్చగించునె మదిన్ గావేరి దేవేరిగా
నంగీకారమొనర్చునె యమునతో నానందమున్ బొందునే
రంగత్తుంగ తరంగహస్తముల నారత్నాకరేంద్రుండు నీ
యంగం బంటి సుఖించునే గుణభద్రా తుంగభద్రానదీ

పుండరీకుని హృదయదర్పణమున ప్రతిఫలించిన శ్రీకృష్ణుని స్వరూప మెంత స్వభావసిద్ధమున చిత్రింపబడెనో చూడుడు.

సీ. మును మీనగుటబట్టి మునులు వైచినబత్తి
వలజోలె జిక్కి మాదల దలిర్ప
వెలితిగా జలిగొన్న వెన్నముద్దయు బోలె
శంఖంబు వామహస్తమున దనర
జగదండవహ కాల చక్ర భ్రమణహేతు
దండమై నిజధేనుదండ మమర
పంచిబట్టిన పద్మజాతాండముల లీల
వలకేల గ్రచ్చకాయలు ఘటిల్ల

గీ. గలయబూచిన కల్పవృక్షంబుచాయ
సరసవనపుష్పమాలికాధర సమగ్ర
విగ్రహముతోడ విలసిల్లు విఠ్ఠలు నెదుట
మందప్రోయాంద్ర కూరిమి ప్రమానిపండు

ఇట్టివి యెన్నియేనియు కలవు మానవుల స్వభావములను దేశకాల సంప్రదాయములను పెద్దలయెడ బాటింపవలసిన మర్యాదలను నాగరికుల మనుకొనువారి నడవడులనువర్ణించుటలో ముఖ్యముగా పాత్రీకరణ చిత్రీకరణములలో రామకృష్ణుని ప్రతిభ గన్పట్టును.

ఆటవిక గ్రామీణస్త్రీల వర్ణన నెటుల జేసెనో చూడుడు. దానియందొక చమత్కృతి గనిపించును

"కానలబట్టిన తీగపెనచే జమరవాల
పరికరంబుల జుట్టుపట్టి తిగిచి
కమ్మసంపంగి మొగ్గల నిరుగడ రాయు
జేగురు దిరికల జెంపవెట్టి"

పూర్వకవులు తమ దేశాచారములు, దేశమునందలి విద్యలు, దేశిక్రీడాది వర్ణనలు, పలుకుబడుల సొగసులు తమ కావ్యముల బహుళముగా వర్ణించెడువారు రామకృష్ణుడును శ్రీకృష్ణుడు బ్రహ్మను దాగుడుమూతలాడించెనని గోవర్ధనగిరితో కందుకక్రీడ సలిపెనని రాసక్రీడ నాలుగు స్తంభాల యాటయనియు ఉపమించెను. కాళియాహి నెత్తిమీద తన్ను బిళ్లయాట కృష్ణు డాడె ననుటలో నెంతయు సొగసుగలదు ఇట్టివర్ణన లనేకములు కావ్యశోభను ఇనుమడింప జేయుచున్నవి

రామకృష్ణుడు ఉద్భటారాధ్య చరిత్రమను శైవగ్రంథమును ఘటికాచలమాహాత్మ్య పాండురంగ మాహాత్మ్యము లను వైష్ణవ గ్రంథములను రచించెను ఉద్భటారాధ్యచరిత్ర రచించిన రామలింగము వేఱనియు రామకష్ణుడు వేఱనియు వాద ముండెడిది మన సారస్వతమున నిట్టి భేదభావములు వాదనలు పెక్కులుగలవు నన్నయ ఆదికవి యగునా? ఆంధ్రశబ్ద చింతామణి నన్నయ రచించెనా? ఆముక్తమాల్యద రచించినది రాయలా, పెద్దనయా? రంగనాథరామాయణము రచించినదెవరు? క్రీడాభిరామము వల్లభామాత్య విరచితమా? శ్రీనాథుడే రచించి యాతని పేరున ప్రచురించెనా? భట్టుమూర్తి రామరాజ భూషణు లొక్కరా వేఱా? కాళహస్తిమాహాత్మ్యము రచించిన ధూర్జటియే కాళహస్తీశ్వర శతకమునుగూడ రచించెనా? అను సందేహములను పండితులు విమర్శించి సత్యము దేల్చిరి అటులనే రామలింగ రామకృష్ణు లొకరే యనియు శ్రీ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నిర్ధారణ జేసిరి రామకృష్ణుడు మొదట శైవుడైయుండి రామలింగ మనబరగి యావసదశయందు ఉద్భటారాధ్యచరిత్ర రచించి దేశ మంత్రికి నంకితమిచ్చెను ఈ దేశమంత్రి కొండవీటి దుర్గాధ్యక్షుడగు నాదెళ్ళ గోపమంత్రికడ ప్రధానోద్యోగి శైవాచార పరాయణుడు చంద్రశేఖర వాచంయమిని యొక్కయు, శ్రీ శంకరాచార్యకృత సౌందర్యలహరికి వ్యాఖ్య వ్రాసిన లొల్లలక్ష్మీ

ధరపండితుని యొక్కయు శిష్యుడు, పండితుడు అట్టివాని కంకితమీయబడిన ఉద్భటారాధ్య చరిత్ర ముత్తమ కవితాశైలిని రచింపబడినది ఈ పద్యము జూడుడు.

మ కవులుం జారణులుం బ్రధానులు మహీగణ్యుల్ పురాణజ్ఞులున్
వివిధార్థుల్ సఖులుం బురోహితులు సర్వీనాథులుం జోస్యులున్
ధవళాత్ముల్ గొలువంగ నిండుకొలువై దైవారు హర్షంబుతో
నవధానంబున నుండి శంకరకథావ్యాసక్తి భాసిల్లుచున్.

ఈ పద్యమును బోలినదే పాండురంగ మహాత్మ్యమునందలి యీ పద్యము.

మ కవులున్ జారణులున్ బ్రధానులు నలంకారజ్ఞులున్ బ్రాజ్ఞులున్
ధవలాత్ముల్ భజియింప నిండుకొలువై తారేందు తారావళీ
ధవళంబైన సువర్ణకంభయుత సౌధంబందు నాస్థానమై
వివిధామ్నాయ పురాణగుంభనకథల్ వించున్ బ్రమోదంబునన్.

వయసుమీరిన తరువాత రామలింగము వైష్ణవ గురువుల ఉపదేశము నంది వైష్ణవమత సాంప్రదాయము ననుసరించి రామకృష్ణుడై ఘటికాచల మహాత్మ్యమును వయఃపరిపాకము నందిన తరువాత పాండురంగ మహాత్మ్యమును రచించియుండునని విమర్శకులు తెల్పిరి

ఈతని రెండవ గ్రంథమగు ఘటికాచల మాహాత్మ్యము ఖండోజీరానను మహారాష్ట్ర బ్రాహ్మణున కంకితమీయబడినది దీనియందు శబ్దాడంబరముగాక వేఱొండు కవితా వైదగ్ధ్యము కనబడదనియు, అంత రసవత్తర రచన గాదనియు విమర్శకులు కొందఱందురు

రామకృష్ణుడు రచించిన మూడవ గ్రంథము పాండురంగ మాహాత్మ్యము ఇది ఆంధ్రపంచ మహాకావ్యములలో నొకటి ఇది విరూరి వేదాద్రిమంత్రి కంకితమీయబడినది సాధారణముగ కవులు తమ కృతులను ప్రభువులకును గొప్ప సంపన్నులకు నంకితమిచ్చి

ధనమును సంపాదించి సుఖజీవనము గడపుట కలదు. బమ్మెర పోతనవంటి మహాభక్తులు కొందఱు తమ కృతుల నరాంకితము సేయక భగవదర్పితము జేసినవారు కలరు రామకృష్ణకవి యీ రెంటికిని విలక్షణముగ తన గ్రంథములను సామాన్యులకు కృతి యిచ్చెను. పాండురంగ మాహాత్మ్యకృతిభర్త వేదాద్రిమంత్రిమంగ యగురువరాజు పుత్రుడగు పెదసంగభూపాలునివద్ద వ్రాయసకాడు ఉద్భటారాధ్య చరిత్ర కృతిభర్తయు ధనవంతుడు గాడు. ఒక సామాన్యరాజోద్యోగి ఘటికాచలమాహాత్మ్యము నంకితముగొన్న ఖండోజియొక సామాన్యసామంతుడు ఇట్టికృతిభర్తలవలన ధనము సమృద్ధిగ లభించుననను అవకాశము లేదుకదా ధనలుబ్ధుడు గాక గుణలుబ్ధుడై రామకృష్ణుడాయాకృతుల వారివారి కిచ్చియుండును

నడమంతరముగ వైష్ణవుడైన రామకృష్ణునియందు అద్వైతభావము నశింపలేదు శివకేశవ భేదభావ మాతనికి లేదు. రాయలు పరమ వైష్ణవు డగుటచే శివుని ప్రస్తుతింపలేదు రామకృష్ణు డన్ననో గ్రంథారంభమునందే గాక సందర్భము గలిగిన చోటులనెల్ల శివుని స్తుతించినాడు. రామకృష్ణుడు వైష్ణవమత సాంప్రదాయము ననుసరించిన యద్వైతి అతని యుపాస్యదైవతము శ్రీకృష్ణుడు ఆకవి రచించిన పాండురంగమాహాత్మ్యమును పౌండరీకమహాత్మ్యమనికూడనందురు గీర్వాణభాషయందు పాండురంగమాహాత్మ్య మను క్షేత్రమహాత్మ్యము కలదట అది రామకృష్ణుని కృతికి సంస్కృతానువాద మని కొంద ఱందురు రామకృష్ణుడే దానిని మూలముగ గ్రహించి యాంధ్రమున కనువదించి యుండునని కొందఱందురు ఏది సత్యమో నిర్ణయించుట కష్టము. రెండవ యూహాయే సత్యమనినను రామకృష్ణుని రచన అనువాద సాహిత్యమునకు జెందినటు లుండక సర్వస్వతంత్రమై స్వయం సంపూర్ణమై మౌలిక కావ్యమువలెనే యున్నది

సామాన్యముగ ప్రబంధముల రచించిన కవులు కొంత వఱకు ప్రయత్నముగా తమ శక్తిని ప్రదర్శించి పిదప తమ ప్రయ

త్నమును సడలింతురు. ఇది మనుచరిత్రాదులయందు సహితము గానబడును. మనుసంభవకావ్యపు మొదటి మూడాశ్వాసముల గల సొంపు ఉత్తరార్థమున గన్పడదు ప్రతి ప్రబంధమునందును మొదటి యొకటిరెండాశ్వాసముల నుండు బిగివి, రసవత్తరమగు కవితాప్రౌఢిమ చిట్టచివర లోపించి కథాకథనమునకే ప్రాధాన్యము నిచ్చునటుల గాన్పించును. కాని పాండురంగ మాహాత్మ్యము తొలినుండి కడవఱకు నొక్కే పద్ధతిలో నున్నది, వర్ణనలు చిన్నవయినను హృదయంగమములు, కల్పనలు మనోహరములు. అలంకారము లతిసహజములు. ప్రౌఢములు ఈ పద్యముల గమనింపుడు

గీ పద్మరాగమణిమయ పాదలబ్ధి
స్ఫురిత గైరిక శిఖరచంచూసమృద్ధి
గంధవతి యను నొక్క పంకజమునడుమ
మించు నక్కొండకాదమ రాయంచబోలి

ఇందలి యుపమ అసాధారణమైనది మఱియొకటి

సీ|| పూవుదేనియ దడిసిన మావిచిగురు
మీద నంటి చరించు తుమ్మెద తలిచ్చు
సమయమగుటయుమ్మనినొయ్యి సమరిమరుడు
త్రుప్పు వో దోము నీలంపు దునుకయనగ.

ఇందలి యుత్ప్రేక్ష ఎంత హృదయంగమముగ నున్నదో యోచింపుడు త్రివళుల నెంతి యాశ్చర్యకరముగ వర్ణించెనో కనుడు.

కం ఇట నభ మిట భూవలయం
బిట బలిసద్మంబు నుండు నిరవు లివి ధ్వనిం
బటువులగు వళుల చెలువున
బుటపుటపై యున్న చిన్న బొజ్జ కదలఁగన్

కథాకథన మింపుగ నుండును. ఆ యా కథల నన్నిటిని గుదిగూర్చిన సూత్ర మున్నది ప్రతి కథయు ప్రత్యేక ప్రయోజ

నము గలిగియున్నది నిగమశర్మ వృత్తాంతము, పుండరీకుని సుచరిత్రి, రాధికాతపశ్చరణ, సుశీలోపాఖ్యానము అగస్త్య శిష్యుల వృత్తాంతము సమానాదరణార్హములే ప్రతిదానియందు నొక ప్రత్యేకతయు, గ్రొత్తదనము గలదు కవి సంకల్పించిన కావ్యప్రయోజనము సిద్ధించినది ప్రతియుపాఖ్యానము కావ్య పరమావధికి కార్యకారణసంబంధము గలిగి పాండురంగ క్షేత్ర మాహాత్మ్యమును విశదీకరించుచున్నవి

ప్రబంధములు శృంగార రసప్రిధానమగు కావ్యములు పాండురంగ మాహాత్మ్యమునుగూడ ప్రబంధములలో జేర్చిరి ఇది యెంతవఱకు సమంజసమో కాళహస్తి మాహాత్మ్యమునందును శృంగారరసమయఘట్టములు గలవు అందు శృంగారము మితి మీఱి వర్ణింపబడినది వేశ్యవాటికలు వేశ్యమాతలు వారి కుచేష్టలు భుజంగుల చేష్టలు అతిస్వాభావికముగ చిత్రితము లయి నవి పాండురంగమాహాత్మ్య కావ్యమునందు శృంగార రసవాసన గల కథ నిగమశర్మచరిత్ర వాడు దుష్కాముకుడు పవిత్ర ప్రేమ యనునది యే కోశమున లేదు వానిది తుచ్ఛమగు మోహము మన కావ్యముల శృంగార రసపోషణ యంతయు దంపతుల పరస్పరప్రేమ యాలంబమున పోషింపబడినది ఆ దంప తుల వివాహముతో స్థిరీకరింపబడి పుత్రోదయముతో శాంతము నందు పర్యవసించును కావుననే కాళిదాసాది మహాకవులు ఆది రసమగు శృంగారరసమును కావ్యరచనయందు స్వీకరించిరి నిగమశర్మ కాముకవ్యాపారమును శృంగారరసభావమున పరిగ ణించుట ఎంత సరసమో? దానిని మలినశృంగార మనవలయును ఈ నికృష్టుని కథ యాధారముగ పాండురంగ మాహాత్మ్యము శృంగారరసప్రధాన మనియు అక్కటన ప్రబంధ మనియు చెప్పుట యేటి న్యాయమో విజ్ఞు లాలోచింపవలయును నిగమ శర్మకథ కావ్యమునకు ప్రిధానేతివృత్తము కాదు పుండరీకుని పితృభక్తి ఫలితము తపోనిష్ఠాదుల ఫలితము పండరిక్షేత్రఆవరణ

ఆ క్షేత్రమాహాత్మ్యమే పాండురంగమాహాత్మ్య మను కావ్యము. కాళహస్తిమాహాత్మ్యమున శృంగార రసపోషణ మితి మీఱుటచే మాహాత్మ్యమను పదమందలి యౌచిత్యము తగ్గిన దందురు. రామకృష్ణుడటుగాక నిగమశర్మకథలోని అపభ్రంశశృంగారమును పోషించుటలో నెంతేని నిగ్రహము జూపెను.

నిగమశర్మకథకు కావ్యప్రధానేతివృత్తమునకు గాని యితర కథలకుగాని సంబంధముగాని పోలికలుగాని లేవు. పండరీక్షేత్రమున ముక్తుడగుట యను విషయమే ప్రధానేతివృత్తమునకు దీనికిని గల సంబంధము నిగమశర్మ 'ప్రాసగు విత్తువంటి నెఱపాఱు కొలంబును జెరుప సాలగ్రామ ఖనిని జనించిన జాత్యల్పపాషాణము. అత డనూచారసంతతి నవతరలియు సకలనిగమ శిఖారహస్యముల గనియు మనసు దార్తీయ తృతీయ పురుషార్థమునకే మఱలినాడు. వీనికి తరుణిఫాలంబు, చివితిచందురుడు, వేశ్యనుదురు వానికి ప్రతి పద్దిందుండు వాని తాతముత్తాతతండ్రుల తరతరములనుండి చీమవలె గూడబెట్టిన ధన మంతయు వాని దుర్వ్యసనముల కాహుతియైనది. హారతికర్పూరమువలె హారించినది ముక్తాహం బందు నఖండసేతువృతముల్ కాశ్మీరఖండంపు గేదారంబున తెగ నమ్మినాడు' అతడు

చ. తన చెలులిండ్లయం దదవద్రావుడు త్రావుచు నింటి కన్నడున్
జనక దురోదరార్జితము చౌర్యహృతం బన్యపతోపపన్నమున్
చెనటి పిసాళివెచ్చముల జేర్చుచు దొల్లిటి వైభవంబు లె
ల్ల నడగ నవ్వాడగు కడులాఘవవృత్తికి జొచ్చె నిచ్చలున్.

పూవులుముడిచిన యంగళ్ళనే కట్టెలు మోయుస్థితి వచ్చినది ఇటు లుండ 'ఆలో నొక డాగుళ్ళలరతుని యక్క యోర్తు శిక్షించెద నీబాలిశు' నని వచ్చినది ఆపె పాత్రచిత్రణ మొంతయు నమోఘము. అట్టిది 'నభూతో నభవిష్యతి' రామకృష్ణుని పాత్ర నిర్మాణ పోషణాప్రతిభ కుత్తమోదాహరణము. ఆమె పద్మకర్ణిక గొలువున్న పద్మవోలె, చేటికాసీత పోరికాసీన యగుచు

తమ్ముని వివిధవిధముల లాలించి, పొగడి మచ్చికజేసి మంద
లించిన తెలుంగు సహృదయవేద్యము ఆపెనామ మేమో రామ
కృష్ణుడు మనకు చెప్పడు ఆపె బోధల సన్మార్గమునకు మఱలిన
వానివలె కొంతకాలము వర్తించె నా తేనెపూసినకత్తి ధాత్రీ
సుతుండు ' ఒకనాటి రాత్రి మాతృభూషణములు నత్తికామండన
ములు నిజయువతి దాల్చు సొమ్ములు అన్నియు హరించి యిల్లు
వెడలి యొకరుండు బేరడవిలో బారుచునుండ చోరులు వాని
కాయంబున గాయంబులు చేసి యతనిని దోచుకొనిరి ఆ దారిని
పోవు కాపుకొడు కొక్కరుండు దయదలచి యా క్షతగాత్రుని తన
గృహము జేర్చి గాయములు మాన్పి యుపచారములు జేసి
పోషించుచుండెను వానిని దేవునిగా దేశికోత్తమునిగ, పర
మాప్తునిగ బూజించుచుండెను నిగమశర్మయు తలలో నాలుక
వలె పూవులలో దారమువలె పాలకలిసిన నీరము భాతికలిసి
యుండినను వాని పాపపు తలంపులు వానిని విడువలేదు పుట్టలో
బుట్టినబుద్ధి పుడకలతోగాని పోవదుగదా కాని తలంపులు మరల
మొలకెత్తసాగినవి తలపుండ్లు కడిగించి తనను బ్రతికించి కన్న
బిడ్డగా గారవించి, గుడువుగా భక్తితో బూజించుచున్నాడను
విశ్వాసముకూడ లేక తిన్నయింటి వాసముల లెక్కపెట్టినాడు,
అన్నముపెట్టిన చేతినే కరచినాడు కాపువాని పడతితో పలాయన
మయినాడు గంపెడంతకాపురము గంగగలిపిన దా కులట. ఆ
కృతఘ్ను డొక బోయపల్లె జేరినాడు వారితో కలిసి మధుమాంసా
దుల సేవించుచు కిరాతకృత్యములకు లోనై కులభ్రష్టుడయినాడు,
కాపుపడతి మరణింపగా బోయిత నొకదానిగూడి సంతానము
గాంచినాడు విధివశంబున వారందఱు అగ్నిలో నాహుతులై
మరణింపగా వాడెంతయు దుఃఖపరవశు డయినాడు 'ఎల్లరు
నెల్లచో ధనములిచ్చి మృగాక్షుల గొందు్రగాని యో పల్లవ
పాణి యేబరముపావనవంశము నిచ్చికొంటి నీ నల్లనిరూపు నిక్క'
మని అని యెన్నో విధముల విలపించినాడు తన యాలిని దన

యాలిని దలంచుచు, వారికొఱకు దురపిల్లుచు తిరుగసాగినాడు. అటుల దుఃఖించుచు నిద్రాహారములు మాని ద్రిమ్మరుచు పండరీ క్షేత్రము జేరినాడా కర్మచండాలుడు.

ఉ చేరువచేరువై కడు బచేళితమై తను డాయుపూర్వ సం
స్కారతపఃఫలంబున తత్పరసుధామవతిన్ బలుమాఱు జూచుచున్

అటుల నృసింహమూర్తిని బలుమాఱు జూచుచు భార్యా పుత్రులకొఱకు దురపిల్లుచు గాలము గడవ వాడు విగతజీవుడై పుడమిని బడియె సత్కర్మలొనర్పక, కులధర్మముల వోనాడి, దుష్కర్మలనే చేసిన యా పితృద్రోహిని, మిత్రద్రోహిని, పరనారీ పరధనాపహారుని, విశ్వాసఘాతకుని జాతిఛండాలుని జముని సేవకులు పొదిజ శిక్షించిచేకొనుచుండగా, నీ బాధల సహింపక వాడాక్రోశింపసాగెను ఆ ఆక్రోశమును వినిన హరిభృత్యులు జము కింకరుల నదల్చి వాని జీవముల వైకుంఠమునకు జేర్చిరి. అచట వాడు విష్ణువుతో సామీప్యము నంది కుముదుడను పేర జయవిజయులతో సమాన ప్రతిపత్తి నంది హరికి ప్రీతు డాయెను.

సీ భ్రూణహంతయును సురాపుడు బ్రహ్మఘాతియు
గురుతల్పగ స్తేయగోవధోప
జీవి పితృద్రోహి శిశుహంత పరదార
రతుడు నిందకుడు సర్వస్వభోక్త
సత్యరిక్తుడును సర్వాభిమర్శ హే
తికుడు సర్వపలాశు డశుచియు
నిజధర్మ విద్వేషి నీచుండు పాషండ
ప్రవణుడు స్వేచ్ఛావిహారి హరి

గీ కృత మెఱుంగని వాడ కూకృతము లేని
వాడు నమ్మిన జెడచూచువాడు మొదలు
పాపకారుల కేనియు బౌండరీక
తీర్థహరమూర్తియుగ మిచ్చు దివ్యపదము

ఆ మూర్తి కరుణ యట్టిది ఆ క్షేత్రమహిమ యంతటిది. ఆ తీర్థపావిత్ర్య మంతటిది. మూర్తి క్షేత్రతీర్థంబు లొకే స్థలమున

నుండి భూలోక వైకుంఠముగ వెలువొందుటచే పండరీక్షేత్రము పవిత్రమైనదనిగదా సాక్షాత్ శంకరుడే కొనియాడెను ఆ తీర్థముల గ్రుంకినవారు సర్వతీర్థముల నాడిన ఫలము నందుదురు ఆక్షేత్రమున జేరినవారికి సర్వక్షేత్రాభిగమ్యపుణ్యఫలము లభించును ఆ దైవమును దర్శించిన సర్వదేవతాదర్శన భాగ్యఫలము గలుగును శంకర అంబుజాసనాదులచేతను దేవేంద్రాది దిక్పాలుర చేతను నారదాది భక్తులచేతను పరివృతుండై భక్తజన పారిజాతమగు శ్రీమన్నారాయణుడు పుండరీకుని తపము భూదేవిభారము, ఫలమునందజేయ, దొలగజేయగోరి పండరిక్షేత్రమున వెలసినాడు అదియే వైకుంఠము రామకృష్ణుడు భూలోకమున సర్వదేవ సంసేవితమైన వైకుంఠమును నెలగొల్పినాడు దైవము క్షేత్రము, తీర్థముల మూటిని సమకూర్చినాడచట ఏదైవమును ప్రార్థించినను దర్శించినను ఏతీర్థమును గ్రుంకినను సర్వదేవనమస్కార, కేశవం ప్రతిగచ్ఛతి'' అను ధర్మముప్రకారము, ఆ పండరినాథుని సేవించిన ఫలము దక్కును

ఈ కావ్యమున ఇతరగాథల తెలుంగు వేఱు ఘోరపాపముల జేసినవారుకూడ తరించు మార్గమును సూచించినది నిగమశర్మగాథ పుండరీక సుశీలాదుల వృత్తాంతములు వేఱు తిర్యక్కులగు కాకహంస చిత్రశీకభుజంగమ సరిఘుల చరితము లింకొకవిధము రాధవృత్తాంతము మఱొకతీరు వీరందఱు పాండురంగని కృప నంది తరించినవారే జ్ఞాతాజ్ఞాతకర్మఫలము ననుభవింపక తీరదను సత్య మీకథలయందు నిరూపింపబడినది ధర్మాచరణులు శ్రీయఃపతికరుణాలోకనమునకు బాత్రులగుదు రనునది స్థిరీకరింపబడినది

పుండరీకుడు ఆర్యజనస్తవనీయచర్యుడు సత్యదయార్జవ శాంతిదాంతి గుణవిభాసితుడు పితృమాతృ సేవాపరాయణుడు వారి యడుగులకు మడుగులొత్తుచు వారినే దైవతములుగా పూజించినాడు

ఇట్లు కడువృద్ధులు శిథిలబుద్ధులు నగు జనయిత్రీజనకుల సేవ జేయుచు పరలోకావాససుఖాదరపరతం జనిన తల్లిదండ్రులకు పితృకర్మ జేసినాడు  వారి యస్థికల గంగ జేర్చినాడు  గయలో పిండప్రదానము జేసినాడు  నిజపత్నియందు పుత్రుల గాంచి పితౄణమంతయు దీర్చినాడు  ప్రాయపు ప్రొద్దంత గొంత పడమర దిఱుగగ నిహాలోకసంపదాదుల నిరసించి శేషశయనుగను నఖిలాఘోన్నతి శ్రీకృష్ణుని జగన్మోహన సుందరరూపమును మానసమున గల్పించుకొని తపమాచరించెను  వాని పితృభక్తికి తపశ్శక్తికి మెచ్చి భక్తుల కొంగుబంగారమగు శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షమై భక్తుని యభీప్సితము నాదరించి, యాక్షేత్రమునకు పుండరీకుని నామము శాశ్వతము జేయుటకు పుండరీకక్షేత్ర మని నిర్వచించి తా నచట పండరినాథుడుగ శాశ్వతావాసము గల్పించుకొనెను  ఆపుండరీకుని తపఃఫలితమే భూలోకవైకుంఠమగు పండరి క్షేత్రము  ఆచట మూర్తీభవించిన దైవము పాండురంగనామమున వెలసిన శ్రీకృష్ణభగవానుడు ఈకావ్యము పాండురంగమాహాత్మ్యము. ఈ కావ్యమునకు పుండరీకుని చరిత్ర ప్రథమకారణము.

సుశీలచరితము వేఱు. పూర్వజన్మమున గోరూపము నంది బాలకృష్ణుని మురళీనినాదమునకు మురిసి మైమఱచి పాలు కురియ ఆ పాలఫేనము వాయువశత వెళ్ళి శ్రీకృష్ణుని మౌళి నలంకరించి యభిషేకించినవి  ఈ అభిషేకము అజ్ఞాతము. అయినను తత్ఫలితమున, ఆ గోవు మఱుజన్మమున ఉత్తమవైష్ణవ దంపతులకు జన్మించి సుశీలాభిధానమున ప్రవర్తిల్లినది  ఆ జన్మంబున దుష్టుడైన భర్తచే బహువిధముల బాధల నందినది తృణీకరింపబడియు

కం॥ పతి కొట్టిన బతి దిట్టిన
బతి నిర్దయుఁ డగుచు నెట్టి పాటుపఱిచినన్
మతి నన్యథాత్వ మొందక'

పతియే దైవమని పూజించిన మహాపతివ్రత  పూర్వకర్మఫలమున ఉత్తమదంపతులకు జన్మించిన ఈ యుత్తమసాధ్వి పాతి

ప్రత్యపవిత్రజీవితమునకు మెచ్చి భగవానుడు బ్రాహ్మణవటువు రూపమున ప్రత్యక్షమై వరము లొసంగినాడు తరింపజేసినాడు తన పాతివ్రత్యఫలితముగ కారణజన్ములగు పుత్రుల గాంచి సశరీర ముగ వైకుంఠము జేరినది ఆ పుణ్యరాశి కడుపున జన్మగాంచు భాగ్యము గాంచినది యెవరు? సమాధానమునకీ పద్యముజూడుడు

గీ నా సుశీలకు నళ్కాకహంస చిత్ర
శుక భుజంగమసరఘులు సురధనుల భ
సుముఖసువ్రత సుకృతి నామములు వరుస
దాల్చి జనియించె సుక్తిముక్తాలువోలె

ఈ తిర్యక్కులకీ ఫలము గల్గుటకు కారణములు అజ్ఞాత కృతములే శ్రీయఃపతిని సేవించిన పూజించిన, నివాళినెత్తిన, ప్రసాదము స్వీకరించిన పాదోదకము శిరసున ధరించిన సంకీర్త నము జేసిన వినిన సంస్మరించిన జ్ఞాతాజ్ఞాతవిభేదము లేక ముక్తి గాంతు రని సిద్ధాంతీకరించినాడు కవి సత్కృత్యములవలన నుత్తమజన్మ గాంతురు పూర్వాపరజన్మలు మనము చేయుకర్మల మీద నాధారపడియుండు నను సత్యమును బోధించినాడు విష్ణుభక్తులు

శా లోకేశస్థితలోకవాసకృతి సాలోక్యంబు నర్తింప ల
క్ష్మీకాంతాంఘ్రియుగంబు జేరుటయ సామీప్యంబు సద్భక్తి ర
త్నాకారిం దన రూపుగా నిలుపుటన్ సామీప్యమున్ బుద్ధి నా
కౌక శ్శేఖరుగూర్చియున్కి సతి సాయుజ్యంబు నొందుంతుదిన్

ఇది వైష్ణవమత సంప్రదాయము. వైష్ణవమతము స్వీక రించినరామకృష్ణుడుపాండురంగమాహాత్మ్యకృతియందుముక్తియన నేమియో, ముక్తిమార్గము లేవియో విశదీకరించినాడు కాళ హస్తిమాహాత్మ్యమున పూజావిధానభేదముల తరించినవారి చరిత ములు కలవు ఆముక్తమాల్యదయందు జ్ఞానభక్తి సంకీర్తనాది విధానముల ముక్తిగాంచుట వివరింపబడినది పాండురంగమాహా త్మ్యమున నీ రెండుమార్గములేగాక సాయుజ్య మందుటకు స్వధర్మ నిర్వహణముకూడ చెప్పబడినది

జ్ఞాతాజ్ఞాతకర్మఫలితాదుల విపులపఱచి కర్మభూమియగు మర్త్యలోకమున కర్మయోగమహిమప్రబోధించినాడు రాధాకృష్ణుల ప్రణయము రాధామాధవకవి నిరూపించిన విధముకాదు భాగవతమునందలి గాథకు సరిపడదు రాధ భక్తురాలు బాలకృష్ణుని రూపకల్పన తన హృదయమునందు జేసికొని తపశ్చరణము జేసినది తపస్సిద్ధి నందగ బాలమోహనమురళీకృష్ణుడు ప్రత్యక్షమైనాడు ఆమె తపము సిద్ధించినది తరించినది

పంచమాశ్వాసమున అయుతనియుతుల కథ కారణముగ గృహస్థధర్మవిశేషములు నిరూపింపబడినవి

సీ. జలధరం బన నెద్ది పొలపంబు పుట్టించు
నిల్లాలి మెఱుగుల మొల్లములకు
మున్నీరనగ నెద్ది మొలచుట కావాల
మాణిపూసలువోని యాత్మజులకు
నీడ్రమా కన నెద్ది నిలువ నీడైతోచు
నాకట నుండు ద్విజాపళులకు
దాపన నెద్ది యాధారమో దివి బ్రాఁకు
పితృవర్యులకు గుంటిపిచ్చుకలకు

గీ. నట్టి గృహమేధిధర్మంబునందు నివు
గుత్ససేయుట నీరీతి గొడ్డవ యొదవె
నొప్పుగతి నొప్పుగనగల్ల దుదకులక్షు
గసరి పైవచ్చు తొళ్ళపై గాలియైన

అని వాధూలమహామునీంద్రునిచే మందలింపబడిన అయుతుడు కులధర్మం బెడలించి శ్రీగురునకుం గోపంబు పుట్టించి మిత్రుల సౌభాత్రనివాసదేశమును తోబుట్టులం బాసి యొంటరిగ ఉట్టిగట్టుకొని తపశ్చరణమున ముక్తిగాంచనున్నాడు

కుంభసంభవునంతవాని కోరికనుమన్నింపక తననభిమానించి తనకొరకు వరికోరి తెచ్చిన ధాతృసంజాతుల నిరాకరించి తపమాచరించినాడు అయుతుడు కాని కర్మము భోగమునగాని

నశింప దనునటుల కర్మ మనుభవింపక తీఱలేదు. బ్రాహ్మణవటువు వ్యాఘ్రుం బనాఘ్రాతపుష్పము చందంబగు మేననూన నియమ భాగ్రిష్టాగ్ని దగ్గించుచున్ ఘోరతప మాచరించె

ఆ తపము గాంచిన దలయేర్చినయాఖండలుండు నిప్పుత్రొక్కి నటుల తేలుకుట్టినటుల తపించి శీఘ్రముగ నీతని తపోభంగము జేయయత్నించెను స్వయముగ విఫలుడై కామధేనుముఖంబున గార్యసిద్ధినంద మాయలబన్నెను వాధూలమహామునిచేనయుతుడు శపింపబడి శ్వేతమయి శ్రీ నృసింహదేవుని పండరీక్షేత్రమున సేవించుచు కారణాంతరమున దర్దురంగనఅయినకన్యకుబ్జరాజపుత్రికను జేరి పుత్రులను గాంచి పితృదేవతలకు ఊర్ధ్వలోకగతుల గల్పించి తాను ముక్తిగాంచెను ఈ ఘట్టము కడు రసవంతముగ నడచినది ధర్మబోధ యయినను కవిత ప్రసన్నతాగుణభూయిష్టమై యొప్పినది రామకృష్ణుని కథాకథన వైఖరి కొక మచ్చుతునక

పాండురంగ మాహాత్మ్యము కాళహ[illegible] మాహాత్మ్యమ ఆముక్తమాల్యాదుల పోలిన మాహాత్మ్యమెగాని ప్రబంధము కాదు అందంద శృంగార రసచ్ఛాయలు అంతంతగ గన్పడినను అది ప్రధానరసము కాదు ఇవి యన్నియు భక్తిప్రధానమైన కావ్యములు ఏకనాయకాశ్రయము లనిగాని వస్త్వైక్యము పూర్తి సిద్ధించెననిగాని నిరాక్షేపణగ జెప్పవలనుపడదు ఈ కావ్యమ నందలి గాథలన్నియు చివఱకు శాంతమునందే పర్యవసించినవి ఇట్టి గ్రంథముల మాహాత్మ్యములనియే చెప్పవలయునుగాని ప్రబం[illegible] యుగమున ప్రభవించినంతమాత్రమున ప్రబంధము లనజనదు ఇవియన్నియు మహాకావ్యములు ధర్మప్రబోధకములు కాంత సమ్మితములై ధర్మప్రతిపాదన మొనర్చు ఉత్తమమహాకావ ములు పండితసేవ్యములు.